# విషయసూచిక

## విరాటపర్వము ప్రథమాశ్వాసము



## విరాటపర్వము - ద్వితీయాశ్వాసము



## విరాటపర్వము - తృతీయాశ్వాసము.

## విరాటపర్వము – చతుర్థాశ్వాసము



## విరాటపర్వము – పంచమాశ్వాసము

## ఉద్యోగపర్వము—ప్రథమాశ్వాసము



## ఉద్యోగపర్వము – ద్వితీయాశ్వాసము



## ఉద్యోగపర్వము – తృతీయాశ్వాసము

## ఉద్యోగపర్వము — చతుర్థాశ్వాసము

శ్రీ

హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## విరాటపర్వము, ప్రథమాశ్వాసము.



యన గౌరి నాఁ బరఁగుఁ[1] జెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరాకృతిఁ బొలుపారి, విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చ మెచ్చుపరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్. 1

—♦ కృతినిర్మాణపరిస్తావన. ♦—

వ. అని సకల బ్రహ్మప్రార్థనంబు సేసి తత్ప్రసా[2]దాసాదితకవిత్వతత్త్వనిరతిశయాను
భావానందభరితాంతఃకరణుండ నగు చుండి యొక్కనాఁ డిట్లని వితర్కించితి.

శా. విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు గృ
ష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య[3]మగు లేఖ్యం బైన యామ్నాయమున్. 3

క. వేదములకు నఖిలస్మృతి, వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైనచోటులను దా, మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్. 4

వ. అదియును.

ఉ. ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృత మై పెను పొంది[4] యుండ నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్. 6

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుం గూడఁగాఁ

1. క. చెల్వల. 2. క. గ. దోదితకవిత్వ. 3. క. ఖ. మగునామ్నాయంబు లేఖ్యంబు
గాన్. 4. చ. జ. యుండఁడు.

బదియేనింటఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబు లై పెంపునం
దుది ముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు [1]నిండారఁగన్. 7

క. అని రచనాకౌతుకమున, మన మలరఁగ నీప్రబంధమండలి కధినా
థునిగా నేపురుషునిఁ జే, ర్కొనువాఁడనో యనుతలంపు గూరినమదితోన్.

వ. ఇంచుక నిద్రించుసమయంబున.

సీ. మజ్జనకుండు సమ్మాన్యగౌతమగోత్ర, మహితుండు భాస్కరమంత్రితనయుఁ
డన్నమాంబాపతి యనఘులు కేతన, మల్లన సిద్ధనామాత్యవరుల
కూరిమితమ్ముండు గుంటూరివిభుఁడు కొ,మ్మనదండనాథుండు మధురకీర్తి
[2]విస్తరస్ఫారుఁ డాపస్తంబసూత్ర ప,విత్రశీలుఁడు సాంగవేదవేది

తే. యర్థిఁ గల వచ్చి వాత్సల్య మతిశయిల్ల, నస్మదీయప్రణామంబు నాదరించి
తుష్టి [3]దీవించి కరుణార్ద్రదృష్టిఁ జూచి, యెలమి నిట్లని యానతియిచ్చె నాకు.

వ. "కిమర్థిమాలాం కిము కౌస్తుభం వా, పరిష్క్రియాయాంబహుమన్యసే త్వమ్।
కిం కాలకూటః కిము వా యశోదా, స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే॥"యని
నీవు దొల్లి రచియించినపద్యంబు గాఢాదరంబున నవధరించి భక్తవత్సలుం
డగు హరిహరనాథుండు నీదెస దయాళుండై యునికిం జేసి నిన్నుం గృతార్థునిఁ
జేయం గార్యార్థి యయి నాకలోకనివాసి యయిననాకుఁ దనదివ్యచిత్తంబునం
గలయకారుణ్యంబు తెఱం గెఱుంగునట్టిశక్తిం బ్రసాదించి నన్ను నాకర్షించి
కొలిపించికొని వీఁడె విజయంచేయుచున్నవాఁ డనుచుం జూపుటయు సవిశేషసం
భ్రమసంభరితహృదయుండ నయి యవ్వేలనుం గనుంగొనునప్పుడు. 11

సీ. కరుణారసము వొంగి తొరఁగెడుచూప్పున, శశిరేఖ నమృతంబు జాలువాఱ
హరినీలపాత్రిక సురభిచందన మున్న,గతి నాభి ధవళపంకజము మెఱయ
గుఱి యైనచెలువున [4]నెఱసినలోకర,క్షణ [5]మన గరళంబుచాయ దోఁపఁ
బ్రథమాద్రిఁ దోతెంచుభానుబింబము నా ను,రమ్మునఁ గౌస్తుభరత్న మొప్ప

తే. సురనదియును గాళిందియుఁ బెరసినట్లు, కాంతిపూరంబు [6]శోభిల్ల శాంతమూర్తి
నామనంబు నానందమగ్నముఁగఁ జేయ, నెలమి సన్నిధి సేసె సర్వేశ్వరుండు.

వ. ఏనును భక్తిమయం బగుసాష్టాంగదండప్రణామం బాచరించి కొండొక దొలంగి
వినయావనతుండ నై లలాటోపరిభాగంబున నంజలిపుటంబు ఘటించి నయనం
బులు నవయవంబులును బ్రమదబాష్పసలిలవిలులితంబులును బులకపటలపరి
కలితంబులునుం గా నంతంత నిలిచిన నద్దేవుండు. 13

క. అనుకంపాతిశయంబునఁ, దనదక్షిణనేత్రమును సుధారోచియ కా
నను వింత లేక చూచి వ, దనమున దరహాసరసము దళుకొత్తంగన్. 14

1. క. గ. నిండారుటన్. 2. 'విస్తృతిస్ఫారుఁ' డని యుండిన సమంజసముగా నుండు.ను
3. చ. దీపించు. 4 ఖ. గ. మెఱసిన. 5. క. మనఁగ గళంబుచాయ. 6. గ. శోభిల్లు.

ఉ. వైదికమార్గనిష్ఠ మగుసద్వర్తనముం దగ నిర్వహించుచు
న్భేదము లేనిభక్తి మది నిర్మలవృత్తిఁ జేయుచుండ మ
త్పాదనిరంతరస్మరణతత్పరభావముకల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యరసమ్ముం గొనియాడుచు నుండు దేహమున్. 15

వ. అందును. 16

క. పారాశర్యునికృతి యయి, భారత మనుపేరఁ బరఁగుపంచమవేదం
బారాధ్యము జనులకుఁ ద, ద్గౌరవ మూహించి నీ వఖండిత[1]భక్తిన్. 17

తే. తెనుఁగుబాస వినిర్మింపఁ దివురు టరయ, భవ్యపురుషార్థతరుపక్వఫలముగాదె
దీని కెడ నియ్యకొని వేడ్క నూని కృతిప, తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ.

వ. అనిన నద్దివ్యవచనామృతంబు నాయుల్లంబున వెల్లిగొనినఁ బునఃపునఃప్రణా
మంబు లాచరించి యప్రమేయప్రభావభావనాతీతుం డయ్యును నప్పరమేశ్వరుం
డాశ్రితులకు నత్యంతసులభుం డని బుధులవలన విని యునికిం జేసి ననుబోఁటిబాల
స్వభావునకు నిట్టిమహనీయమహిమ దొరకొనుటయుం గలుగునకాక యని
తలంచుచు నవ్విభునకు విన్నపంబు సేయువాఁడనయి కొమ్మనామాత్యునాననం
బాలోకించి తదనుమతి వడసి యిట్లంటి. 19

క. భూరిభవత్కారుణ్యా, క్షీరాంబుధి నాదుతుచ్ఛచిత్తంబున వి
స్తార[2]మహితముగ నునిచితి, వారయ నచ్చెరువు గాదె యఖిలాండపతీ. 20

ఉ. ఇంతకు నేర్చునీకు నొకయింతటిలోన మదీయవాణి న
త్యంతవిభూతి బెం పెసఁగునట్టినినుం గొనియాడఁ జేఁత దా
నెంతటిపెద్ద నీకరుణ నిట్లు పదస్థుఁడ నైతి నింక జ
న్మాంతరదుఃఖముల్ దొలఁగునట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే. 21

వ. అని యుపలాలితుం డగుడింభకుండు దనకొలంది యెఱుంగక మహాపదార్థంబు
వేఁడువిధంబున బ్రహ్మానందస్థితిం గోరి సర్వాంగాలింగితమహీతలం బగునమ
స్కారంబు సేసిన నజ్జగన్నాథుండు. 22

తే. జననమరణాదులైనసంసారదురిత, ములకు నగపడ [3]కుండంగఁ దొలఁగు తెరువు
గనువెలుంగు నీ కిచ్చితి ననిన లేచి, నిలిచి సంతోష మెద నిండ నెలవుకొనఁగ.

వ. మేలుకాంచి. 24

క. ఎలమియు నచ్చెరువును సరి, నెలసి [4]పొదలుమానసమున నెంతయుఁ బ్రొద్దే
గలలోనఁ గన్నచందము, దలఁచుచు నుండితి[5]నిభక్తితాత్పర్యమునన్. 25

వ. తదనంతరంబ. 26

ఉ. ఇట్టిపదంబు గాంచి పరమేశ్వరునిం గృతినాథుఁ జేసి యే

1. చ. జ. బుద్ధిన్. 2. క. ఘ. మహిమముగ. 3. క. క. జ. కుండునిమ్ములకుఁ దెరువు.
4. క. పొదువు. 5. చ. జ. సభక్తి.

పట్టునఁ బూజ్యమూర్తి యగుభారతసంహితఁ జెప్పఁ గంటి నా
పుట్టుఁ గృతార్థతం బొరసెఁ బుణ్యచరిత్రుఁడ నైతి నవ్విభుం
గట్టెదఁ బట్ట మప్రతిమకారుణికత్వమహావిభూతికిన్. 27

ఉ. కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం [1]దగుం జనా
భ్యర్చిత మైనభారత మపారకృపాపరతంత్ర వృత్తిమైఁ
బేర్చిన దేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చినభంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్. 28

వ. ఇది యనన్యసామాన్యాకారం బగుపరమధర్మప్రకారంబు.

ఉ. కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయ[2]సంస్మృతి
శ్రీవిభవాస్పదం బయినచిత్తముతోడ మహాకవిత్వ దీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్. 30

వ. అని పూని యీదృశంబు లగుపుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించు
టయు నొక్కయారాధనవిశేషం బగుటం జేసి. 31

—♦ షష్ఠ్యంతములు ♦—

క. ఓంకారవాచ్యునకు నన, హంకారనిరూఢభావనారాధ్యునకున్
హ్రీంకారమయమనోజ్ఞా, లంకారోల్లాసనిత్యలాలిత్యునకున్. 32

క. త్రిభువనశుకదృఢపంజర, విభవమహితునకు సమస్తవిష్టపనిర్మో
కభుజంగపతి కఖిలజగ, దభిన్నరూపునకు భావనాతీతునకున్. 33

క. శ్రుతిసీమంతమణికి నా, శ్రితవాంఛాపూర్తికరణచింతామణి కా
నతదురితతమోద్యుమణికిఁ, గ్రతుభూషణమణికి లోకరత్నమణికిన్. 34

క. పరమశమనిరతసంయమి, వరమానస[4]కుముదహాసవర్ధనచంచ
చ్చరణనఖచంద్రికావి, స్ఫురణాచిత్రప్రకారశోభాఢ్యునకున్. 35

క. హరిహరనాథునకు మరు, త్సరిదాకల్పితమనోజ్ఞచరణశిరస్సుం
దరమూర్తికి భావనత, త్పరచేతోయుక్తభక్తపరతంత్రునకున్. 36

—* కథాప్రారంభము *—

వ. ఏను విన్నపంబు సేయు తెఱంగుగా నంతస్సన్నిధిం గలిగించుకొని [4]యమ్మహా
కావ్యంబునర్థంబు సంగతంబు సేసెద. 37

క. శరణాగతసంశ్రితభయ, హరణా సురనికరశేఖరానర్ఘమణి
స్ఫురణాపరిచయరంజిత, చరణా వనమాలికాభుజంగాభరణా. 38

క. అజగవశార్ఙ్గాలంకృత, భుజగర్వనిరస్తదైత్య భూమస్తుత్యా

1. గ. జ. దగన్. 2. క.ఖ.గ. సంస్కృత శ్రీవిభవాశ్రితం బయిన. 3. క.గ.చ. కమలహంస వర్తన 4. గ.జ. యమ్మహావాక్యంబు.

త్రిజగద్ధారణనిత్యా, భుజగసమాచరితశయన ఽ భూషణకృత్యా. 39

క. జలనిధిహిమవద్భూధర, కలితజననకేళికౌతుకఽవ్యక్తాస్య
స్థలలితసౌందర్యస్ఫుర, దలఘుతను శ్రీసనాథ ఽ హరిహరనాథా. 40

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. 41

ఆ. కథ జగత్ప్రసిద్ధ ఽ గావునఁ బూర్వప, దార్థయుక్తి సేయుఽనట్టియెడల
యత్న మించుకంత ఽ యయినను వలవదు, వలసినట్లు సెప్ప ఽ వచ్చియుండు.

వ. మహాభారతంబు సమస్తదురితాపహంబును నభిమతశుభావహంబునుం గావున నొక్క మహాఫలంబుగోరి జనమేజయుండు కృష్ణద్వైపాయనమహామునికారుణ్యంబు వడసి తదీయప్రియశిష్యుం డయినవైశంపాయనువలన వినినకథ యగుటం జేసి తత్ప్రకారంబు నడపెద నది యెట్లనినం బరమపవిత్రు లగుపాండుపుత్త్రులచరిత్రం బుపాఖ్యానసహితంబుగా వ్యాఖ్యానంబు సేయుచుండ వారలవనవాససమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 43

చ. మహితసముజ్జ్వలాకృతులు ఽ మానధనుల్ జనమాన్యు లంగనా
సహితము గాఁగ నేమిగతి ఽ సమ్యగుపాయనిగూఢవృత్తిమై
నహితుల కప్రభేద్య మగుఽనాపదు మూఁ డగు నేఁడు మత్ప్రితా
మహులు చరించి రంతయుఁ గ్రఽమంబున నా కెఱుఁగంగఁ జెప్పుమా. 44

క. అని యడిగిన వైశంపా, యనుఁ డమ్మనుజేంద్ర చంద్రుఽనధికౌత్సుక్యం
బునకలిమికిఁ దనహృదయం, బున గాఢాదరము భరితఽముగ ని ట్లనియెన్. 45

వ. పాండవులు వనవాసంబు సముచితంబుగాఁ జలిపి పండ్రెం డగు నేఁటికడపటఁ దమకు ధర్మదేవతాసమాగమం బయినం దత్ప్రసాదంబున నజ్ఞాతవాసంబునకు భంగంబు గాకుండ వరంబు వడసి యంతకు మున్న తమవెనుక నడవులం దిరుగుచు నగ్నిహోత్రంబులఁ దోడన కొని వర్తిల్లుభూసురోత్తములు దమ్ముం బరివేష్టించి యుండఁ దా రనుష్ఠింపం బూనినపని వారల కెఱింగింపం దలంచి కరంబులు మొగిచి సవినయంబుగా ని ట్లనిరి. 46

సీ. తెల్లంబు గాదె మీ ఽ కెల్ల సుయోధను, చేసినకుటిలవిఽచేష్టితంబు
లకట మాతో మీరు ఽ నడవుల నిడుమలఁ, బొందితి రొకభంగిఁ ఽబోయెఁ గాల
మిది పదుమూఁ డగుఽనేఁడు మా కజ్ఞాత, వాసంబు సలుపంగ ఽ వలయు నిందు
ధార్తరాష్ట్రులు సూతఽతనయసౌబలులును, జెఱుపన వేతురు ఽ [1]చిన్నసన్న

ఆ. యెఱిఁగిరేనిఁ జాల ఽ నెగ్గు వాటిల్లు న, ట్లగుట మమ్ము నింక ఽ నతిరహస్య
వృత్తిమై నిరస్తఽవిఘ్నుల రై చరి, యింపుఁ డని యనుగ్రఽహింపవలయు. 47

వ. అని చెప్పి రట్టిసమయంబున ధర్మనందనుండు విషణ్ణహృదయుండై. 48

క. ఒకనాఁ డేమును నాపద, లకు విడుమరఁ గాంచి విప్రుఽలం జుట్టలఁ బె

1. చ. చిన్నిసన్న.

ట్టుకొని సుఖముండఁ బడయుదు, మొకో యిప్పాటెందుఁ గలదె యొరు లెవ్వరికిన్.
వ. అని డగ్గుత్తిక వెట్టి దుఃఖపరవశుం డగుటయు నమ్మహీసురవరులుం దమ్ములు
నతని నాశ్వాసించుచుండఁ దత్పార్శ్వంబున నున్నధౌమ్యుండు దదీయవిషా
దాపనోదంబు సేయం దలంచి యి ట్లనియె. 50

♦ ధౌమ్యుఁడు పాండవుల నూరార్చుట. ♦

ఉ. ధర్మనిరూపకత్వమున ధైర్యమునన్ మహనీయవృత్తి స
త్కర్మవిధిజ్ఞతం జతురతామహిమన్ దృఢబుద్ధి నెవ్వరున్
ధర్మజుపాటి గా రనఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడ వైనయట్టినీ
పేర్మికి నీడె దుర్దశలపెల్లునకున్ [1]దురపిల్లు టారయన్. 51
వ. అట్లుం గాక. 52
క. దేవతల కైన నొక్కొక, చో వలయున కాదె శత్రుసూదనవిధికా
లావాప్తికి మును దమస, [2]ద్భావంబు లడంచి యుడుగఁబడి యుండంగన్. 53
సీ. నిషధాద్రియం దనిమిషపతి ప్రచ్ఛన్నుఁ, సంచరణమున వర్తించుటయును
నదితిగర్భంబున నవతార మై వామ, నాకారమున హరి యడఁగుటయును
జననియూరుప్రదేశంబున నతినిగూ, ఢంబుగా నౌర్వుండు డాఁగుటయును
ధేనుశరీరవిలీనుఁ డై యజ్ఞాత, చర్య మార్తాండుండు సలుపుటయును
ఆ. వినమె యిట్లు పడినవీరలు పదపడి, తమకు నగ్గ మైనతఱి జయింప
రెట్లు [3]ప్రబలి రిపుల నీవును నాపద, కోర్చి భంగపాటు దీర్చికొనుము. 54
క. అనవుడు నప్పలుకులు విని, తనచిత్తము కలఁక దేఱి ధర్మతనూజుం
డనుజన్ముల దెసఁ జూచిన, ననిలసుతుం డిట్టు లనియె నాతనితోడన్. 55
మ. భవదాజ్ఞాదృఢబంధసంయమితశుంభద్వేగ మై కాక నాఁ
డవలీలన్ మనయర్జునద్విపము క్రోధావేశదుర్దాంతద
ర్పవిలాసోద్భటభంగి నె పడరి కౌరవ్యాంబుజశ్రేణిఁ జి
క్కువడం జేయదె యొక్కవ్రేల్మిడిన నీకున్ వేడ్క సంధిల్లఁగన్. 56
వ. అనిన విని ధర్మనందనుండు దెలి వొందినమొగంబుతోడ శిరఃకంపంబు సేసె
నట్టిసమయంబున నవ్విప్రు లందఱు నొక్కమొగిన మీతలంపునకు దైవం బను
కూలంబు గావుత మని పాండుపుత్త్రుల దీవించి పునర్దర్శనం బయ్యెడు మనుచు
వీడ్కొని నిజస్థానంబులకుం జనిరి తదనంతరంబ బాహ్యపరివారం బెల్లను సము
చితప్రకారంబున వీడుకోలు వడసి తమతమపొందుపట్లకుం బోయిన. 57
ఉ. తమ్ములు ధౌమ్యుఁడున్ సతియుఁ దా నరదంబులతోడఁ గోశమా
త్రమ్మొక్కచోటి కల్లఁ జని ధర్మతనూభవుఁ డందు నాఁటిరే
యిమ్ములఁ జల్పి వేగుటయు నీప్సితకార్యము సేయఁగా విచా

1. 'దురపిల్లు' అని వ్రా. ప్ర. 2. క. గ. ద్భావము లడఁచికొని యొదిగిపడి. 3. క. ప్రబల

రమ్మన నున్నచో సమర§రాజతనూభవుఁ జూచి యిట్లనున్. 58

క. మన మొకయేఁడుర మీయం, గనయుం దో నరుగుదేశ§గా నెయ్యెడఁబో
యిన నెఱుఁగ కుండుదురె యి, ద్దినములు గడపంగ నెద్ది§దెఱఁ గయ్యెడినో. 59

వ. అనిన నతం డి ట్లనియె. 60

తే. ధర్మదేవత నీదుస§త్కర్మమునకు, మెచ్చి యెంతయుఁ బ్రీతిమై § నిచ్చినట్టి
వరముగలుగంగమనమేమి§వర్తనమున, నెచటనున్ననునొరులకు§నెఱుఁగనగునె.

వ. కురుజనపదంబుచుట్టుం బాంచాల చేది మత్స్య సాళ్వ విదేహబాహ్లిక దశార్ణ శూరసేన కళింగమగధదేశంబులుసుభిక్షంబులు జనాకీర్ణంబులు నతిస్థిరంబులునై నివాసయోగ్యత గలిగి యున్నయవి యని విందుము వానియందు మీకుం జూడం బోలినయెడఁ దగినచందంబున నిలుచువారము గాక యనినం బ్రియం
బంది ధర్మనందనుం డి ట్లనియె. 62

క. అగు నది యట్టిద దైవము, దగ నిచ్చినయవ్వరంబు § దప్పనె మనకుఁ
విగతభయవాసయోగ్యం, బుగ నొక్కెడ సెప్పఁ డిపుడ § పోవఁగ వలయున్.

ఆ. నాకుఁ జూడ మత్స్య§నరపతి సద్ధర్మ, వర్తి సుజనహితుఁ డు§దార్యబాహు
బలుఁడుగాన యతని§పాల నందఱుఁ దగ, వైనపనుల నిలుచు§టభిమతంబు. 64

—♦ పాంచాలీపాండవులు దమ మెలంగవలయుపనుల నిశ్చయించుకొనుట ♦—

క. మనలోన నెవ్వఁ డెమ్మెయి, పని వెంటను విరటుమనము § వడయుద మది యె
ల్లను నేర్పరించి యందఱుఁ, దనతనమది నున్న తెఱఁగు § తథ్యమ చెప్పుఁడా. 65

వ. అనిన విని సవ్యసాచి సవితర్కంబును సవిషాదంబును సగౌరవంబునుం గా నతని
నుపలక్షించుచు ని ట్లనియె. 66

సీ. మహనీయమూర్తియు § మానవైభవమును, సౌకుమార్యంబును § [1]సరళతయును
మార్దవంబుఁ బ్రభుత్వ§మహిమయు నవగత, కల్మషత్వంబును § గౌరవంబు
[2]శాంతియు దాంతియుఁ §జాగంబు భోగంబుఁ, గారుణ్యమును సత్య§సారతయును
ధర్మమయక్రియా§తత్పరత్వంబును, గీర్తిధనార్జన§క్రీడనంబుఁ

ఆ. గలిగి జనుల నేలఁ § గాని యెన్నండును, నొరులఁ గొల్చి తిరుగ § నెరవు లేని
యట్టినీవు విరటు § నెట్టిచందంబున, ననుచరించువాఁడ § వధిప చెపుమ. 67

క. అనినం దమ్ముని నెమ్మన, మునఁ బుట్టినవగపు భావ§మున నెఱిఁగియు గి
టునఁ బుచ్చుచుఁ బ్రస్తుతకా, ర్యనిరూపణదశయ మెఱయ §నతఁ డి ట్లనియెన్.

క. సన్న్యాసివేషమున రా, జన్యునిఁ గని యెపుడుఁ గొలిచి § సభ్యత్వమునన్
మాన్యుఁడ నై పుణ్యకథా, విన్యాస మొనర్తు నతని§వేడుకకుఁ దగన్. 69

క. శాస్త్రితస్మార్తనిమిత్త, జ్యోతిర్విద్యలు వహించి § యోగ్యసమయసం
జాతప్రాగల్భ్యుఁడ నై, చాతుర్యము మెఱసి మాన§సం బలరింతున్. 70

1. చ. సరసతయును. 2. క. గ. దాంతి...♦త్యాగంబు.

క. ఆతనితో నొక్కొకమఱి, కౌతూహలవృత్తికిం దగఁగం దొడఁగి మృదు
ద్యూతంబునఁ గ్రీడింతుం, జేతోముద మొదవ నక్షశిల్పప్రౌఢిన్. 71

తే. మణిమయమ్ములుఁగలధౌతమయములునుసు,వర్ణమయములునాదిగావలయునట్టి
యడ్డసాళులు గలవు నాకభిమతముగ, వానిఁ గొనిపోయిచూపుదువరుసతోడ.

వ. మఱియు నవసరోచితంబు లగువినోదంబులం బ్రమోదంబు పుట్టించుచుఁ
బ్రసాదంబునకుం బాత్రుండనై కంకుం డనునామధేయంబు ధరియించి చరియిం
తు నయ్యుర్వీశ్వరుండు మత్పూర్వవర్తనం బడిగెనేనియు ధర్మపుత్త్రుతోడిమైత్త్రిం
దగిలి యతనిపాల వసియింతు నసం గలవాఁడ నని చెప్పి యనిలతనయు నిరీక్షించి
తత్కాలజనితం బయినఖేదంబునం దొరఁగ సమకట్టుబాష్పజలంబులు మగుడ
నింకించుచు నిట్టూర్పు లడంచి ధైర్యం బవలంబించి యిట్లనియె. 73

సీ. కడిమిమై సౌగంధికమున యక్షులమద, మడఁచి కృష్ణకుఁబువ్వు లట్లుదెచ్చెఁ
గిమ్మీరదానవుఁ గినమ్మెయి నిర్జించి, విగతకంటకముఁ గావించె వనము
బకదైత్యుఁ దొడరి యుగ్రభంగి రూపఱఁ జేసి, రక్షించె [1]నేకచక్రాపురంబు
నప్పాటఁ బ్రబలు జటాసురు నడరి దం,డితుఁ జేసి మనలఁ బెట్టించుకొనియె

తే. నితఁడు పుట్టినకోలె నెసక మెసఁగు, దర్పమున వర్తిల్లు నుదగ్రహృదయుఁ
డకటయొరుచిత్తమునకెక్కునట్లుగాఁగ, మెలఁగియేమివిధంబునఁగొలుచువాఁడు.

వ. అనిన విని భీమసేనుం డిట్లనియె. 75

తే. ఏను వంటలవాఁడనై యానరేంద్రుఁ, గొలిచి గరగరగాఁ గూడుగూర చిత్త
మునకు వచ్చినచందంబునన యొనర్చి, నేర్చి మెలఁగుదుఁ గరము వినీతి మెఱసి.

ఉ. ఆఱురసంబులం జవులయందలిక్రొత్తలు పుట్ట నిచ్చలుల్
వేఱొకభంగిఁ బాకములు విన్నను వొప్పఁగఁ జేసి చేసి న
[2]న్మీఱఁగ బానసీని నొకనిం బురిఁ గాననియట్లు గాఁగ మేఁ
గాఱియ వెట్టి యైన నొడికంబుగ వండుదు నెల్లగూరలున్. 77

తే. పఱియవాపంగఁదునియఁగావిఱువ వలయు, నెడలఁగాళులఁజేతులఁదొడలఁబట్టి
కడఁగియనువుగఁజేసి[3]ప్రొయ్యిడుదుఁగాని, కత్తిగొడ్డలి యడుగ నేఁగట్టెయలకు.

క. సూపాధ్యక్షుఁడు గలిగిన, నాపురుషునితోడ సఖ్య మగునట్లుగ నే
నేపాట నైన నడవఁగ, నోపుదుఁ దత్తద్విధప్రయోగములమెయిన్. 79

వ. అట్లుం గాక. 80

తే. జెట్టితండంబుతోడఁ జేపట్టి హోరాంత, కారి విఱిచినయట్టు నగ్గలిక విఱుతు
లాఁగు వేగంబు మెఱసి బలంబు నెఱపి, మల్లుతనమున మెప్పింతు మనుజవిభుని.

---

1. క. ఇట 'ఏకచక్రా' అని మూలమందుంబోలె స్త్రీలింగముగా నున్నది. ఆదిపర్వమున 'ఏకచక్రంబునవారు' అని యన్యలింగముగా నున్నది. 2. చ. జ. న్మీఱినబానసీ నొకరునిం. 3. 'ప్రొయ్యిడుదు' ననుచో సప్తమికిఁ బ్రథమ రాదు. ఇది భాషాశైలి గానోపు, 'ప్రోవిడుదు' నని యచ్చుప్రతులు.

క. పెక్కండ్ర నొక్కపోరను, నుక్కఱ భంజింతుఁ జంపు ◊ టుడుగుదు రాజుం
దక్కటిచూపఱు లెంతయు, వెక్కసపడఁ జిత్రగతుల ◊ విహరింతుఁ దగన్. 82

చ. అదియును గాక కోలుపులి ◊ నైనను గారెనుపోతునైన ను
న్మదకరినైన నుగ్రమృగ ◊ నాథుని నైనను గిట్టి ముట్టి పె
ట్టిదముగఁ గాలఁ గేలను గ ◊ డిందిమఁ గంటిమి యుల్లసిల్లఁ బ
ట్టుదు నడఁగంగ మాత్స్యుఁడు గ ◊ డున్ వెఱఁ గందుచుఁ బిచ్చలింపఁగన్. 83

వ. ఇట్లు నానాప్రకారంబుల నతనిమనంబు వడయుదు వలలుం డనుసమాఖ్య వహింతు నమ్మహీపతి నీ వెవ్వరివాఁడ వని యడిగెనేని బాండవాగ్రజునకు బానసంబు సేయుదు నసం గలవాఁడ ననిన విని ధర్మజుం డమ్మెయికి సమ్మతించి బీభత్సు వీక్షించి ఘూర్ణమానమానసుం డగుచు ని ట్లనియె. 84

ఉ. ఖాండవ మేర్చి దేవతలఁ ◊ గానని యాశ్వయుఁ గాంచె దోర్బలో
ద్దండమహాసురప్రతతి ◊ దర్ప మడంచి ప్రియం బొనర్చి యా
ఖండలుఁ డున్నగద్దియ స ◊ గంబున నుండె మహానుభావుఁ డీ
తం డొకమర్త్యుఁ జేరి యను ◊ దాత్తత నెమ్మెయిఁ గొల్చువాఁడొకో. 85

క. అనుమాటలు విని సంక్రం,దననందనుఁ డిట్టు లనియె ◊ దైవంబుకతం
బున నాకు నొక్కచందం, బను వైయున్నయది దీని ◊ నేఁగా దనుఁడా. 86

వ. అమరనగరంబున కరిగినయెడ నూర్వశి నన్ను నపుంసకుంగా శపియించిన నాకు నాకేశుండు గరుణించి యీశాపఫలంబు భవదజ్ఞాతవాసవత్సరంబున ననుభవించి తదనంతరంబ శాపమోక్షంబు వడయు మని దీవించెం గావునఁ బేడితనంబుదాల్చి బాహుదీర్ఘత్వంబునకు గుణకిణంబులకుఁ గంచుకంబును శంఖవలయంబులును మాటు సేసికొని విరాటుకడకుం జని. 87

క. ఉత్తమకన్యాజనులకు, నృత్తము గఱపంగ నాకు ◊ నేర్పు గలదు త
ద్వృత్తమునకు నన్నేలుము, చిత్తమునకు నెక్కఁ బనులు ◊ సేసెద నందున్.

క. అని కొలిచి యే బృహన్నల, యనునామముతోడఁ గన్య ◊ కాంతఃపుర[1]వ
ర్తన మొనరించుచు లాసిక, తనమున నిపుణుండనై య ◊ తని మెచ్చింతున్. 89

క. మానవపతి నన్నెక్కడి, దానవు నీవనియెనేని ◊ ద్రౌబదికడ స
మ్మానంబు వడసి మెలఁగుదు, నానగళుల నృత్యగురువ ◊ ననఁ గలవాఁడన్. 90

తే. అనిన నిది వోలు నని యియ్య ◊ కొని యజాత, వైరియల్లన నకులుని ◊ వలను సూచి
నెమ్మనంబున నుమ్మలి ◊ కమ్ము గదుర. నెలుఁగుచందంబు వేఱుగా ◊ నిట్టులనియె. 91

ఉ. ఒప్పెడుమేనుఁ బెంపు గల ◊ యుల్లము నాగరికంపుఁజందమును
జెప్పక చూప కీతనివి ◊ శేషము దెల్పెడుఁ గొల్చు టెంతయున్
డెప్పర మేమి సేయుదుఁ గ ◊ డిందివిచారము పుట్టె నె ట్లితం

1. క. వర్తనము.

డప్పారి సంచరించునొకో ♦ యన్యు లెఱుంగక యుండునట్లుగన్. 92

వ. అనిన నప్పలుకులకు నకులుం డిట్లనియె. 93

ఆ. అశ్వశిక్షకుండ ♦ నై మత్స్యభూవిభుఁ, గొలుచువాఁడ గుఱ్ఱ♦ములకు వలయు
తెఱఁగు లెల్లఁ జాల♦నెఱుఁగుదు రూపుగా, నరయ నేర్తువాని ♦ ననుదినంబు.

సీ. గోడిగజాతిలోఁ ♦ గొదమపెంటుల నేర్చి, మావుల హత్తించు♦మార్గవంబుఁ
[1]ద్రాళ్ళఁ బట్టింపంగఁ ♦ దటి మైనకొదమల, సంచంబు లెఱిఁగి శి♦క్షించునేర్పుఁ
[2]గళ్యాలఁ బదిలంబు ♦ గానిగుఱ్ఱంబులఁ, గ్రొత్తముట్టున కియ్య♦కొలుపువెరవుఁ
బెనఁగుశూకలముల♦[3]బిరుదుతనంబులఁ జలము డింపక తీర్పఁ♦జాలుటయును

తే. నలవరించినవాఁడలా♦యమునను న్న,యపుడు [4]దొడకించుకయు లేని♦యట్లుగాఁగ
మాటిమాటికిఁ బరికించి ♦ మందడీల, కెల్ల నూఱట యగుచు వ♦ర్తిల్ల నేర్తు. 95

క. దామగ్రంథి యనఁగ నొక, నామము పెట్టుకొనువాఁడ ♦ నాతోఁటివిధం
బామనుజేశ్వరుఁ డడిగిన, నే మీకడవాఁడ నందు ♦ నిది దెఱఁ గధిపా. 96

క. అనినఁ గడు లెప్పయన నె, మ్మనమున నూఱడి విభుం డ♦మానుష తేజో
ధనుఁ డగుసహదేవుఁ గనుం, గొని యిట్లను వగలు మిగిలి♦కొందలపఱుపన్.

చ. అకుటిలుఁ డార్యసమ్మతుఁ డ♦హంకృతిదూరుఁడు నీతినిర్మలా
త్మకుఁ డనవద్యశీలుఁడు స♦ధర్ముఁడు దాంతుఁడు గొంతి ముద్దుసే
యుకొడుకు మేను లేఁత దన♦యుల్లము మెత్తన యిట్టియీఁత డె
ట్లొకో యొరు నాశ్రయించు విధి ♦ యోపదె యెవ్వరి నెట్లు సేయఁగన్.. 98

క. అనుడు నతఁడు దనచిత్తం, బునఁ దోఁచినవిధము ధర్మ♦పుత్త్రునితోని
ట్లని చెప్పె నాతనికిఁ బు,ట్టినయుత్తలపాటు గొంత ♦ డిందుపడంగన్. 99

క. కీలారితనమునకు నేఁ, జాలుదు నని కొలిచి మత్స్య♦జనపాలుకడన్
మే లగునడవడిఁ దంత్రి, పాలుం డనుపేరితోడఁ ♦ బరగుదు నధిపా. 100

సీ. వంజల నైనను ♦ వల నేర్పడఁగ నొక, భంగిఁ జేపఁగ జేసి♦పాఁడి గొనఁగ
బడుగుల నైనను ♦ బాటించి పరికించి, గోమున మైఁ గండ♦క్రొవ్వ దేఱఁ
దెవులుగొంటుల నైనఁ ♦ దేర్చుసంకటమున, కోపి ముందటియట్ల ♦ రూపుసేయ
[5]నట్టల నైనను ♦ నలు వైనవెరవున, ముట్టి యంటఁగఁ బట్టి ♦ కట్టి విడువ

ఆ. బిదుకఁ గదుపు సేర్ప ♦ బెదరు వాపఁగ నీరు, మేపు గలుగునెడకు♦మెలఁగ వెలువ
[6]మృగము నరయ మ్రుచ్చు♦రేవగలును గొట్ట,నేర్తుఁ బసికి జాలఁ♦గూర్తు నేను.

వ. నన్ను విరాటుండు మున్న నీ వెందుండు దని నిరూపించెనేని యుధిష్ఠిరుగోష్ఠం
బుల కధిష్ఠాతనై యుండుదు నని యెద నని పలికినఁ గౌంతేయాగ్రజుం డిదియుక్తం
బగునని యనుమతిసేసి పాంచాలినాలోకించి ఖిన్నాంతఃకరణుం డగుచు నిట్లనియె.

---

1. క. గ. ద్రాళ్ళను బట్టంగ...సంచు లెఱింగి, 2. క. గ. జ. గళ్లెల. 3. చ. బిరుదుతనంబున
4. ఖ. జ. దొసఁగు. 5. ఘ, నఱవల నైనను ♦ నలవున వెరవున. 6. క. మెకము... మెలఁగిత వెలకొట్ట

చ. ఇది గడుముద్దరాలు పను లేమియుఁ జేయఁగ నేర దెంతయున్
మృదు వొకకడుపాటునకు మేకొనఁ జాల దుదాత్తచిత్త యొం
టి దిరుగుదాని కోర్వ దొకటిం దను [1]దా సవరించుచో న్వెలుం
గడు తగ నొండులం గొలువఁ గా నెర వెమ్మెయిఁ గల్గు నక్కటా! 103

క. అనిన నతనిచిత్తంబున, వెనుఁబా టంతయును బాయు నెరవుకలిమి యె
ల్లను దెలియునట్లుగా ని, ట్లనియెం బాంచాలి యుచిత మగుచందమునన్.

క. సైరంధ్రీవేషంబునఁ, జేరుదు నంతఃపురంబు చెంతకు న న్నా
భూరమణుదేవి యెంతయు, గారవమునఁ బిలువ నంపఁ [2]గా వినయమునన్.

క. కని కొలువు సేసికొని మా, లిని నాఁ జని సాధ్వి యిది మలీమసవృత్తం
బునఁ బొంతఁ బోవ దెన్నఁడు, నను వ్రేఁకఁదనంబు దోఁచు నట్లు చరింతున్. 106

సీ. కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి, తనువున నలఁదుదు ననువుగాఁగ
మృగమదపంకంబు మృదువుగా సారించి, తిలకంబు వెట్టుదుఁ జెలువు మిగులఁ
బువ్వులు బహువిధంబులఁ గట్టి ముడి కొక్క, భంగిగా నైత్తులు వట్టి యిత్తు
హారముల్ మెఱయ నొయ్యారంబుగా గ్రుచ్చి, [3]యందంబు వింతగా నలవరింతు

ఆ. వివిధశిల్పములఁ బ్రవీణ నై మఱియును, వలయుపనులవెంట మెలఁగ నేర్తు
మత్స్యరాజమహిషిమనమున మక్కువ, నెలకొనంగ నిట్లు గొలువ నేర్తు. 107

క. మును నీ వెచ్చ్చ నిలు తే, పనిమెయి వర్తిల్లు దనినఁ బాంచాలికి నే
ననుచారిణి నై తగఁ బం, చినగరువపుఁబనులు నేర్చి చేయుదు నందున్.. 108

వ. అనవుఁడు ధర్మనందనుండు ద్రుపదనందన కి ట్లనియె. 109

క. మనవంశంబునవృత్తం, బును బెంపును గానఁ జాలు పుణ్యసతివి దు
ర్జను లగుతులువలతఁలపులు, గనుఁగొని యేమఱక మెలఁగగా వలయుఁజుమీ

వ. అనిన విని యాజ్ఞసేని యనాదరమందస్మితసుందరవదనారవింద యయి యతని
కిట్లనియె. 111

క. ఆరయ నెందును గౌరవ, భారం బెడలంగ నీక పాతివ్రత్యా
చారముమై వర్తింతురు, సైరంధ్రీజాతివారు సౌజన్యమునన్. 112

క. కావున నుచితము లగు నా, కావెంటం గొలిచి తిరుగు నప్పుడు మితభా
షావిరచనమును వ్రతసం, భావనమును గౌరవంబుఁ బాపభయంబున్. 113

క. అని చెప్పిన విని యగుఁ బొ, మ్మని కైకొని ధర్మతనయుఁ డందఱమును ని
ట్లనపాయత వర్తిల్లుద, మని తమ్ములతోడ నిశ్చయంబుగఁ బలికెన్. 114

వ. ఇవ్విధంబునఁ గార్యంబు నిర్ణయించి మనయగ్నిహోత్రంబుల నెల్ల ధౌమ్యులు
రక్షించువారు వంటలవారును మహానసాధ్యక్షులును బాంచాలిపరిచారికలును
ద్రుపదుపురంబున నిలుచువారు రథంబులు గొని యింద్రసేనాదు లైనసారథులు

1. క. గాన వరించు. 2. ఖ-జ. గాఁ గందుఁ దగన్ 3. క. యందంద వింతగా.

ద్వారకానగరంబున కరుగువారు మీ రెల్లను దమ్మెవ్వరైనను మనవార్త లడిగి రేని
ద్వైతవనంబున మమ్ము విడిచి పోయి రట యెఱుంగ మనం గలవా రని చెప్పి
యిత్తెఱంగున నభ్యంతరపరివారంబు నెల్ల నియోగించి వీడుకొలిపె నయ్యవసరం
బున ధౌమ్యుండు పాండుకుమారుల కి ట్లనియె. 115

—♦ ధౌమ్యుఁడు పాండవులకు సేవాధర్మంబు లెఱింగించుట. ♦—

క. ఎఱిఁగెడువారికి నైనను, గఱపక తక్క రుచితప్రకారము శుభముం
గొఱలు హితు ల ట్లగుట నం,దఱకును జెప్పంగ వలయుఁ దగియెడుబుద్ధుల్.

వ. అదియునుం గాక. 117

తే. కౌరవాన్వయజాతు లై గారవమునఁ, బెరిఁగినట్టిమీ రొండొకనరునిఁగొలిచి
మసలి వర్తిల్లి మానావమానములకు,నోర్చి యడఁకువతోడనయ్యునికి యరిది.

క. వాలి వివిధాస్త్రశస్త్ర, జ్వాలల వెలుఁ గొందుపాండవజ్వలనం బా
భీలత మండం దొడరినఁ, [1]గాలవిరోధంబు మఱచి కార్యముఁ దప్పన్. 119

వ. కావున మీకు నప్రమాదార్థంబుగా నానేర్చినవిధంబున నుపదేశం బవశ్య
కర్తవ్యంబు రాజులం గొలిచి యెమ్మెయి నయినను బ్రదుకుజనంబులు గీడునుం
[2]బొరయ కుండునట్టిసాధారణనీతి సంక్షేపరూపంబున నెఱింగించెద సావధానుల
రయి వినుఁడు. 120

క. తగఁ జొచ్చి తనకు నర్హం, బగునెడఁ గూర్చుండి రూప మవికృతవేషం
బుగ సమయ మెఱిఁగి కొలిచిన, జగతీవల్లభునకతఁడు సమ్మాన్యుఁడగున్. 121

క. నరనాథుఁ గొలిచి యలవడఁ, దిరిగితి నా కేమి యనుచుఁ దేఁకువ లేమిన్
మరియాద దప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టక యున్నె. 122

ఉ. రాజగృహంబుకంటె నభిరామముగా నిలు గట్టఁ గూడ దే
యోజ నృపాలుఁ డాకృతికి నొప్పగువేషము లాచరించు నే
యోజ విహారముల్ సలుప నుల్లమునం గడువేడ్క సేయు నే
యోజ విదగ్ధుఁడై పలుకు నొడ్డులకుం దగ దట్లు సేయఁగన్. 123

క. పుత్త్రులు పౌత్త్రులు భ్రాతలు, మిత్త్రు లనరు రాజు లాజ్ఞ [3]మిగిలినచోటన్
శత్రుల కాఁ దమయలుకకుఁ, బాత్రము సేయుదురు నిజశుభస్థితిపొంటెన్. 124

క. చనువానిచేయుకార్యం, బున కడ్డము సొచ్చి నేరుపున మెలఁగుచుఁ దా
నునుబయిఁ [4]బూసికొనుటఁదన,మును మెలఁగినమెలఁకువకును ముప్పగుఁబిదపన్.

ఆ. రాజునొద్దఁ బలువురకు సంకటము గాఁగఁ, దిరుగుపనుల కెంత తేజ మయిన
వాని బుద్ధిగలుగువా రొల్ల రది మీఁదఁ, జేటు దెచ్చు నెట్లు సిద్ధ మగుట.

క. ఊరక యుండక పలువుర,తో రవ మెసఁగంగఁ బలుకఁ దొడరుపక మదిం

1. అ. గాలువిరోధంబు నుచితకార్య, 2. గ,జ, దొడరకుండు, 3. క, ఖ. మీఱిన. 4.చ,బూనుకొనుట

జేరువ గలనాగరికులుఁ, దారుఁ గలసి పలుకవలయు § ధరణీశుకడన్. 127

క. వేఱొక తెఱఁగున నొరులకు, మా ఱాడక యునికి లెస్స § [1]మనుజేంద్రుకడం
దీఱమి గలచోటులఁ దా, మీఱి కడఁగి వచ్చి పంపు § మెయికొన వలయున్.

చ. ధరణిపుచక్కఁగట్టెదురు § దక్కి పిఱిందును గానియట్టుగా
నిరుగెలనం దగం గొలిచి § యే మనునో యెటు సూచునొక్కొ యె
వ్వరిదెస నెప్పు డేతలఁపు § వచ్చునొ యాతని కంచుఁ జూడ్కి సు
స్థిరముగఁ దన్ముఖంబునన § చేర్చుచు నుండుట నీతి కొల్వునన్. 129

క. నగళులలోపలిమాటలు, దగునే వెలి నుగ్గడింపఁ § దన కేర్పడ నొం
డుగడం బుట్టినఁ బతి విన, నగుపని చెప్పెడిది గాక § యాతనితోడన్. 130

క. అంతిపురముచుట్టఱికం, బెంతయుఁ గీ డంతకంటె § నెగ్గు తదీయో
పాంతచరకుబ్జవామన, కాంతాదులతోడిపొందు § కలిమి భటునకున్. 131

ఆ. ఉత్తమాసనములు § నుత్కృష్టవాహనం,బులును గరుణఁ దమకు § భూమిపాలు
డీక తార యెక్క § నెంతటిమన్నన, కలుగువారి కైనఁ § గార్య మగునె. 132

క. మన్నన కుబ్బక యవమత్తి, ద నొందిన స్రుక్కఁబడక § ధరణీశుకడ౯
ము న్నున్నయట్ల మెలఁగిన, యన్నరునకు శుభము లొదవు § నాపద లడఁగున్.

క. జనపతి యెవ్వరి నైనను, మనుపఁ జెఱుపఁ బూని యునికి § మదిఁ దెలియ నెఱిం
గెనయేనిఁ దాను వెలిపుచ్చునె మునుము న్నట్టిపాల § నుండును దానిన్. 134

ఉ. ఎండకు వాన కోర్చి తన § యిల్లు ప్రవాసపుఁజోటు నాక యా
కొండు నలంగుదు౯ నిదుర § కుం దఱి దప్పెడు డప్పి వుట్టె నొ
క్కండన యెట్లొకో యనక § కార్యము ముట్టినచోట నేలినా
తం డొకచాయ చూపినను § దత్పరతం బని సేయు టొప్పగున్. 135

క. తా నెంతయాప్తుఁ డైన మ,హీనాయకుసొమ్ము § పాము నెమ్ములుగా లో
నూనినభయమునఁ బొరయక, మానినఁ గా కేల కలుగు § మానము బ్రతుకున్.

ఆ. ఆవులింత తుమ్ము § హాసంబు నిష్ఠీవ,నంబు గుప్తవర్త § నములు గాఁగఁ
జలుపవలయు నృపతి § గొలువున్నయెడల బా,హిరములైనఁ గెలని § కెగ్గు లగుట.

క. వైరులదూతలు[2] నెర పగు, వారు నిరాకృతులుఁ బాప § వర్తులుఁ దమకుం
జేరువగా వర్తించుట, నేరమి తుదిఁ బోయి చేటు § నిందయు వచ్చున్. 138

ఆ. వసుమతీశుపాల § వర్తించునేనుంగు,తోడ నైన దోమ § తోడ నైన
వైర మగుతెఱంగు § వలవదు తా నెంత, పూజ్యుఁ డైన జనుల § పొలదు లెస్స.

క. కలిమికి భోగముల కదా, ఫల మని[3] తను మెఱసి బయలు § పడఁ బెల్లుగ వి
చ్చలవిడి భోగింపక వే, డ్కలు సలుపఁగవలయు భటుఁ డ § డంకువతోడన్. 140

1. చ. జ. మనుజేంద్రునకు. 2. అ. నేరముఁవారు. 3. జ. తా మెఱసి.

వ. అని యిట్లు పురోహితుండు సేవాధర్మం బెఱింగించిన ధర్మజభీమార్జుననకులసహదేవులు ప్రసన్నచిత్తులై యి ట్లనిరి. 141

క. తల్లియుఁ దండ్రియు దైవము, నెల్లసుహృజ్జనము మీర యిట్లు గొలిచి వ
ర్తిల్లెడు తెఱంగు లెంతయుఁ, దెల్లము సేసితిరి బ్రతికితిమి మీకరుణన్. 142

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టు లనియె నీవత్సర, మొకఁడు నెట్టు లయిన నుడిగి మడఁగి
సంకటముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి పిదప నెగడ వలయు. 143

క. అనవుడు నట్టుల చేసెద, మని వారలు భక్తియుక్తి నతనికి నభివం
దన మొనరించినఁ దగుదీ, వన లిచ్చె నతండు గాఢవాత్సల్యమునన్. 144

క. భూదేవోత్తమునాశీ, ర్వాదంబులఁ బ్రీతిఁ బొంది వారలు ప్రస్థా
నాదరపరు లగుటయు స, మ్మోదావహపుణ్యకర్మములకు నుద్యతుఁడై. 145

ఆ. అతఁడు నియతితోడ నగ్ని సముజ్జ్వలం, బుగ నొనర్చి కామ్యపూజ దీర్చి
యానసమయమంగళార్థంబు లగుమంత్ర, సంచయములు దగ జపించుచుండె.

—♦ పాండవులు పాంచాలితోడ విరాటనగరంబునకు బయలుదేఱుట. ♦—

వ. తదనంతరంబ హుతవహునకుం బురోహితునకుం బ్రదక్షిణంబు సేసి యమ్మహీసురవరేణ్యు ననుమతి వడసి పాండవులు పాంచాలిం బురస్కరించుకొని యాతండును దోడన యరుగుదేరం గదలి శుభనిమిత్తంబులు గైకొనుచుం జని దశార్ణదేశంబున కుత్తరంబునం బాంచాలజనపద యామ్యదిగ్భాగంబున సాళ్వశూరసేనవిషయంబులలోనం గాళిందీదక్షిణతీరం బొరసికొని పశ్చిమాభిముఖ ప్రయాణంబుల నెడనెడ వన్యాహారంబుల శరీరయాత్రలు నడపుచు నానామృగవివిధవధవిహారంబులను మనోహరకుసుమకదంబగంధమకరందబిందుసందోహసుందరతరుచ్ఛాయాసేవనంబులను గమలపరాగపరంపరాధూసరితభాసురజలాశయసమవగాహనంబులను సరిత్సంగమస్నానాద్యనుష్ఠానంబులను బహుప్రకార పాదపగుల్మలతావలోకనంబులను బక్షికులప్రకరానేకభంగివిరుతాకర్ణనంబులను వినోదించుచుఁ గాననమార్గంబులనరిగి మత్స్యమండలంబుగడి సేరి ధౌమ్యునివీడుకొని రవ్విప్రవరుండును నొక్కపుణ్యాశ్రమంబున వసియించె వారి మఱియు నూళ్లు సొరక యడవి తెరువుల నడచి విరాటునగరంబున కనతిదూరం బగుకాంతారంబునందఱిమి పోవుసమయంబునఁ బథిశ్రమంబు నూని యాజ్ఞసేని యి ట్లనియె. 147

ఉ. డప్పి జనించె వ్రేళులపుటంబులు పొక్కఁ జోడంగె గోళ్ళలో
జిప్పిలఁ జొచ్చె నెత్తురులు చిత్తము నాకుఁ గడుం బశంబు గా
దప్పర మిచ్చ టచ్చటను నాసల వచ్చితి నెంతదవ్వొకో
యిప్పటిభంగి నొక్కఁడుగు నేఁగెడుదానికి నోర్వ నెమ్మెయిన్. 148

వ. అనవుడు.

క. తనమదిఁ గరుణయు ఖేదంబును [1]బిరిగొను చుండ ధర్మపుత్త్రుఁడు నకులుం

1. బురిగొనుచుండ.

గనుఁగొని ద్రుపదనృపతిసుతం, దన దెస యాతనికిఁ జూపి § తగ ని ట్లనియెన్. 150

ఆ. అగట మనము వచ్చి § నది గడు దవ్వు నేఁ, డస్పురంబు సొత్తు § మని తలంచి
తఱిమి నడచితిమి లతాంతన్వి యిది వడి, గొనియె మోచి తెమ్ము § కొంత దవ్వు.

క. అనిన విని పూని గ్రక్కునఁ, జనుదేరమి నతఁడు డస్సెఁ § జాలం డని నె
మ్మనమున నెఱింగి యాతని, యనుజన్మునిఁ బనిచె నతఁడు § నలసుం డయినన్.

వ. సవ్యసాచిం జూచి. 153

ఉ. ఇమ్మదిరాక్షి డస్సె మన § కీనడుమన్ విడియంగ నొండుచో
టిమ్మును గాదు నిక్కమున § కేమును డస్సితి మట్లు గాన నీ
వెమ్మెయి నైన దీని భరి § యించి పురంబుసమీపభూమికిం
దెమ్మని చెప్ప నాతఁడును § దెచ్చెఁ బ్రియంబునఁ బుష్పకోమలిన్. 154

క. మోచికొని వాసవాత్మజుఁ, డాచెలువం దేర నిట్టు § లరిగి పురము దృ
గ్గోచర మగుటయుఁ దమ్ములఁ, జూచుచు వారలకు ధర్మ § సుతుఁ డి ట్లనియెన్.

క. చక్కనిచిక్కనిమేనులు, నిక్కిడండములు నైన § నెఱుఁగరె మన మీ
చక్కటి నిలుతమె శస్త్రము, లొక్కెడ దాఁచుటకు వేష § యోజనములకున్.

వ. అనిన నిది కార్యం బని మధ్యమపాండవుం డాసుమధ్య నొక్క శీతలసికతాతలం
బున డించెఁ దక్కినవారలు నట్ల చేయుద మని నిలిచి రట్టియెడం బాండవాగ్ర
జుండు గాండీవి చేతివి ల్లుపలక్షించి యతని కి ట్లనియె. 157

క. మనశస్త్రాస్త్రంబులు, ద, క్కినయవి యొకభంగి పేటి § కిని గాండీవముం
గొనిపోయితిమేని సుయో, ధనునకు నగపాటు నిశ్చి § తం బూహింపన్. 158

వ. అనవుడు. 159

చ. ఇది పెనుఁబాముచందమున § నెంతయు భీషణ మై జనంబులన్
బెదరఁగఁ జేయు న ట్లగుటఁ § బెట్టి చనన్ వలయుం [1]దలంచి నా
హృదయము దీని, బాయుటకు § నియ్యకొనం జొర దెట్లు సెప్పినం
దుది నొకచోట వైచు టుయ § తోఁచినకార్యము నమ్యొఁడుం గటా! 160

వ. అని వితర్కించుచుం గిరీటి యురియాడు చిత్తంబును త్తలం బుడిపికొని నిశ్చయించి.
యాయుధంబులు నిక్షేపించుటయ కర్జంబుగాఁ బలికి యోగ్యస్థలనిరూపణంబునకు
నలుదిక్కులుం బరికించి ప్రేతభూమిపరిసరారణ్యంబునందు. 161

సీ. నెగసినకొన లేచి § నింగి యంతంతకు, నవుల ద్రోవఁగఁ దన § రారుదానిఁ
జాగినశాఖ లా § శాచక్రములకొలం, దులు బారవెట్టంగఁ § బొలుచుదానిఁ
గవట లొండొంటితోఁ § గదియుచు నెడములు, మిగ్రింగి ప్రబ్బఁగ సొంపు § మిగులుదాని
లోనిజొంపము పవ § లును బెనుఁజీకటి, పొదవించి పొదలంగ § నొప్పుదానిఁ

తే. గనియెఁ బవమానవివిధ [2]నక § ర్తనకళాను, వర్తిఁ గాకఘూకారవ § స్ఫూర్తి జాత

1. ఖ. చ. జ. దలంచినన్. 2. చ. జ. వర్తనకళావర్తి.

భీతిపరిసరవర్తి నాఖిలభుజగ,చండమూర్తి శమీతరుచక్రవర్తి. 162

వ. కని యమ్మహామహీరుహంబు ధర్మనందనునకుం జూపి యిట్లనియె. 163

శా. పక్షివ్యాకులముం బరేతనిలయోపాంతోత్థముం డాకినీ
రక్షోభూతపిశాచగోచరము [1]దుర్గంధంబు నై చూడఁ జి
త్తక్షోభం బొనరించు న ట్లగుటఁ జెంతం జేర రా దీ శమీ
వృక్షం బెవ్వరి కింనుఁ బెట్టుదమొ పృథ్వీనాథ శస్త్రాస్త్రముల్. 164

క. పెనుఁబొడవుఁ బఱపు జొంప,మ్మును గలయది దీన నెల్లపురుషులకుఁ బ్రయో
జన మొకఁడు లేదు పేరం, జనఁ జూడ గ నరయ నెక్క సమకట్టంగన్. 165

ఉ. కావున దీనియం దిపుట కార్యము గైదువు లెల్లఁ గేశచ
ర్మావృతసంచయంబుగ శవాకృతిగా నొనరించి కట్టినం
బోవరు దీనిది క్కొరులు భూవర నెమ్మది నూఱడిల్లు మె
చ్చో పసియించినం బిదపఁ జొప్పడుఁ గ్రమ్మఱ వచ్చి కైకొనన్. 166

— పాండవులు దమ యాయుధంబుల శమీవృక్షమునఁ బెట్టుట. —

వ. అని చెప్పిన నందఱు న త్తెఱంగున కియ్యకొనుటయు నతండు గాండివంబు నవలోకించి

చ. అనిమిషదానవాంబరచరాదికజాతుల నెల్లఁ బోర నీ
ధనువునఁ గాదె గెల్తు సముదగ్రవిరోధిభయావహంబు దీ
నిని నొక మ్రానఁ గట్టి చనునిశ్చయముం దగఁ జేసె దైవ మే
మనఁ గల దట్ల కాక యని యాత్మ నలందురి మందచేష్టుఁడై. 168

వ. ఎక్కుడించినఁ బాండవాగ్రజుండు. 169

క. దనుజకులత్రాసకరం,బును రిపుభంజనము రత్నభూషితరూపం
బును గురుదేశాహ్లాదన,మును నగునిజకార్ముకంబు,మో పెడలించెన్. 170

వ. తదనంతరంబ భీమ నకుల సహదేవుల దెసఁ గనుంగొని. 171

సీ. సైంధవయక్షపాంచాలత్రిగర్తుల దీవన యోర్చితి మానధనుఁడ
సౌరాష్ట్రనాథాదిశత్రులు దీనిచేఁ, గాదె మర్దితులైరి ఘనభుజుండ
కాళింగపాండ్యమాగధుల నిర్జించుచో, నిదియ కైదువు నీకు విదితయశుఁడ
యని క్రమంబున వార లందఱువిండులు, పెం పెసలార వేర్వేఱ పొగడి

ఆ. గొనయములు వదల్ప ననుమతి సేయుఁడు, వారు నట్ల చేసి తేరఁ జాప
ములునుదొనలువర్మములునసిముద్గరా,ద్యాయుధములుఁ గూడ నతఁడు గట్టె.

వ. ఇట్లు పూర్వోక్తప్రకారంబునం బొదివి మహోరగంబులం బెట్టియలం బెట్టికట్టు చందంబున బంధించి వానిం గొలుచు నయ్యజాతశత్రుండు ధర్మదేవతాదత్తవరుం డగుటం జేసి నిశ్శంకంబైన యంతఃకరణంబుతోడ శమీవృక్షసమారోహణం బాచరించి. 173

1. చ. దుర్గంధంబు

తే. బ్రహ్మవిష్ణుమహేశదిక్పాలచంద్ర
సూర్యపవనదేవతాపితృప్రస్తుతులొనర్చి
దివియు భువియును జూచి ప్రార్థించి యొక్క
విపులశాఖ నాయుధములు ప్రేలఁగట్టె. 174

వ. ఇట్లు గట్టి తదీయాధిదైవతంబుల నుద్దేశించి నమస్కరించి. 175

క. నరునకు నాకుం దక్కఁగ, నొరులకు మీరూపుసూప [1]కున్నది విషవి
స్ఫురిత [2]భుజగభంగి భయం, కరమూర్తులు దాల్చియుండఁగా వలయుఁ జుఁడీ.

ఉ. భీముఁడు ధార్తరాష్ట్రకులభీషణరోషుఁడు చిత్తమెప్పు డె
ల్లై మద మెత్తునో యతనియుగ్రహవృత్తికి లోనుగాక మీ
రేమియు నైన వంచన వహించి తొలంగుట మత్సమీహితం
బేమఱ కుండఁగా వలయు నివ్విషమాబ్దములోన నాతనిన్. 177

వ. అని వేఁడికొని వృక్షంబు డిగ్గి దానికిం బ్రదక్షిణంబు వచ్చి ప్రణమిల్లి భీమసేనుదెస మరలి చూచి సాంత్వనవచనసమేతంబుగా నతనిం గౌఁగిటం జేర్చి యనునయించి తమచేసినవిధంబు తత్ప్రదేశవర్తులయిన గోపాలాది క్షుద్రజనంబులకు మఱువెట్టం దలంచి వారల కభిముఖులై పాండునందను లందఱు నిట్లనిరి. 178

చ. ఇది [3]శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁ బొందె నిట్లు సే
యుదుము కుల[4]ప్రయుక్త మగు చున్నసనాతనధర్మ మిత్తెఱం
గ దహనకర్మ మొల్ల మది గానిది గా మును నిశ్చయించి మా
మొదలిటివా రొనర్చువిధముం గొనియాడితి మేము నివ్యెడన్. 179

వ. అని యిట్లు పలుమఱుం దెలియఁ బలికి శస్త్రాస్త్రంబులనిక్షేపణంబు నిగూఢం బగుటకు నూఱడిల్లి యచ్చేరువం జచ్చినపసరంబు పడియున్నం జూచి సహదేవుం బనిచి ధర్మతనయుండు దానిచర్మంబాలిపించి శీతాతపవర్షపరిహారంబుగా నాయుధంబులం బొదివించి మఱియును దత్సమీపంబున నొక్క శుష్కశవంబు నవలోకించి యిది యుంఛవృత్తియైనమానవుకళేబరంబు గావలయు ననుచు నదియునుం గైదువులకట్టపయిం బెట్టి కట్టించె నివ్విధంబున నత్యంతగుప్తి యాచరించి దీని దుర్గంధంబున వనచారు లెవ్వరుం జేర రని నవ్వుచు వార లచ్చోటు వాసి విరాటపురాభిముఖులై చనుచుండి యజ్ఞాతవాసకాలంబునం దమ రహస్యవ్యవహారంబునకు ననువుగా నేవురపేళ్లును గ్రమంబున జయుండును జయంతుండును విజయుండును జయత్సేనుండును జయద్బలుఁడు నని సంకేతించుకొని యాజ్ఞ సేసీ పురస్సరంబుగాఁ బుణ్యనదీతీర్థావతరణంబు సేసి తదీయస్నానంబునం బథిశ్రమం బపనయించి దేవపితృతర్పణమంగళజపహోమధ్యానాద్యనుష్ఠానంబు లొనర్చిరి

1. 'ఉన్నది' అనఁగా ఉండునది. (ఆది. ౭-౨౧౬) (ఆది, ౬-౨౩౨) 2. చ. భుజంగాఘభయం, 3. క. ఖ. గ. ఘ. చ. శతవృద్ధ. 4. ఖ. జ. ప్రవృత్త మగు.

తదనంతరంబ యక్కౌంతేయాగ్రజుండు ప్రాఙ్ముఖుండయి నిర్మలచిత్తంబున ధర్మ
దేవతం దలంచి యిట్లనియె. 180

ఆ. తండ్రి నీవు నాకు § దయతోడ నిచ్చిన వరము చిత్తగించి § వలయు తెఱఁగు
సమయసముచితముగ§సమకట్టు మయ్య యీ,రాకుమారు లవిఘ్నఁ§బోక యుండ.

వ. అనుజులదెసకుఁ [1]దూర వగచి డగ్గుత్తిక వెట్టి మఱియును. 182

ఉ. అంబరవర్తి వైనఁ గని § [2]యక్షునిచే నగపడ్డవీరిప్రా
ణంబులు మున్న నిన్నడిగి § నల్వురకున్ నయవిక్రమప్రభా
వంబులు వేఁడికొన్న నతి§వత్సలభావముఁ బొంది యాదరా
ర్ద్రం బగు చూడ్కితోఁ బ్రియహిత§స్థిరభాషల నూఱడింపవే. 183

వ. అనితాను భూసురవరునరణిదేర నరిగిననాఁడు సరోవరతీరంబునం దనకుధర్ముండు
సేసినమన్నన దోఁప నతనికి విన్నవించినవాఁడై కరకమలంబులు మొగిచి ఫాల
భాగంబునం గదియించి సంప్రార్థనంబుగా వినయవినమితమస్తకుం డగుటయుఁ
దదనుగ్రహంబునఁ బాండవాగ్రజుం డున్నయునికిన సన్న్యాసిరూపం బలవడి
ధాతుపటదండకమండలుకలితమూర్తి యయ్యె నయ్యవసరంబున వా రందఱు
మహాద్భుతం బంద వారివారికి నయ్యైవేషంబుల కనుగుణంబులగు నంబరాభరణ
మాల్యాద్యుపకరణంబులు సన్నిహితంబు లయినం జూచి సంతసిల్లి యెల్లవారిం
గలయం గనుంగొని క్రమంబున నొంటిమైఁ జనుదెం డని నియోగించి యతండు
నానావిధంబు లగునక్షంబులముడి కక్షంబున నిడికొని చని దైవయోగంబున
విరాటుండు వెడలి వచ్చి బయలికొలు విచ్చుటం జేసి తదాస్థానంబు సేరం
బోవునప్పుడు. 184

♦ ధర్మరాజు సన్న్యాసివేషమున విరటుఁ గొల్వ వచ్చుట ♦

ఉ. దవ్వులఁ జూచి మత్స్యవసు§ధాపతి యీచనుదెంచు చున్నవాఁ
డెవ్వఁడొ నాదుచూడ్కులకు § నెంతయు వ్రేఁగయితోఁచె [3]నెట్లితం
డివ్విధిఁ బొందెనో జగము § లెల్లను నేలఁగఁ జాలుతేజ మా
మువ్వుర[4]తోడిజోడి యగు§మూర్తి యతీంద్రునియొప్పు గంటిరే. 185

సీ. కరచరణాద్యంగ§కంబు లేలొకొ రత్న,భూషణప్రకరంబు§పొందు దొఱఁగె
నుభయపార్శ్వంబుల § నిభఘట లేలొకో,చనుదేవు సమదాళి§సమితి మొరయఁ
బాయు తొలంగు మం § చాయతవేత్రహ,స్తులమొత్త మేలొకో § తోడ రాదు
ధవళాతపత్రముల్ § దఱచుగా నేలొకో, పట్టరు మౌక్తిక§ప్రభలు వెలుఁగ
తే. నితఁడు రా జగు రా జను§నింతమాత్ర,గాదు మూర్ధాభిషిక్తవ§ర్గంబుఁ దనదు

1. ఇది 'తూరుధాతువు. 'చాలు' ధాతువువంటిది. తూరన్ అనఁగా మిక్కిలిగాననుట. ఇట్లే దీని ప్రయోగము నిందుఁ బెక్కెడలఁ జూడవచ్చును. 2. 'యక్షునిచే' అనియే వ్రాఁతప్రతులపాఠము. 3. క. నిట్టితం డివ్విధిఁ. 4. ఛ. జ. తోడ జో ధ్ధయిన,

చరణయుగ్మంబు గొలిపింపఁ జాలుసార్వ,భౌముపదవికిఁదగియెడుభంగివాఁడు.

క. మనకడకు నేమిటికి వ, చ్చెనొకో యే నిమ్మహాత్ముఁ జెప్పిన పను లె
ల్లను జేయువాఁడఁ గోరిన, కనకాంబరమణులు దలఁపుఁ గడవఁగ నిత్తున్. 187

ఆ. మత్స్యవిషయరాజ్యమహిమకు యుక్తుండు, గాఁ దలంచెనేని గారవమున
నట్ల చేసి భక్తి ననుచరింతు నమాత్య, సుతసుహృద్భటార్యయుతముగాఁగ.

వ. అని సమస్తజనంబులుఁ దదభిముఖులయి భక్తియుక్తిం బ్రత్యుత్థానంబు సేయం దానును గద్దియ డిగ్గి యెదురు చని నమస్కరించి యతనియాశీర్వాదంబులు గైకొని సగౌరవంబుగాఁ దోడ్కొని చనుదెంచి సముచితసమున్నతాసనంబున నునిచి వినయావనతుం డయి. 189

ఉ. ఎయ్యది జన్మభూమి కుల మెయ్యది యెయ్యది యున్నచోటు పే
రెయ్యది మీర లిందులకు నిప్పుడు వచ్చినదానికిం గతం
బెయ్యది నాకు నంతయును నేర్పడఁగా నెఱిఁగింపుఁ డున్నరూ
[1]పయ్యది గావుడున్ నరవరాగ్రణి కయ్యతిముఖ్యుఁ డిట్లనున్. 190

ఆ. ఉన్నరూప పలుకు నన్నరు లెక్కడఁ, గలరు తోఁచినట్లు పలుకు వలుక
నైనచంద మయ్యె నంతియ కా కంత, పట్టిచూడఁ గలరె యెట్టివారు. 191

వ. అని మందహాసంబు సేయుచు మఱియును. 192

క. నానావిధభూతమయము, మే నతిచంచలము మనము మెయికొని నిక్కం
బేనరునకు, జెల్లింపం, గా నగు సత్యంబు నడపు క్రమ మట్లుండెన్. 193

వ. అనుచు మత్స్యమహీవల్లభు నవలోకించి. 194

క. ద్విజుఁడఁ గురువిషయజాతుఁడ, సుజనప్రియుఁ డైనధర్మసుతుసఖుఁడఁ బరి
వ్రజనాశ్రమకలితుండ మ,నుజవల్లభ యోగ్యబహువినోదకరుండన్. 195

క. ద్యూతక్రీడకుఁ గొండొక, నేతుం గపటమున నొవ్వనిజనంబులు నా
చేతిధన మెల్లఁ గొని పరి,భూతి యొనర్చిన విరక్తి పుట్టి వెడలితిన్. 196

చ. నృపనయవిద్యకుం దగిననేర్పులవడ్డది గొంత కొంత ధ
ర్మపరులసంగతిం దగిలి మచ్చిగ నుండుదుఁ బేరు కంకుఁ డే
వపుఁగొలు వైన నాకు నిలువవు మది గొల్పదు గాన నిన్ను భూ
మిపతులలోన సాధుజనమిత్త్రుఁడు నా విని కొల్వ వచ్చితిన్. 197

తే. వత్సరంబునఁ గడచను వ్రతము నాకు, దాని నీపాలఁ జల్పి యుత్సాహవృత్తి
[2]మెఱయ నాకుఁ గృతఘ్నత నెఱపి తొల్లి, యెగ్గు సేసినవారి జయింపఁబోదు.

వ. అనిన విని సంప్రీతచేతస్కుం డై విరాటుం డతని కి ట్లనియె. 199

తే. అట్ల చేయుఁడు రుచిరోన్నతాసనములు
వాహనములు భోజనములు వస్త్రములును

1. క. పయ్యోడు. 2. గ. జ. మెఱసి నీకుఁ గృతజ్ఞత.

వలయుభోగములును నెల్ల§వర్తనములు
నాకు నెట్లువిధమ మీకు § నడపువాఁడ. 200

క. నాయనుచరులం దెవ్వఁడు, మీయెడ భయభక్తి లేక § మిగిలి మెలఁగు నే
నాయధముని దండితుఁగాఁ, జేయుదు నతఁ డెంతయుం బ్ర§సిద్ధుం డయినన్.

వ. అట్లుంగాక. 202

చ. వెలయఁగ మత్స్యరాజ్యపద§వీపరిపాలన సేయఁగా మదిం
దలఁచుట యెంతయుం బ్రియము § దమ్ములుఁ బుత్త్రులు బంధులుం బ్రధా
నులును బలంబు నేను సుమ§నోవిభుతుల్యుఁడ వైననిన్ను మి
క్కిలి యగుభక్తిఁ గొల్చి కృత§కృత్యతఁ బొందుదు మట్ల చేయవే. 203

వ. అనిన విని దరహాసితవదనుం డగుచుఁ బాండవాగ్రజుం డతని కి ట్లనియె. 204

క. ఏను హవిష్యమ కుడుతును, భూనాయక నాకు శయ్య § భూమియ యిమ్మెఁ
బూని వ్రతంబులు సలిపెద, వానికి నిన్నియును నిట్లు § వలయునె చెప్పుమా.

ఆ. అనిన విరటుఁ డిట్టు § లనియె నె ట్లెఱుఁగున, నడవ నిష్ట మట్లు § నడచి మీకు
మనసు వచ్చునన్ని§దినములు సలుపుఁ డి, చ్చోట నదియ మాకు § శోభనంబు.

క. ద్యూతజ్ఞుల దెసఁ గొండొక, ప్రీతియుఁ గల దట్లుఁ గాక § పెద్దల రగుమీ
రే తెఱఁగున విహరించినఁ, జేతోమోదంబు దగ వ§సింపుఁడు నెమ్మిన్. 207

వ. అని పలికి కౌంతేయాగ్రజు నత్యంతసంతుష్టాంతరంగుం జేసి. 208

చ. పొరిఁ బొరిఁ బ్రీతి రెట్టిగ న§పూర్వవిలోకన మాచరించుఁ ద
త్పర మగుసద్వివేకమున § భావనిరూపణ సేయుఁ గౌతుక
స్ఫురణఁ గరంబు దత్కరముఁ §బొంద నయంబునఁ జేర్చి వాక్యవి
స్తరచతురత్వ మేర్పడఁగ § సల్లపనం బొనరించు నర్థితోన్. 209

వ. ఇట్లు మత్స్యమహీవల్లభుం డతనిం గలిపికొని పరివారంబును దానును దదీయ
సంభావనా[1]తత్పరుఁ డై యుండె నంత. 210

—* భీముఁడు వంటలవాఁ డై విరటుఁ గొల్వ వచ్చుట *—

సీ. చట్టువం బొకచేతఁ § బట్టి ఖడ్గము సంకఁ, దగిలించి సురియతోఁ§బిగియ ద్రిండు
గట్టినను నుఁ జేల§[2]క ప్పెంతయును జెన్ను, సేయంగ డాపలి§చేతియందు
జెడిదంపుఁగోలలు § బెడఁ గొంద బహువర్ణ, చిత్రితాజినము పై§చీర గాఁగ
జూప జెల్లను దన§రూపంబు చూడ్కికి, వ్రేఁ గైన నత్యంత§విస్మయంబుఁ

తే. బొందు చుండ సమీరణ§పుత్త్రుఁ డగ్రజుండు వోయిన దెసఁ దప్ప§నొండువలన
సమదవారణపతిగమ§నమున మత్స్య, ధరణివల్లభుసభ చేర § నరుగుటయును.

వ. అంతం తం గనుంగొని. 212

క. ఉలుకును వెక్కసపాటును, దలకొను నెమ్మనముతోడ § ధాత్రీరమణుం

1. 'తత్పరులై యుండి' రనియే వ్రా. ప్ర. 2. గ. జ్ఞ్వక ట్టెంతయును:

[1]డలఘుభుజవిపులవక్షస్స్థల రేఖాకాంతిఁ బరవశత్వముఁ బొందెన్. 213

వ. ఇట్లతనిరూపాతిశయంబున కోటువడి చూచుచు నిజాంతర్గతంబున. 214

క. విహరింప మానవాకృతి, సహితంబుగ మహికి నర్థిఁ జనుదెంచిన ప
ద్మహితుఁడో హిమకరుఁడో శచీ,గృహమేధియొకాక యితఁడు కేవలనరుఁడే.

క. ఏమికులంబునవాఁడో కో, నామం బెద్ది యగునో క్కా నాభృత్యులలో
నీమనుజోత్తముఁదొల్లియు, నే మెఱుఁగుదు మనఁగ నిచట నెవ్వరు గలరో.

క. అనుచుండ ననతిదూరం,బున కల్లన వచ్చి పవనపుత్త్రుఁడు మనుజేం
ద్రునకు జయశబ్దయుతముగ, వినయంబున మ్రొక్కి విన్నవించె నిభృతుఁడై.

శా. దేవా నాలవజాతివాఁడ నిను నర్థిం గొల్వఁగా వచ్చితిన్
సేవాదక్షత యొండుమై నెఱుఁగ నీచిత్తంబునన్ మెచ్చున
ట్లే వండం గడు నేర్తు బానసమునం దిచ్చోటనే కాదు న
న్నేవీటన్ మిగులంగ నెవ్వఁడును లేఁ డెబ్బంగులం జూచినన్. 218

క. పేరు వలలుండు గూడుం, జీరయు నిడి సాకతంబు సేసినఁ జాలుం
గోరినవంటకములు నా, నేరిమిఁ దగ నెఱపి కొలుతు నిశ్చల భక్తిన్. 219

చ. అనవుఁడు మత్స్యభూరమణుఁ డాతని కిట్లను నెట్లు శూద్రుఁ గా
నినుఁ దలఁపంగ వచ్చు ధరణీభగణక్షమమూర్తి వీవు నీ
కనుగుణమైనయానమును నాసనమున్ రుచిరాతపత్రముం
[2]జనవరికొల్వు నిచ్చెద [3]గజవ్రజముం బరికింపు పెంపుతోన్. 220

క. అనుటయు మోఱకుచందం,బున మో మడ్డము గదల్చి భూవిభుఁడు సభా
జనులు విన ననిలసుతుఁ డి, ట్లనియెం బ్రస్ఫుటనిరర్గళాలాపములన్. 221

ఉ. నా కవి యెల్ల నేల నరనాథులకుం బ్రియ మొందునట్లుగాఁ
బాకము సేయ నేర్తు జనపాలక ధర్మసుతుండు పెద్దయుం
జేకొని యుండు బానసము సేయువిధంబున కిచ్చమెచ్చి పు
ణ్యాకరమూర్తి వైననిను నాతనిఁ గొల్చినయట్ల కొల్చెదన్. 222

చ. వలసిన నేలు మేను బలవంతుఁడ గారెనుపోతు దంతి బె
బ్బులి మృగనాథునిం దొడరి పోరుదు శూరత యుల్లసిల్లఁగా
దలమున లావు విద్య మెయిదర్పముఁ బేర్చి పెనంగుజెట్టిమ
ల్లుల విఱుతుర్ వడిన్ గడియలోనన చూడ్కికి వేడ్క సేయుదున్. 223

క. కొలువు గొన నొల్లకుండుట, గలిగినఁ బొమ్మనుట యంతకంటెను మే లే

1, చ. డలఘుభుజా. 2. 'చనవు' అనఁగా నధికారము 'చనవర్లుకా' అని చంద్రరేఖావిలాపము, 'చనవరికొల్వు' అనఁగా అధికారికొల్వు, 3. ఇందులకు 'అనీకకర్ణాగ్రధరో రథీధ్వజీ' 'భవాద్యమే వారణవాహినీపతిః' అని మూలము ఇందలిరుచిరాతపత్రము యోధులబిరుదచ్ఛత్రమే కాని రాజు శ్వేతచ్ఛత్రము కాదు. 'వెల్గొడ్గులు' వాహనచ్ఛత్రంబులు' (భీష్మ ౧, ౭౬, ౯౪)

వలసినకడ కేఁగెద నీ, తలఁ పెయ్యది యాన తిమ్ము ధరణీనాథా. 224

వ. అనిన విని భూనాథుండు సానునయంబుగా నిట్లనియె. 225

ఉ. ఇమ్మహనీయరూపమునయే డ్తెఱఁ గన్గొని వేడ్క నీకు యో
గ్యమ్మగుభంగిఁ జెప్పితిమి గాని నరోత్తమ యొండు గాదు నీ
వెమ్మెయి నైన నిల్చుటయ యిష్టము వంటలమేరివాఁడ నై
యిమ్ములనుండు నూపజన మెల్లను నీదగుపంపు సేయఁగన్ 226

క. అని హర్షోత్కర్షంబున, మన మలరఁగ బల్కి మత్స్యమనుజాధీశుం
డనిలసుతు నేలె నాతఁడు, దనమనమున నూఱడిల్లెఁ దదవసరమునన్. 227

—♦ అర్జునుడు పేడిరూపమున విరటుఁ గొల్వ వచ్చుట ♦—

సీ. కాళ్ళయొప్పిద మాఁడుక ట్టనుజ్జ్వలము సేయంగ సంకులబాహులందు మెడలఁ
గంచుక మంగంబుకాంతికి మాటుగా, మెడ హేమపట్టిక మెఱయ కుండ
వదనంబుకొమరు భావనఁ జేసి వేఱుగా, నుదుటిపెంపలకలబొదువఁబడఁగఁ
బవడంపుజొత్తులఁజెవులు రూ పడఁగంగఁ, బాపటఁ దలకట్టుభంగి [1]గప్ప

ఆ. మంచు మఱుఁగువడినమార్తాండుఁడునుబోలె, [2]నీఱుగవిసి యున్ననిప్పుఁబోలె
వేషధారి యైనవిష్ణుండుఁబోలెన, వ్విరటుకొలువు సేరనరుఁడు వచ్చె. 228

క. చనుదెంచి పేడితనమును, వనితారూపంబు నమర వాసవసుతుఁడా
మనుజాధీశునకు సభా, జనులకుఁ దనుఁ జూపి మందసంచారమునన్. 229

వ. మెలంగినం గనుంగొని మత్స్యజనవిభుండు దనయొద్దివారలతో నిట్లనియె. 230

మ. వనితావేషము గల్గి యున్నయది చెల్వం బాఁడుచందంబు గా
దు నిరూపింప మహానుభావతయు నిర్దోషత్వమున్ రాజసం
బును శోభిల్లెడు నెవ్వఁ డే నొకజగత్పూజ్యుండు క్రీడార్థ మి
ట్లొనరం దాల్చినరూపు గావలయు మీ రూహింపుఁడా యట్లగున్. 231

తే. అనినఁ బరిజనంబులు విస్మయంబు గదుర, నిశ్చయముసేసి పలుకంగ నేర్పు లేక
చూచు చుండఁగ సవ్యసాచి సేరఁ, జని విరాటనృపాలుతో సవినయముగ.

క. నిన్నుఁ గొలువంగ వచ్చితిఁ, గన్నియలకు నాట గఱపఁ గా నోపుదు వి
ద్యోన్నత మన్నామంబు బృహన్నల యేఁ బేడి ననుడు నతఁ డి ట్లనియెన్.

ఉ. ఆయతబాహులుం వెడఁద యైనసమున్నతవక్షముం సరో
జాయతలోచనంబులుఁ బ్రసన్నముఖంబు నుదాత్తరేఖయుం
గాయజుఁ గ్రేణిసేయు ననఁ గాశికు మీఱు ననంగ విభ్రమ
శ్రీయును బెంపునుం గలుగఁ జేసి విధాతృఁడు పేడిఁ జేసెనే. 234

శా. మత్తోద్దండచయంబులోన నొకసమ్మాన్యార్హచాపంబు భా
స్వత్కాండంబులు [3]హేమచంద్రకకనద్వర్మంబు నీ కెంతయుం

1. చ. కప్ప. 2. జ. నివుఱు. 3. క. హేమచిత్రితలసద్వర్మంబు.

సత్కారంబున నిచ్చి వాహనపరిష్కారాంకసంభావ్యసం
పత్కల్యాణునిఁ జేసి వైభవము దర్పంబున్విజృంభింపఁగన్. 235

క. ఏము నిను మత్స్యరాజ్య, శ్రీమహిమకు నెల్ల యుక్తుఁ । జేయఁ దలంపం
గా మామనోరథమునకు, నీమాట విరుద్ధ మయ్యె । నిది యెట్లొకో. 236

వ. అనిన విని యమ్మహీపతికి బృహన్నల యిట్లనియె. 237

ఉ. ఆఁడుదనంబు నిక్కమున । కారసి చూచిన లేదు పుంస్త్వముం
బోఁడిమి దప్పి యున్నది నపుంసకజన్మ మవశ్యభోగ్య మై
వాఁడిమి గల్గుశాపమున । వచ్చెఁ బురాకృతకర్మ భావ్య మె
వ్వాఁడును నేర్చునే తొలఁగ । వైవఁగ నొర్వక పోవ వచ్చునే. 238

వ. కావున. 239

తే. ఒండుపనులకు సెలవు లేకునికిఁజేసి, యభ్యసించితి శైశవ । మాది గాఁగ
దండలాసకవిధమును । గుండలియును, [1]బ్రెక్కణంబు తెఱంగును । [2]బేరణంబు,

క. విశ్రుతవాద్యంబులు మం,జుశ్రుతిసంభావ్యగీతనుగతులు సద్భా
వాశ్రయములుఁ దజ్జన్యర,సాశ్రయములు నైనయభినయంబు లెఱుఁగుదున్.

తే. ఇన్ని తెఱఁగుల శ్రమము సేయింతుఁ జతుర, తావిహీనములైనపాత్రములనైన
నట్టువొజ్జనై మెలఁగుదు । నగళులందు, నిపుణనై పథ్యవిధులకు । నేర్తునధిప.

చ. అనుడు విషణ్ణ మైనహృదయంబున గారవ మొంద నైపుణం
బున నుచితంబుమై నరసి । పొచ్చెము లేమిఁ దదీయసేవ గై
కొనుటకు నిశ్చయించి తనకూఁతు విరాటుఁడు పిల్వఁ బుచ్చె న
ర్తనమునకై బృహన్నలకుఁ । దత్పరతం దగ నప్పగింపఁగన్. 243

వ. ఇట్లు రావించిన. 244

సీ. అల్లదనంబున । ననువు మైకొనఁ జూచు, నడపు కాంతికి వింతతొడవు గాఁగ
వెడవెడ నూఁ గారి । వింత మై [3]యేర్పడు, దేరనివళులలో । నారు నిగుడ
నిట్టలు ద్రోచుచు । [4]నెరవులకలమేర, నెల్లను బిగి యెక్కి । యేర్పడంగఁ
దెలుపును గప్పును వెలయంగ మెఱుఁ గెక్క,తారకంబులఁగల్కితనముదొడరఁ

ఆ. జరణములును నడుముఁ । జన్నులుఁ గన్నులు, జవ్వనంబుచెన్ను । నివ్వటిల్లు

1. క.ఖ. బ్రేంఖణంబు. 2. చ. బేరణియును, బ్రేరణియును. 3. ఇది 'ఏర్పడుదెంచు' ధాతువు. (ఆది. ౫-౧౩౪); ఘ. వెడవెడ నూఁగారు వింతయై యేర్పడఁ, దారనివళులలో నాఱు నిగుడ' నని యొకపాఠము 'నాఱు నిగుడ' ననఁగా నాఱువోసినభంగి నవక మెక్కి' (విరా ౨-౫౨) యన్నట్లు నాఱువలె నిగుడఁగా ననుట. జ. 'యేర్పడఁ దాఱనివళులతో' 4. 'నెరవు' లనఁగా 'చుట్టుఁబట్లు' లేక 'చుట్టును గలవి' నూతుళవముతోడ నేతెంచు నెరవులు' (విరా. 3-౨౪) నెరవుల్ విచ్చుటయున్' (హరివంశము-ఉత్త 3 ఆశ్వా.) చుట్టును గలవాద్దులెల్లబిగినొంది స్తనోద్భేద మగుచుండె నని యర్థము. 'సెలవు' లని రూపాంతరము.

చునికిఁ దెలుపుచుండ ♦ నుత్తర సనుదెంచె, నలరువిలుతుపువ్వుఁకటమ్ముపోలె.

ఆ. వచ్చి కొలువు సొచ్చి ♦ నెచ్చెలిపిండు నం, తంత నిలువఁ బనిచి ♦ యల్లనల్ల
గదిసి ప్రౌఢవనితకైవడి ముద్దియ, ముద్దు వుట్టఁ దనకు ♦ మ్రొక్కుటయును.

చ. తిగిచి కవుంగిలించి జగతీవిభుఁ డక్కమలాయతాక్షినె
మ్మొగము మొగంబునం గదియ ♦ మోపుఁ గరాంగుళులం గపోల మిం
పుగఁ బుడుకుం బొరింబొరి నపూర్వవిలోకన మాచరించుఁ గ
ప్పగుమృదుమాళి నుజ్జ్వలనఖాంకురచేష్ట యొనర్చు నర్మిలిన్. 247

వ. ఇవ్విధంబునం దనగాదిలికూఁతు నుపలాలించి బృహన్నలదెసం గనుంగొని సాదర దరహసితరుచిరాననుండై యిమ్మగువ నీకు నాట గఱపందగుపాత్రం బగునేయని యడిగి తత్ప్రతివచనంబులయందలినాగరికత్వంబునకుఁ జిత్తంబు రంజిల్ల మధుర సల్లాపంబుసేసి కర్పూరసహితం బగుతాంబూలంబు వెట్టి చిత్రంబులగు చీనాంబ రంబు లిచ్చి మణిమయంబు లగునాభరణంబు లొసంగిసంభావించి యవ్విభుండు.

ఆ. నీవు చతురమతివి ♦ నీకు నిక్కన్నియ, నప్పగింప నేల ♦ యైన నాదు
హృదయ[1]మతులు దీనియెడఁ గడు నార్ద్రమై, యుండుఁగాన చెప్పకుండరాదు.

క. నెచ్చెలులతోడ నెంతయు, మచ్చికఁ దనయిచ్చ నాడ ♦ మరగినయది యై
విచ్చలవిడి నింతకు ము, న్నిచ్చేడియ మెలఁగు శిక్ష ♦ యెఱుఁగదుసుమ్మీ. 250

ఆ. బాల కేళిమీఁదియభరము గ్రమంబున, విడువఁ గళలయందు ♦ వేడ్క సొనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు, నెలఁత కేడుగడయు ♦ నీవ కాదె. 251

చ. అని యుచితంబుగాఁ బలికి ♦ యంగనహస్తముఁబట్టి తత్కరం
బునఁ గదియించి నీగురువుఁ ♦ బొల్తి తగం గొనియాడు మెల్లు సె
ప్పె నటుల భక్తిమై నడవు ♦ పెం పెస లారఁగఁ గూడుగూర చం
దనకుసుమాదులున్ నడపి ♦ తప్పక యారసి గారవింపుమీ. 252

ఆ. ఎల్లచుట్టములును ♦ దల్లియుఁ దోడును, జెలియుఁ బరిజనంబుఁ ♦ జెలువ నీకు
గురువ యింక నొక్కకొఱఁతయు లే దిందుఁ, జేరి బ్రదుకు బుద్ధిగారవమున.

క. మనయింట నిచ్చ టచ్చోటన కెచ్చట నైన నీబృహన్నల మెలఁగం
జనియెడుమానిసి తనమన,మున కిమ్మగునట్టిచరితమున వర్తించున్. 254

—♦నకులుఁ డశ్వపాలకుఁడై విరటుఁ గొల్వవచ్చుట♦—

వ. అని యిత్తెఱంగున నయ్యిరువుర నొండొరులకు నప్పగించి పుచ్చినయనంతరంబ నకులుండు. 255

ఉ. అంబుజముల్ సముద్యదరుణాంశునిఁ గన్నవిధంబునన్ వికా
సంబున నుల్లసిల్లి జనచారువిలోచనముల్ నిజోజ్జ్వలాం
గంబున కర్థిమై నభిముఖంబులు గాఁ జనుదెంచి దైవయో

1. మలఁచి.

గంబున భూవిభుండు దురగంబులఁ జేరఁగ బంచి చూడఁగన్. 256

వ. ఆస్థానంబు సేర వచ్చి ఘోటకంబుల నుపలక్షించుచున్న నన్న రేంద్రుఁడుగనుం
గొని పరిజనంబుల కతనిం జూపి. 257

క. ఇతఁ డెవ్వఁడొక్కొ రూపు ని, రతిశయ మై మనకునుఁ బ్రియం బొసఁగెడుఁ జూ
చితిరే చిత్తంబు నుదా, త్తత గానఁగ నయ్యెడుఁ వదనమునభంగిన్. 258

క. తురగంబులఁ జూచువిధం, బరయఁగ నితఁ డశ్వవిద్యయందు నిపుణతా
స్ఫురణము గలవాఁ డగు బం, ధురమూర్తిపరాక్రమాన్వితుఁడు గానోపున్.

క. మీ రెఱిఁగినఁ జెప్పుఁ డీతని, పేరెఱుఁగనియట్టులైనఁ బెంపారంగాఁ
జేరం జని యల్లన యొకఁ, డారసి యెఱుఁగంగ వలయు ననుసమయమునన్.

క. చేరఁ జనుదెంచి పాండవ, వీరుఁడు మత్స్యాధిపునకు వినతుం డై దే
వా రాజవాహనము లగు, వారువముల నరయ నేర్తు వల నేర్పడఁగన్. 261

వ. దామగ్రంథి యనువాఁడ నాకు నశ్వవిషయం బయినవిచక్షణత్వం బెల్లనుం గల
దవధరింపు మని యిట్లనియె. 262

సీ. అవయవలక్షణం బాయుఃప్రమాణంబు, గర్భంబు లింగితాకారములును
మాత్రాంతరము వయోమానంబు దేశకా, లోచితాహారప్రయోగభంగి
జాత్యనురూపశిక్షావిధి క్రమగతి, వ్యాయామసాత్మ్యప్రవర్తనంబు
ప్రమదవిషావాదిబహువిధచిత్తధ, ర్మము పోషణప్రకారము చికిత్స

ఆ. పరిచితములు ధరణిపాల నీముందట, రూపురేఖ మెఱయఁ జూప నేర్తు
బవర మైన నాకుఁ బని యేమి యనఁ జేతి, బలిమికలిమి నెఱపఁదలఁపుగలదు. 264

వ. అనిన విరాటుం డతని కిట్లనియె.

క. నీకుఁ దగుపదవి యిచ్చెద, నాకలిమికి నెల్ల రక్షణం బొనరింపం
గాక హయశిక్షకుఁడ వను, నాకొలఁదియె యిట్లు పలుకు టనుచిత మరయన్.

ఆ. అనుడు నకులుఁ డిట్టు లను దేవ తమతమ, నేర్పుపనుల వెంట నెగడి బ్రదుక
వలయుఁగాక నగరిదలము దప్పినమెలం, కువల కలుపు లియ్యకొనుట దగునె.

ఉ. ధర్మసుతుండు వెంచె ననుఁ దాన తురంగమశాస్త్రశిక్షకుం
గర్మఠుఁ జేసి యాత్మతురగంబుల కెల్లను నన్ను యుక్తుఁ గా
నర్మిలి నిల్పి యాగియుఁ బ్రియంబును నాయెడ నాఁడునాఁటికిం
బేర్మి వహించుచుండ నడపెం దనతమ్ములలోనివానిఁగాన్. 267

క. ఆ విభుఁడు రాజ్యసుఖలీ, లావిముఖత వెడలి బంధులం దొఱఁగి యథే
ష్టావాసత బ్రుంగుడువడి, పోవుట నెచ్చోటఁ గడుపుఁ బ్రోతునొ యనుచున్.

క. తిరిగి తిరిగి లోకో, త్తరచరితుఁడు సుజనుండు మత్స్యజనవిభుఁడు యుధి
ష్ఠిరునట్ల యనఁగ విని నినుఁ, గర మనురాగమునఁ గొలువఁగా నియ్యెడకున్.

క. చనుదెంచి కాంచి నానే, ర్చిన తెఱఁగున విన్నపంబు సేసితి నన్నుం

బనిగొనఁ దలఁచిన నేలెడి, దనుమానము గలిగినేని నరిగెద నధిపా. 270

వ. అనవుడు. 271

ఉ. ఆనరనాథుఁ డి ట్లనియె నశ్వములం బరికించి యునికి యిం
పేనిఁ దురంగశాలలకు నెల్లను ముఖ్యుఁడ వై తదీయనా
నానియతప్రకారకరణంబులఁ ద్రిమ్మరు చున్నవారి ము
న్నే నెటు లట్ల నీ వరసి యిచ్చమెయిం బని గొమ్ము నెమ్మితోన్. 272

క. అని చెప్పి యధికసమ్మా, ననపూర్వము గాఁగ మత్స్యనరపతి మాద్రీ
తనయుఁ దగ నిల్పె నాతఁడు, దనమదిఁ బ్రియ మందె నతనిహితమ్ముం డంతన్.

—♦ సహదేవుఁడు గోపవేషంబున విరటుఁ గొల్వ వచ్చుట. ♦—

క. పావనశాంతత్వము నిజ, భావంబున నూప్మలతయుఁ బ్రకటంబులుగా
నావిధుఁడు మనుజవేషుం,డై వచ్చెనొ శిఖి శరీరి యయ్యెనొ యనఁగన్. 274

క. తలుగులపొది యొకదెసఁ బె,య్యలదామెన యొక్కవలన నను వైయుండన్
మొల మోపి పెక్కుచుట్లన్, బలుద్రాటం జుట్టి గోపభావం బమరన్. 275

చ. నునుసెలగోల సేకొని మనోహర మాతనమేను రాజుచూ
పును బ్రజచూడ్కులం దిగువఁ బుష్కరపత్రనిభంబు లైనలో
చనముల మూర్తి దెల్పఁగ ససంభ్రమతం జనుదెంచె నల్లన
ల్లన వెడభీతి దోఁప జనులన్ వెగ డయ్యెడుదృష్టిఁ జూచుచున్. 276

వ. ఇట్లు వచ్చి మత్స్యమహీవల్లభు నంతంతం జేరి వినయావనతుం డగుచు నిట్లనియె.

క. నీపసులఁ గావఁ బెట్టుము, భూపాలక నన్ను నేను బూని యరసినన్
గోపంక్తులు రుజ వడ వోరు, చేపడ వెన్నఁడును డప్పిఁ జెడ్పడ వెచటన్. 278

తే. తొఱఁగుపోకుండ మెకములు గఱవకుండఁ
బాఁడి దఱుఁగక యుండ నాపాటిగొల్ల
లిచ్చ మెచ్చ నీదృష్టికి నెక్కఁగదుపు
నరయ నేర్తు నన్నేలుము ధరణినాథ. 279

వ. అనిన విరాటుండు పాండవావరజున కి ట్లనియె. 280

ఉ. ఎక్కడిమాట గొల్లతన మించుక యేనియు లేదు నీ దెసం
జక్కనిమేను నీగుణవిచందముఁ గాంతియుఁ జూడ వచ్చినన్
నిక్కువ మీవు సూర్యశశినిర్మలవంశజు లైనరాజులం
దొక్కమహానుభావుతనయుండవు గావలయున్ నరోత్తమా. 281

ఆ. వలయుపదవియందు నిలిచి నారాజ్య మంతయును జక్కఁబెట్టినయము విక్ర
మంబు నడపునంత్రమానిసి వై యుండి, కుచ్చితంపుబ్రతుకు కోరఁదగునె. 282

వ. ఉత్తమవాహనంబులు మహనీయాయుధంబులు నిచ్చెద మత్స్యదేశంబున భవ
దభిమతస్థలం బొసంగెద మద్దీయమండలసేనాపరిపాలనంబు సేసి వర్తిల్లుము. 283

క. అనవుడుఁ బాండునృపాలక, తనయుఁడు మ్రొక్కుచు విరాటధరణీశున కి
ట్లను హీనకులుఁడ బాలుఁడ, మును నాగరికంపుఁగార్యములనెర వెఱుఁగన్.

ఆ. పసులఁ గాచి కాని బ్రదుకఁ గౌరవులప్డు, తలము మున్ను నేను ధర్మపుత్రు
పశుగణంబు నెల్ల బాలింతు నమ్మహీ, వరునిచిత్తమునకు వచ్చువాఁడ. 285

వ. తంత్రీపాలుం డనం బరఁగినవాఁడ నాచేతం గ్రేపులు పురాణించుటం జేసి కొం
డొకకాలంబునన కదుపులం బెనుతు నే నగునని కైకొనినయాఁబోతుపంచితంబు
మూర్కొనినను బైగాలి వీచినను గొడ్డునకై నంజూలు నిలుచు నుంగిడి యదురుఁ
దిక్క యనువానికి నాపేరు సెప్పినం జాలు మఱియును బసికి వలయు తెఱంగు
లెల్ల నెఱుంగుదు వేఱొక్కపనికిం గాను గాని యే నీవెంట నీమనసు వడయం
జాలుదు నావలనం బ్రయోజనంబు గొనవలయు నేని నొంపుమాటలు దక్కి
పసులం బరికింప నియోగింపుము. 286

చ. అనుటయు నెట్టకేలకు ధరాధిపుఁ డట్టుల కాక యంచు నా
తనివదనంబు సూచి యుచితం బగునేనిఁ బ్రియంబ యేని నె
ట్లును గురుకార్యవర్తనముఁ లుక్ రుచియింపక యుండు నేని గో
ధనముల కెల్ల రక్షణము దత్పరతం దగఁ జేయు ముఖ్యతన్. 287

క. మున్ను గలగోపవర్గము, నిన్నుం గని కొలిచి భక్తి నీపని సేయన్
మన్ననమానిసి వైనీ, వున్నం గడు మేల కాక యొప్పమి గలదే. 288

—♦ ద్రౌపది సైరంధ్రీవేషమున సుదేష్ణఁ గొలువ వచ్చుట. ♦—

వ. అని పలికి యతనియభిమతంబు సలిపి నిలిపె న ట్లయ్యేవురును విరటుం గొల్చిరి
తదనంతరంబ. 289

క. గారవమున నిజదేశా, చారముమై నల్లి యున్న జడ యగుకబరీ
భారంబు విచ్చి తిరముగ, సైరంధ్రీ జాతి వేషసముచితభంగిన్. 290

క. వలపలిదిక్కున కించుక, మలఁగంగా దుఱిమి మిడి కుఱుమాపుడుఁబుట్టం
బలవడఁ గట్టి జరఠవ, ల్కలమున [2]నెవ్వఁగుఁజన్నుఁగవ గప్పి తగన్. 291

క. పరిచారికాత్వరేఖా, పరిణతి దనమేన నచ్చువడుభావనకుం
దిర మై తలకొనునంతః, కరణముతోఁ బురము ద్రుపదకన్యక సొచ్చెన్. 292

వ. ఇట్లు సొచ్చిన. 293

సీ. పఱిమొయిల్ గప్పినఁబాడఱినునుఁగాంతి, గదలినయమృతాంశుకళయుఁబోలెఁ
బెనుమంచుమీఁదఁ బర్వినవికాసము దప్పి, చెలువు గుందినసరోజినివిధమున
ధూమంబు వొదివినఁ దుఱఁగలిమెఱుఁగులు, నలఁగి మాసినదీపకళికపగిది
ధూళి పైఁ బొరసినఁ దొంగలించుట మాని, లావణ్య మెడలినలతికభంగి

తే. గంధకారికావేషంబుకతన మూర్తి, యుజ్జ్వలత్వంబు మఱుపడియుండఁ బొందు

1. ఘ. జ. యొప్పగు నదియున్. 2. క. నవ్వఁగుఁ నునుబిగువుఁ

తనయమహిషి యంచితగతిఁ జనఁగ రాజ, వీథిఁ బౌరజనంబు లవ్వెలఁదిఁ జూచి.

ఉ. రోహిణి యొండె నొండెను నరుంధతి గాక మనుష్యజాతియే
యీహరిణాక్షి చెల్వమున నెత్తెఱ చూడ్కుల నాఁచికోల కా
దా హితగౌరవం బగు శుభాంగముఁ దేజముఁ జూడ బుద్ధి సం
దేహముఁ బొందుచున్నది [1]సతీజన మిట్టిదె యెజ్జగంబులన్. 295

వ. అనుచు నంతంతం జేరి. 296

క. నీ వెవ్వ రేమిపనికై, యేవలనికిఁ బోవుచునికి యిది నావుడు న
ద్దేవియు సౌముఖ్యము [2]సంభావనముం దోఁప నుచితభంగిం జెప్పెన్. 297

ఆ. ఏను గట్టువాలుదాన నా కెవ్వరు, గడుపుకూడు వెట్టి కట్టఁ జీర
యిచ్చి సాకతమున నేలుదు రట్టివా, రలకుఁ బనులు సేసి మెలఁగుబుద్ధి. 298

క. వచ్చితి ననవుడు విని జను, లచ్చెరువును సందియంబు నడరెడుమదితో
నిచ్చెలువ కడుపుకూటికి, నెచ్చటనే నిలుచునట్టె యిది పలు కగునే. 299

వ. అనుచుం గనుంగొనుచు ముసరికొని చను చుండం బాంచాలరాజనందనం రాజ
మందిరంబుచక్కటికి నరుగునవసరంబున. 300

క. ముద మొదవ రమ్యహర్మ్యము, తుదినిలువునఁ బ్రణయసఖులతోడ విహారా
స్పద మగునెలవున మెలఁగెడు, సుదేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్. 301

వ. ఇత్తెఱంగున మత్స్యరాజమహిషి ద్రౌపదీదేవి నాలోకించి కుతూహలంబున. 302

ఉ. ఎక్కడనుండి యెక్కడకు నేఁగెడినో యిది యొక్క కాంత రూ
పెక్కుడు పెంపుసొంపు మన కేర్పడు చున్నది దా వినీత యై
స్రుక్కుచు నీచభామినులచొప్పునఁ బల్కెడుఁ బౌరులుం గడు
వెక్కస మంది చూచెదరు వేగమ తోడ్కొని రండు నెమ్మితోన్. 303

క. అని పలికి పనుపఁ బ్రౌఢాం, గన లిరువురు వోయి ద్రుపదకన్యకతో ని
ట్లనిరి విరాటుమహిషి నినుఁ, దనపాలికిఁ బిలువఁ బంపె దయ పెంపెసఁగన్.

వ. అనవుడు.

క. [4]తనతలచీర యరసి య, వ్వనితారత్నంబు వినయవైభవము సతీ
తను వొందినచందంబున, జనియెం గేకయసుతానుచారికలబడిన్. 306

వ. ఇవ్విధంబునం జని సౌధంబు నుపరిభాగం బెక్కి.

సీ. పదతలంబుల కెంపు పరఁగినతలము కుం, కుమ లిప్తమైనచందము వహింప

---

1. గ. జ. సతీజను లిట్టిరె. 2. జ. సద్భావంబును. 3. 'సుదేష్ణ' యని దాక్షిణాత్యకోశానుసారముగా ముద్రిత మగుభారతమునను నుత్తరదేశభారతమునను జూపబడెడి. 4. 'తలచీర యరయుట' యనగా స్త్రీజనోచిత మగుబెట్టు నూనుట. ఇందులకు 'హ్రీనిషేవాన్వితా' అనిమూలము గానోపు. 'కోరి తలచీర వాటింప నేరదయ్యె' (భాగవత. దశ. ఉ. 3-౫౬) గ. జ. తనతలఁపు నెఱసె నని యవ్వనితా.

నంగంబునునుఁ గాంతి § యడరినగోడలు, వేదులు మణిమయ§విధము నొందఁ
గనుఁగవ మెఱుఁగులు § గదిరినముందఱఁ బుష్పోపహారంబు§పొలుపు దాల్ప
వేనలికప్పు పర్వినమీఁదు నీల దు, కూలంబు మేల్కట్టు§కొమరు వడయఁ
తే. దాను జొచ్చిన కతనమ§త్స్యక్షితీశు, నింటని మ్మెయిఁ గ్రొత్తయై§ప్పెసక మెసఁగ
నమ్మహాదేవి యున్నెడ § కల్లనల్లఁ. పాండురాజతనూభవ§పత్ని యరిగె. 308

వ. కేకయరాజనందనయును. 309

చ. [1]కనుఁగొని గారవంబును మొ§గంబును గేలుఁ బురః ప్రసారముం
దనువును నమ్రభావమును § దంతమరీచులు సామినిర్గమం
బును దనలోఁ గడల్కొనఁగ § భూరితరాదరరేఖ నిందు ర
మ్మనవుడు నంత నంత ద్రుప§దాత్మజ సేరి వినీతి నిల్చినన్. 310

క. ఆపాదమస్తకము త, ద్రూపము వీక్షించుచుం గు§తూహల మడరన్
భూపాలమహిషి యిట్లను, నాపొలతుకతోడ నుచిత§మయ్యెడుభంగిన్. 311

ఆ. ఏది కులము నామ § మెయ్యది యెవ్వరి, దాన వేమిపనికిఁ § బూని యిప్పు
డెచటు బుద్ధిఁదలఁచి§యేఁ గెదవింతయు, నెఱుఁగఁజెప్పు మాకు§ మెఱుఁగుబోఁడి.

వ. అనిన విని యాజ్ఞసేని యిట్లను నేను సైరంధ్రీజాతిసంభూత నభిధానంబు మాలిని పురుషపంచకసనాథ నై యుండుదు నొక్క కారణంబున నుద్ధతు లగువిరోధుల చేతం బతులసన్నిధిం దలవట్టి యీడ్వంబడి వనంబునకరిగి వ్రతంబుమై వల్లభసహితంబుగా వన్యాహారంబులం గాలంబు గడపుచు బ్రహ్మచర్యంబు నడపితి నిట మీఁద నియమాచరణంబునకు నొక్కసంవత్సరంబు గొఱంత గలదు నీవు ధర్మవర్తిని వని వినుటం జేసి నానేర్చుపనులవెంట నీకడ నిలువం దలంచి యిందు వచ్చితి ననవుడు సుదేష్ణ యిట్లనియె. 313

క. సురగరుడఖచరవిద్యా, ధరకిన్నరయక్షసిద్ధ§తరుణులలో నీ
వరయఁగ నొక్కతె వగు ది,వ్వారికిం జనుదేరఁ గతము § బొంకక చెప్పుమా. 314

క. అనుటయు దరహసితము మో, మునకుఁ దోడవుగాఁగఁ బలుకు§ముద్దియ యేఁగృ
ష్ణునిదేవి సత్యభామకుఁ, బని సేయుదుఁ దొల్లి పిదపఁ § బాంచాలికడన్. 315

తే. తగవుమైఁ బరిచారికా§ధర్మములకు, నెల్లఁ జాలి వర్తించితిఁ § దల్లి వినుము
నాకుఁ బ్రాణంబు ప్రాణమై§నన్నుఁ దన్న, కాఁగ భావించి యాదేవి§గారవించు.

వ. నీవును. 317

క. నీచము లయ్యెడుపనులకు, నాచాలమి యెఱిఁగి మన్న§నకుఁ బాత్రముగా
నీచిత్తంబునఁ గైకొని, యాచారము దప్పకుండ § నరయుము నన్నున్. 318

వ. అని యిట్లు దేవజాతి యనుసందియంబు వాయం బలికి మఱియును. 319

1. ఇట 'గారవంబును మొగంబు' నిత్యాదు లగుజతలు భాషాశైలీప్రయుక్తములు; ఇట్టివే యుత్తరపర్వములనుం జూపట్టెడిని. ఆ. గారవంబున... గేల... దనువున.

క. కలపములు గూర్పఁ బహువిధ, తిలకంబులు వెట్ట వింత తెరువునఁ బలు[1]పు
వ్వులు గట్టి కట్టి మోడ్పఁగఁ, దల ముడువఁగ సరులు గ్రువ్వఁ దద్దయు నేర్తున్.

మ. అనినం గేకయరాజనందన ప్రభూతాశ్చర్యయై యిట్లనున్
విను నీరూపము సూచి మానృపతి యుర్వీశ్వరు నే నెమ్మెయిం
బనిగొందుం దగ నింతులుం దగిలి నీపైఁ జూడ్కి నెక్కొల్పి నె
మ్మనముల్ విస్మయ మందఁ జూచెదరు భామా పల్కులిం కేటికిన్. 321

క. దుర్భర వగు నినుఁ గర్కటి, గర్భము ధరియించునట్లు గైకొని నాకై
నిర్భరవిధ్వంసదశా, విర్భావము దెచ్చికొనుట వెరవై యున్నే. 322

ఆ. అనిన సీతలంచినట్ల కా దేర్పడ, వినుము నాదుపతులు వెరవు లావు
నలఘువిక్రమంబుఁ గలుగుగంధర్వు లేవురు నన్ను నొక్కమాత్రమైన.

క. నీచమతి నన్ను నెవ్వఁడు, సూచిన నారాత్రిలోనఁ జూతురు దెగఁ దా
రాచపలు హరిహరాదులు, గాచిన బలవిక్రమము లక్షఖర్వము లైనన్. 324

క. బంధుశతంబులు శౌర్యమ, దాంధములై శక్తిసంపదాభీలతమై
సింధురసదృశత నున్నను, సంధులసంధు లెడలించి చంపుదు రతనిన్. 325

వ. కావునఁ బురుషులు నాకడం దేఱి చూడను వెఱతు రదియునుం గాక. 326

క. నాచిత్తము తాదృశులకు, గోచరమే యస్మదీయకులజన[2]సంశ్రి
తాచారమహిమ యట్టిది, యే చెప్పకు తద్విధాతిహీనవచనముల్. 327

చ. మనమున నూఱడిల్లు మనుమానము మానుము నన్ను నేలు మే
పనులు నుదాత్తనాగరికభంగుల నీమది కెక్కునట్లు నే
ర్పును భయభక్తులున్ మెఱయ రూపుగఁ జేసెదఁ దజ్జ్ఞ లైన స
జ్జనులు నుతింప వర్తనము సాధులు వృద్ధులు మెచ్చఁ జెల్వొదన్. 328

క. ననుఁ గుచ్చితంపుఁ బనులకుఁ, బనుపక యెంగిలికి లోను పఱుపక తగుమ
న్ననతోడ నరయువారల, కనురాగము నెఱపి నడతు రస్మత్పతులున్. 329

ఆ. అనిన సంతసిల్లి యద్దేవి సైరంధ్రి, నూఱడిల్లఁ బలికి యునిచికొనియె
నంతిపురముచరిత కలవడ మెలఁగుచు, నుండె నవ్వధూటియును ముదమున.

క. ఇవ్విధమున నయ్యేవురు, నవ్వేలఁదియు సకలజనుల కజ్ఞాతముగా
నవ్విరటుపోలఁ బ్రమదము, నివ్వటిల వసించి రుచితనిభృతత్వమునన్. 331

వ. అనిన విని వారలవర్తనం బటమీఁదఁ జెల్లిన తెఱం గెఱింగింపు మని యడిగిన.

ఉ. బాంధవశాత్రవాకలితభావభవాభవపాశ[3]బంధసం
బంధవిరామరామ పరిపక్వవివేకనిరూఢభక్తహృ
ద్గ్రంథివిభేదనా పరమకారుణికా పరిమాణదూర దుః

---

1. క. జ. పుప్పివ్వులు. 2. ఘ. సంరక్షాచార. 3. వేల్లి కాబంధ.

ఖేంధనపావకాయితసత్క్షమిాక్షణ [1]చైత్తమహాద్భుతప్రభా. 333

క. అన్నమయత్వాదివిరా, మోన్నతివాఙ్మనసదూర ♦ యోగిస్మేరా
భిన్నాభిన్నాకార, చ్ఛన్నాత్మక్రియప్రకార ♦ జగదాధారా. 334

మాలిని. కమలభవకిరీటగ్రామపద్మావలీసం
గమసుభగపదాబ్జా ♦ గాఢభక్తిప్రకార
ప్రముదితమునిశశ్వద్భావనాగమ్యరమ్య
క్రమపరిణతమూర్తీ ♦ శ్రౌతశాఖాగ్రవర్తీ. 335

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము, 336



1. ఇది 'సంవిత్ప్రిభావల్లభా' అనుటం బోలినది.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము, ద్వితీయాశ్వాసము



మదపాంగాలోకన
ధామసకృత్సంగరూఢతాదృశవిభవో
ద్దామాశ్రితలోకా లో
కామయనిర్వారణనిపుణ హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్టియెడ ధర్మసూనుండు సభా
జనంబులయుల్లంబులు రంజిల్లరాజునకు వినోదంబులు వివిధోదాత్తప్రకారంబులఁ
జలుపుచు నొక్కొక్కమాటు మధురప్రసంగంబుగా నాడిననెత్తంబున గెలిచిన
విత్తంబులు దమ్ముల కొసంగుచుండు వాయునందనుండు వంటకు మిగిలినమాం
సంబులమ్మునెపంబున నిచ్చలు సహోదరులకు నిచ్చుచుండు వివ్వచ్చుండుసంగీత
ప్రసంగంబున మెచ్చువడసినకనకాంబరాదులు సోదరులకుం జేర్చుచుండు నకు
లుండు [1]దురంగంబులగ్రాసంబులం గనినధనంబులు తోడంబుట్టువులకుఁ బెట్టు
చుండు సహదేవుండు గోవులం జూచి భూవల్లభుండు సంతసిల్లినసమయంబున
సముపార్జితంబు లగుపదార్థంబు లన్నియు నన్నల వశంబుసేయుచు వారలకు
గోరసంబులం దుష్టి సలుపుచుండు ద్రౌపది దన్నరసికొని తిరుగుచున్నవీరులం
గన్నులారం జూచుచు నుచితంపునడవడి మెలంగుచుండు. 2

తే. ఇట్లు దమతమవర్తిల్లునెడల సకల
జనములకు హృదయానురంజన మొనర్చి
తాల్మి పుయిలోట యడఁకువ తగవు మెలపు
నెఱిదెఱంగును బాటింప నేర్పు గలిగి. 3

క. ఉన్నతతఱి వివిధదేశో, త్పన్నులు నద్భుతవిధాయిబలవిక్రమసం
పన్నులు నగుమల్లులు విభ,వోన్నతుఁ డగువిరటుపాల నుద్భటవృత్తిన్. 4

క. తమలోన మాటలాడెడు, సమయంబున నొక్కరుఁడు విశాలోరస్కుం
డమితబలుఁడు పంచానన, సమమూర్తిస్ఫూర్తి యధికసంరంభమునన్. 5

1. క. దురంగప్రసంగంబుల.

వ. అన్నరపతికట్టెదుర నిల్చి భుజాస్ఫాలనంబుఁ జేసి యిట్లనియె. 6

తే. నేలనాలుగుసెజ్జఁగుల ♦ నృపులకొలువు, లందు నేను వర్తించితి ♦ నవనినాథ
యగ్గలించి నాయెదుర బాహువప్పళించి. [1]కడఁగ.జాలెడుమల్లులఁ ♦ గాననెందు.

చ. అనఁ నెడ వానియుగ్ర సమ♦దాకృతియుం బటువాక్యవృత్తియుఁ
గని విని మల్లు లెల్ల భయ♦కంపితమూర్తులు దాల్చి మాఱు ప
ల్కను గను విచ్చి చూడను మొ♦గం బెగయింపను జాల కున్న న
జ్జనపతి వేడ్క బ్రోడుపడు♦చందము గాంచి యుధిష్ఠిరుం డనున్. 8

క. వీనికి మాఱొక్కఁడఁ జాలెడు, దానికిఁ దగువాని ధర్మ♦తనయునిపురిలో
నానావియుద్ధలంపటు, నే నొక్కనిఁ గంటి [2]నిపుణు ♦ డిందుల కతఁడున్. 9

క. మనబానసీఁడు వలలుం, డనుశూద్రుఁడు నాకుఁ దెల్ల ♦ మధికబలుల నో
ర్చినవాఁ డనేకమల్లుల, నిను మెచ్చింపంగఁ జాలు ♦ నిజ మిది యధిపా! 10

క. అనవుడు భూపతి పిలువం, బనిచె నతని నతఁడు నపుడు ♦ భయభక్తులతోఁ
జనుదెంచి మల్లవర్గము, గని మైవెఱుగంగ నిలిచె ♦ గౌతూహలియై. 11

వ. ఇట్లు నిలిచినపవనతనయు నవలోకించి యవనీవల్లభుం డమ్మల్లముఖ్యుం జూపి యితనితోడియుద్ధంబునకు సన్నద్ధుండవుగ మ్మనిననతండును ధర్మతనయుకనుసన్న గయికొని యమ్మత్స్యవిభునకు వినయంబుతో నిట్లనియె. 12

తే. అధిప ధర్మజుపాల ను♦న్నప్పు డతని, వేడుకకుఁ దగఁ బెనఁగుదు ♦ వింత లైన
జెట్టిమల్లులతో నిప్పు ♦ డట్టువోలె, నీదువేడ్కకుఁ బెనఁగెద ♦ నేర్చినట్లు. 13

—♦ భీముఁడు మల్లునితో యుద్ధము చేయుట ♦—

వ. అని మెత్తన యియ్యకొని గర్జించి గజాలస్యంబున [3]సంగణంబు సొచ్చి భూపాలుని ముందట భుజాస్ఫాలనంబు సేసి మ్రొక్కి మరలునెడ నంతకు మున్న యమ్మల్లివరుండు నరపతియనుమతి వడసి కృతపరికరబంధుండై యరుగుదెంచి యచ్చట నునికిం జేసి యతండును ననిలసుతుండును బరస్పరమూర్తుల నవలోకించి యుద్ధరంగంబుమన్ను ఫాలప్రదేశంబుల ధరియించి శిరంబులపైఁ జల్లుకొని రెండుసేతుల మునివ్రేళ్ళను గొండొక పుచ్చుకొని యొండొరులదెసకు వైచియున్నతంబులగుననపసవ్యకరంబుల నాకుంచితసవ్యబాహుతలంబుల నప్పళించుచప్పుళ్ళు గలసి యొక్కరుండ మల్లచఱచినచందంబున వీతేర వింతతానకంబుల నిలిచి కదిసిన యప్పుడు వృకోదరుండు. 14

సీ. [4]ఉపతాయిలోఁ దన ♦ కొదవినతోరహా, త్తము సూపి వ్రేయక ♦ సమదవృత్తిఁ
బాసి క్రమ్మఱఁ జేరు ♦ బలువిడి వాఁడు పై, నడరిన జరగక ♦ యవనిఁ గ్రుంగి
నిలుచు నొత్తొరువున ♦ వలచినయప్పుడు, గొనిపోవు నవలీలఁ ♦ గూలవైచు

1. చ. కడవఁ జాలిన, 2. నిపుణుఁ డింగుల కతఁడున్. 3. క. కంకటంబు; చ. సంఖణంబు, ఙ. సంఘణంబు; ఘ. నంఖణంబు; సంకణంబు, 4. చ. ఉపతాయిలోఁగొన ♦ కొదవిన.

జళికి పట్టిన మను♦సన్నపువిన్నాణ,ములు దొరకొన్నను ♦ ముట్టఁగొనఁడు

తే. కాలిదెసఁ జొర వచ్చు♦టఁగానిపించి, [1]యుడుగుసీసానఁ బట్టియు ♦ [2]నుప్పళించుఁ
బోవ నిచ్చు మగుడ [3]నేచి♦పోరఁ జేరు, [4]నెడల సరిసేయ నగుతడ ♦ వీకహత్తు.

వ. మఱియు ననేకగతులయోజలు మెఱయుచుఁ గొండొకసేపు విరాటునకు వినో
దంబు సలిపి. 16

ఆ. కచ్చ యమరఁ బట్టి ♦ కాళ్లును చేతులు, వ్రేల మత్తగజము♦లీల మెఱయ
ముష్టిబలువు నెఱయ ♦ ముక్కున వాతను, నెత్తురొలుక మల్లు ♦ నెత్తి వైచె.

వ. ఇవ్విధంబున విసరి నేలతో వ్రేసి పీఁపున మండివెట్టిన. 18

క. పెలుకుఱి తాళం బీ మదిఁ, దలఁచి యనువు గాక ధరణి♦తలముఁ గరతలం
బుల నప్పళించె వాఁడ, క్కోలు వార్వఁగ [5]విడిచి మెఱసెఁ♦గుంతీసుతుఁడున్.

వ. ఇవ్విధంబున మహాబలుపట్టి యాజెట్టి నెట్టన గెల్చిన మత్స్యపతి మెచ్చి తన
కిచ్చినధనంబు లచ్చటిజనంబుల కిచ్చి నిజనివాసంబునకుం జనియె మఱియు
నిత్తెఱంగున నతనికి వేడ్క సలుపుచుండఁ జిక్కనిమల్లులు లేనితఱి నంతిపురంబు
నింతులు సూడ నయ్యవనీకాంతుండు పోరింప శార్దూలశుండాలాదులతోడ
నీడంబోక పెనంగి భంగంబునకుం దెచ్చి మెచ్చించుచుండు. 20

క. పెఱవారలు దమమెలఁగెడు, తెఱఁగులు దొరఁకొన్న వింత♦తెరువులనేర్పుల్,
మెఱయుచుఁ బతిచిత్తము గొన, నొఱపు గలిగి మాన్యవృత్తి♦నుండుదురుదగన్.

వ. ఇట్లు పాండవులు పాంచాలీసహితంబుగా విరాటునగరంబున వర్తించుచుఁ గతి
పయదినంబులు గొఱంతగా నేఁడుకాలంబు గడపినసమయంబున మత్స్యపతి
మఱందియు దండనాథుండును గీచకాగ్రజుండునురూపాభిమానియు నానాభరణ
ధరణశీలుండును దుర్విదగ్ధుండును బలగర్వితుండును నగుసింహబలుండు తనయప్ప
సుదేష్ణకు మ్రొక్కం జనువాఁ డద్దేవి కనతిదూరంబున నున్నద్రుపదరాజ
నందనం గనుంగొని. 22

ఉ. అక్కజ మైనచెల్వమున ♦ నాత్మకు వ్రేఁ గయి పొల్చుపొల్తిపై
నెక్కొనుచూడ్కిఁ గ్రమ్మఱుప♦నేరక యూరక నిల్చెఁ గాముచేఁ
జిక్కిననెమ్మనంబు గడుఁ ♦ జేడ్పడుమానముఁ జేష్టితంబులం
దక్కినయంగముం దలఁకు♦ధైర్యము నై యతఁ డప్పు డయ్యెడన్. 23

తే. ద్రౌపదీరూపమనునురిఁ♦దగిలి తనదు, హృదయ మనుమృగమత్తఱి♦నుదిలకొనుచు
గాముఁ డనుబల్లిదపువేఁట♦కానిబారిఁ, బడుట కెంతయు నాసింహ♦బలుఁడుదలరి.

వ. నిజాంతర్గతంబున.

ఉ. ఎందును నిట్టిరూపు నరు ♦ లెవ్వరుఁ గాంచిరె నాక కాదు సం

---

1. క. యడుగు. 2, చ. నుప్పళించి; జ. నప్పళించి. 3. ఖ. లేచి♦పోవ. 4. ఘ. జ. వెడల... నగుసెడ ♦ ఫీఁక. 5. ఘ. విఱిచి.



హ రి హ ర నా థా య న మః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము, తృతీయాశ్వాసము



త్త్వశివాత్త్వాలంబన
తత్త్వాశ్లేషాత్తశబల ❀ తాసంగతక
[1] ర్తృత్త్వాదికలీలాత్తమ
[2] హత్త్వాహంకారభావ ❀ హరిహరనాథా. 1

—♦ ఉపకీచకులు ద్రౌపదిం దమయన్నశవంబుతోఁ గట్టి దహింపం గొనిపోవుట ♦—

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియెఁ బవనతనయుం డట్లు సని మహానసమందిరంబుపరిసరంబున శరీరప్రక్షాళనంబు సేసికొని యనులేపనంబున [3]నస్రగంధం బుడిపికొని కృతకృత్యుండై శయ్యాతలంబునం గూర్చుండె నిట యాజ్ఞసేనియు భీమసేనుం డింతకు [4]వంటయింటికిం బోయి నిశ్చింతంబున నుండు నని నిశ్చయించి నర్తనశాల వెలువడి కావలివారలం బిలిచి. 2

క. నాపతు లగుగంధర్వుల, చేపడి మృతిఁ బొందె వీఁడె ❀ సింహబలుం డీ
పాపాత్మునిఁ జూడుఁడు దు, ర్వ్యాపారఫలంబు గాంచె ❀ నని పలుకుటయున్. 3

ఆ. వారు సంభ్రమించి ❀ వడిఁ [5]గోలదివియలు, గొనుచు నులివు మిగులఁ ❀ గూడఁబాఱి
నృత్తశాలఁ జొచ్చి ❀ రత్తఱి నాకల, కల మెఱింగి కీచ ❀ కవ్రజంబు. 4

చ. కడువెస వచ్చి రూపఱిన ❀ కాయము నున్నతెఱంగు జూచి బి
ట్టడలు మనంబులం గదిరి ❀ హా యనువారును జోద్యమంది మ్రా
న్పడియెడువారు నగ్రజుని ❀ పైఁ బడి మూర్ఛలఁ బొందువారు న
య్యెడ కరుఁగంగ నోర్వక ❀ మహిం బెఱచోఁ బలవించువారు నై. 5

వ. ఉన్నంత బంధుజనంబులు గూడంబాఱి కీచకశవంబుఁ గనుంగొని. 6

ఉ. మానవకోటి నిట్టివిసు ❀ మానపుఁబీనుఁగు లైనవారి నెం
దైనను గంటిమే యకట ❀ యాఱడి వమ్మయి పోయె దుర్జయం

---

1. క. గ. ర్తృత్త్వాదివిలాసాత్త. 2. చ. హాత్త్వాలంకార. 3. జ. విస్రసగంధం. 4. గ. వంటకంబునింటికిం. 5. అ. గాలుదివియలు.

బైనబలంబు గాని తెర వై తన కీర్తిఁ దోడు [1]గాద యు
క్కనిమనంబు గీడు పరీక్షించుచునె క్రొవ్వినఁ జేటు దప్పనే. 7

తే. కరము లెయ్యవి శిరమేది గాళు లెచటఁ, జొచ్చి గంధర్వవరులచే జచ్చువార
లెల్ల నిట్టుల యగుదురో యితనితోడి,యలుకఁ జేసిరొ యిది గడు నక్కజంబు.

వ. అని వెండియు బహుప్రకారంబులం బలుకుచు శోకవిస్మయపరీతచేతస్కు లయి
యున్నంత నొక్కయుపకీచకుండు నిజసహోదరులం జూచి. 9

క. మన మెంత [2]పనవి పిలిచిన, విన నేర్చునె సింహబలుఁడు వేగమ యితనిం
గొనిపోవఁగ వలయుంగా, కనియందఱుఁ దేర్చె ననునయాలాపములన్. 10

ఉ. సూతులు దాని కియ్యకొనుచుం దమయన్నకు నగ్ని [3]యేర్చువా
రై తగ వాచరించునెడ [4]నల్లన ద్రౌపది వీరిచందముల్
సూతముగాక యంచు నొకచోఁ దమచేరువ నున్నఁ గాంచి సం
జాతమహోగ్రకోపు లయి చారువిలోచనఁ బట్టి క్రూరతన్. 11

క. పెడ గేలు గట్టి పాపపుఁ,బాడ వగు నిది గాదె యితనిఁ బాడ వడఁగించెన్
గెడగూడ దీని నీతని,యొడలిపయిం బెట్టి కాల్చు టుచితం బరయన్. 12

వ. అని విరాటుని కెఱింగించి చేయువారై యంతకు మున్న యీవృత్తాంతంబంత
యు విని సంక్షుభితహృదయుండై యున్నయతనిపాలికిం బోయి. 13

తే. ఎల్లభంగుల సైరంధ్రి నేము సింహ, బలునితోఁ జంపువారమై తలఁచి నీకు
నెఱుఁగఁ జెప్పంగ వచ్చితి మీవు నింత,వట్టు మన్నన మాకునీవలయు ననిన.

వ. ఆతండును దనమనంబున నియ్యుపకీచకులచందంబుసూడ నేను వారించితినేనియు
నుడుగం గలవారు గా రని యూహించి వారలం గలయం గనుంగొని యట్ల
కాక మీకుం బోలినతెఱంగు సేయుం డనిన నదియ యనుమతిగాఁ గైకొని
సరభసంబునం జనుదెంచి. 15

ఉ. అంగజరాగమత్తుఁ డగుచున్ననకు నిమ్మెయి నైనఁ బ్రీతి సే
యం గలవార మీజఱభి యాతనితోడన తీఱుఁగాక యం
చుం గొనిపోయి దైన్యమున సూతునిపీనుఁగుమీఁదఁ బాండుపు
త్రింగనఁ బెట్టి గట్టిరి దయాపరివర్జితచిత్తవృత్తులై. 16

చ. అశుచియుఁ గష్టుఁడుఁ లఘువు నైననిజాగ్రజుమేనితోడ ని
త్యశుచియుఁ బుణ్యశీలయు సుదాత్తయు నాఁ జనునింతిఁ గొంచుఁ గ
ర్కశమతిఁ గీచకుల్ బహుముఖంబుల బాంధవవిప్రలాపముల్
దిశ లద్రువం జెలంగఁ గరదీపనికాయము ప్రజ్వరిల్లఁగన్. 17

క. పితృవనము దెసకుఁ జని న,య్యతివ భయభ్రాంతచిత్త యై బాష్పజలో

1. చ. గాక. 2. జ. వనరి, చ. పనికి, 3. గ. యిచ్చు. 4. గ. నల్కక.

ద్గతి మొగముఁ గప్పి నిట్లని, యతిరావముగా నొనర్చె నాక్రందనమున్. 18

ఆ. అనద నైతి నిచట నాలికయ్యాలింపుఁ, డకట మీరు గలుగ నాక్రమించి
నన్నుఁ గట్టి సూతనందను లిమ్మెయి, వెఱపు లేక [1]భంగపఱుచువారు. 19

ఉ. ఆనతవైరి యోజయ మహాద్భుతవిక్రమ యోజయంత దు
ర్మానవిఘూర్ణమానరిపుమర్దన యోవిజయాభిధాన తే
జోనిహతాహితప్రకటశూరగుణప్రతిభాస యోజయ
త్సేన విరోధిబాహుబలజృంభణభంజన యోజయద్బలా. 20

సీ. [2]తొడఁగినపని చలం [3]బెడపక యతిదుష్కరం బైనఁ గడ తేర్చుప్రభువులార
వెనఁగిన వైవస్వతుని నైనఁ గడిమిమై, వ్రేల్మిడిఁ బరిమార్చువీరులార
శరణార్థి యగుదుష్టశాత్రవు నైనను, గరుణ రక్షించుసత్పురుషులార
యర్థికిఁ బ్రాణంబు లైనను డాపక, తమకించి యిచ్చునుదారులార
తే. నాథులార గంధర్వరత్నంబులార, నన్ను నుపకీచకులు దమయన్నశవము
నందు బంధించుకొని వెస నరుగుచున్న,వారు రక్షింప వేగరావలయు మీరు.

—♦ భీముఁ డుపకీచకులం జంపి ద్రౌపదిని విడిపించుట ♦—

చ. అని పలవించునయ్యెలుఁగు లాపవమానతనూజుఁ డేర్పడన్
విని మది నాదువల్లభకు వీండ్రును గ్రమ్మఱ నింత సేసిరే
యనుచు సరోషసంభ్రమత నాయిత మై వెసఁ బాఱి వప్రలం
ఘన మొనరించె గుప్తముగ గ్రక్కున ముట్టెడుదానికిం దగన్. 22

తే. ఇట్లు లంఘించిపోయి పరేతభూమి, యొద్ద నలుదిక్కులునుజూచియొక్కయున్న
తావనీజంబు వెఱికి రౌద్రాతిరేక, మడర భుజశిఖరంబునయం దమర్చి 23

మ. వికటభ్రూకుటిఘోరఫాల[4]కలితస్వేదోద్భటుండుం జల
ద్వికృతోష్ఠద్వయుఁడుం [5]బ్రమర్దనదశావిర్భావసంభావితాం
గకుఁడుం జిత్తవిదాహదోహలసమగ్రక్రోధవేగుండు నై
బకవిధ్వంసకుఁ డయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తివిస్ఫూర్తితోన్. 24

వ. తదనంతరంబ. 25

ఆ. సూతుశవముతోడ నేతెంచు నెరవులు, దవ్వుదవ్వులన యుదగ్రరూప
కలితుఁడైనభీముఁ గనుఁగొని నడవక, నిలిచి రంతనంతఁగలఁగఁబాఱి. 26

మ. ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రింకెట్లొక్కొ యంచున్ భయం
బొదవం బల్లములందు డాఁగియు సమీపోర్వీజముల్ ప్రాఁకియుం
జెదరం బాఱియు నీరు సొచ్చియును నిశ్చేష్టం బదద్వంద్వముల్
గుదివడ్డం బెగ డొందియున్ భరితసంక్షోభాత్ము లై రత్తఱిన్. 27

ఉ. సూతులు భీతు లై ద్రుపదసూతిసమేతము గాఁగ నగ్రజ

1. క. భంగపఱుచువారె. 2. చ. జ. తొడరిన 3. గ. బెడలక. 4. ఘ. ఘటితస్వేదోద్భవుండున్, 5. చ. ప్రవర్ధన. 6. ఖ. కీచకుల్. చూ: 'నెరవుల' (విరా౧-౨౮౫) 'నెరవొంది' (విరా3-౧౦౫).

ప్రేతము వైచి పీటిదెసఁ § బెల్లుఁగ బాఱఁ దొడంగినన్ వడిన్
వాతసుతుండు ముట్టికొని § వారి బడల్పడ వ్రేసి యందఱం
జేతులతీట వోనుఱుము § సేసె విశృంఖలవిక్రమంబునన్. 28

వ. ఇవ్విధంబున నూటయేవురుపకీచకులను సమయించి శమితక్రోధుం డై వచ్చి పాంచాలీబంధమోక్షంబుగావించి యింక నిశ్చింతంబున సుదేష్ణమందిరంబునకుం జను మని యవ్వేలంది వీడుకొలిపి తాను ను వేఱొక్కమార్గంబున మహానస గృహంబున కరుదెంచెఁ దత్సమయంబున విరాటుండు గీచకానుజులు గంధర్వులచేత నిరవశేషంబుగా మృతిం బొంది రని విని చకితచేతస్కుం డగుచు సహోదరమరణశోకాయత్తచిత్త యయిన జీవితేశ్వరి నుచితాలాపంబుల ననునయించి యి ట్లనియె. 29

ఆ. చంద్రవదన యింక § సైరంధ్రి నిచ్చోటు, వాప వలయు నేమి § భంగి నైనఁ
గాన నాదుపలుకు § గాఁ జెప్పు వెడలుట, కనుగుణముగ నమ్మృ § గాక్షితోడ. 30

ఆ. పురుషు లాలతాంగి § పొరువునఁ బోయినఁ, జేటు వచ్చుఁ గానఁ § జెప్ప నేను
వెఱతు నాఁడువారు §[1] వెరవుతో మృదువచో, రచనఁ జెప్పుటరయ § నుచితవృత్తి.

ఉ. ఆ కమలాక్షిరూపమహి § మాతిశయంబు మనోహరంబు భో
గైకపరాయణుల్ పురుషు § లంగజుఁ డప్రతికారచేష్టిత
స్వీకృతలోకుఁ డ ట్లగుటఁ § జేటు పురంబునవారి కెప్పుడుం
గా కెటు లుండు నిట్టియవ § గాఢపుఁబొత్తు మనంగ వచ్చునే. 32

క. అని నిశ్చయించి పలికిన, విని కేకయరాజపుత్త్రి § విభుతలఁపు మనం
బునకుఁ బ్రియం బగుటయుఁ గై, కొని యాపని యట్లచేఁత § కుం బూనెఁ దగన్.

క. అంతం గుంతీనందన, కాంతాచింతామహాంధ § కారముతో న
త్యంతంబు మచ్చరించెనొ, సంతమసం బనఁ బ్రభాత § సమయం బయ్యెన్. 34

వ. పదంపడి పద్మినీప్రమోదసంపత్కరుం డగు నరుణకిరణుం డుదయించె నటమున్న పాంచాలి సచేలస్నానంబు సేసి రాగాదివికారనిరాసంబునం బ్రసన్న మయిన బుద్ధియుంబోలె సింహబలప్రభృతికీచకవిధ్వంసనంబునం దెలివొంది మందయానంబునం బురంబు సొచ్చి రాజవీథి నరుగుదెంచునప్పుడు. 35

సీ. మనకీచకుల కెల్ల § మారి యై పుట్టిన, సుదతి వో యెడు నని § చూచువారు
నద్దిరా నీకుఁ గ్రొ § వ్వెఱుఁగ దేఁ జూతుగాఁ, కని తల సూపక § యడఁగువారు
నలవోక గనుఁగొని § యంతరంగము బిట్టు, బెదర మాఱుమొగంబు § వెట్టువారు
నెదురుగా వచ్చిన § నెంతయేనియు దవ్వ, గలుగ వేఱొకత్రోవ § దొలఁగువారు
తే. ముట్టఁబడి మేనఁ గంపంబు § పుట్టనొదిగి, యుండువారుఁ గరంబున § నుదర మప్ప
ళించి ఘుమ్మరో[3]రక్కస § యంచు నుల్ల, ములుకువారునై పురజనం § బులు దలంకి.

1. క. తెఱఁగుతో. 2. క. గ. చ. మ్రుచ్చిలించెనొ. 3. జ. రక్కసి.

చ. పులిఁ గనుఁగొన్న [1]లేఁడులునుꟿబోలె విభీతిఁ గలంగఁ బాఱ స
న్నెలఁతుక యంతరంగమున ꟿ నిండినహాస్యరసంబు మోముపై
వెలివిరియంగనీక చని ꟿ వేచి మహానసశాలవాకిటన్
నిలిచినభీమసేనుఁ గని ꟿ నెయ్యము మెదం జిగురొత్తు చుండఁగన్. 37

క. తనయంతన యటు వలుకుచుఁ, జనువిధమున నతనిదిక్కు ꟿ చక్కనిమాడ్కిం
కనుఁగొనక ద్రుపదనృపనందన యిట్లను నిజకృతార్థతం దెలుపుటకున్. 38

తే. కీచకుల దెసఁ బుట్టినꟿకిల్బిషంబు, వాచి నన్ను రక్షించినꟿపరమధర్మ
రతికి గంధర్వపతికి నిꟿరంతరంబు, భక్తియు క్తిమైఁ బ్రణమిల్లి ꟿ బ్రదుకుదాన.

వ. అనిన విని యనిలనందనుండు నిగూఢవచనచాతుర్యధుర్యుండై యిట్లనియె. 40

చ. అతివ యపాయముం బొరయుꟿనప్పుడు గావక తక్కనేని యా
పతి పతియే తలంప మగꟿపాడియె లోకముపాడియే భవ
త్పతు లిటు లాచరించుట గꟿదా భవదీయమనోనువర్తన
స్థితి [2]కుచితంబు వారల నుꟿతింపఁగ నేల[3]నిసర్గవృత్తులన్. 41

—♦ ద్రౌపది యర్జునునితో సల్లాపంబు సేయుట ♦—

తే. ఇట్లు దమ్ము నిరూపింప ꟿ నితరజనములకు నశక్యంబు గాఁగ సꟿల్లాపరసము
ననుభవించుచు నల్లనꟿల్లన లతాంగి, యరిగె నర్తనమండపోꟿపాంతమునకు. 42

వ. చని విరాటకన్యకలయాటఁ జూచుచందంబున నందుఁ బురందరనందనుం గనుం
గొను నప్పాంచాలి నాలోకించి యతండును దారును దదభిముఖంబుగా వచ్చి
యక్కన్నియ లి ట్లనిరి. 43

ఉ. కీచకకోటిచేత నొకꟿకీడును బొందకవచ్చితమ్మ ని
న్నేచినదుర్మదుండు జముꟿనిం గొలువం జనెనమ్మ యంతఁ బో
కేచినసూతు లీయొడలిꟿ కింతయపాయ మొనర్తురమ్మ వే
కాచి విరోధులం దునుమఁꟿగా నిటు ముట్టుదురమ్మ నీపతుల్. 44

వ. అని తాము మున్ను విన్నకీచకవృత్తాంతంబున కనుగుణంబుగా నుపచారంబులు
వలుకు చుండ నాబృహన్నల సైరంధ్రి కి ట్లనియె. 45

క. ఆపాపాత్ములనీచ, వ్యాపారక్రమము వారꟿ లందఱు మృత్యు
ప్రాపితు లైన తెఱంగును, నీపలుకుల నెఱుఁగవలయుꟿ నెలఁతుక చెపుమా. 46

వ. అనిన విని సైరంధ్రి సాభిప్రాయంబుగా బృహన్నల కి ట్లనియె. 47

తే. కన్నియల కాట గఱపుచు ꟿ నున్ననీకు, నకట సైరంధ్రి యిప్పుడే ꟿ మయ్యెనేని
ఖేద మెద నించుకయు లేమిఁ ꟿ గాదె సన్మి, తాననంబుతోన న్నిటుꟿలడుగు టెల్ల.

వ. అనిన బృహన్నల యి ట్లనియె, 49

క. నీ వలుగులపడుటకు దుః, ఖావేశము వొందనే నిꟿరర్థక మగుని

1. క. గ. లేళ్ళగమిపోలె. 2. చ. జ. యుచితంబు వారికి. 3. క. వారల...నిసర్గవృత్తముల్
ఖ. గ. చ. వారికి...నిసర్గవృత్తముల్.

య్యేవపుఁబుట్టువు పుట్టిన, నావగ నెవ్వరికి నెక్కు ✽ నళినదళాక్షీ. 50

క. నీతోడిపరిచయము లే, [1]దే తలపోయఁగ ననింద్య ✽ యెందును నీ వి
ట్లాతుర వగుటకె నామది, నేతాపము లేదు నైజ ✽ మెఱుఁగవు గంటే. 51

వ. అని తాను నిజసహోదరులయట్లపోలె వేషాంతరంబు దాల్చినయంతియ కాక యూర్వశి యిచ్చినశాపం బనుభవించుటకు శరీరాంతరపరిగ్రహంబు సేయుటం జేసి రిపుమర్దనంబు తనకు వెరవు గాకునికి గుప్తసాభిజ్ఞానంబుగాఁ దెలిపిన బలసూదనసూనుపలుకులు విని పాంచాలి యంతస్స్మితకమనీయకపోల యగుచు నిట్లనియె.

ఆ. అట్లు కాక యింత ✽ యన నేల నీమది, తెఱఁగు గొంత యేను ✽ నెఱుఁగ కున్న
దానఁ గాను నగరఁ ✽ దగవుమైనీవు వ, ర్తించుటయ కరంబు✽ప్రియము నాకు.

వ. అనుచుం గన్యకాపరివృత యై యరిగి యంతఃపురంబు సొచ్చి సహోదరమరణ శోకాతుర యగుచు కైకేయికడకుం జనునప్పుడు. 54

సీ. [2]ముదమున నెలమిసొం ✽ పొదవి నెమ్మొగమునఁ, దోఁపంగ వచ్చినఁ✽ద్రోచిత్రోచి
లలి నుల్లసిల్లుచు ✽ లలితలోచనదీప్తు, లడర నుంకించిన ✽ నాఁగి యాఁగి
సంతసంబునబాలి ✽శము లగుచెయ్వులు, దొడరఁజూచినఁ జేయ ✽ కుడిగి యుడిగి
మనమున నుబ్బుమై ✽ మాట నాలుకకు రాఁ, గడఁగిన నాడక ✽ కడపి కడపి

తే. ధీర యై యిట్లు సమ్మద✽పూరమునకు, గఱువతన మనుబలితంపుఁ ✽ గట్ట వెట్టి
వెలఁది యెఱుఁగనియదివోలె✽వికృతిలేక, యల్ల నెప్పటియట్టుల✽యరుగుటయును.

క. భయశోకంబులు దనదుహృ,దయమునఁ [3]బిరిగొన విరాట✽ధరణీనాథ
ప్రియ సంభావన సేసె వి,నయపూర్వము గాఁగ ద్రుపద✽నందనకుఁ దగన్. 56

వ. ఇట్లు సంభావించియుత్తరుణిం దనపరిసరంబుననునిచికొనితదీయవదనంబవలోకించి.

తే. నీవు చక్కనిదానవు ✽ నెలఁత ధైర్య
రహితచిత్తులు మగవారు ✽ రాజు దీనిఁ
దలఁచి భయ మంది నిన్ను నీ✽వలచునెడకు
నరుగునట్లుగఁ బ్రార్థించి ✽ యనుపు మనియె. 58

వ. అని తనమనంబునం గదిరినయనుజవియోగతాపం బుత్కటం బగుటయు వెండియు ని ట్లనియె, 59

క. [4]బిరుదు గలమగలు గల రని, తరమిడి చంపింపఁ జూచె✽దవు జనములు నీ
పొరువునఁ బోవెఱతురు మా,పురమును రాష్ట్రంబు వెడలి ✽ పొ మ్మెం దైనన్. 60

వ. అనిన విని విరాటవల్లభకు సైరంధ్రి యి ట్లనియె. 61

ఉ. ముందటియట్ల యింకఁ బదు✽మూఁడుదినంబుల మాత్రకున్ భవ
న్మందిరవాస మియ్యకొని✽నం గడతేఱు మదీయవాంఛ యం
తం దగఁ దోఁచి మత్పతు లు✽దాత్తమతిన్ భవదీయవాంఛితం

1. క. లే, సే. 2. జ. మదమున. 3. ఖ. బిరిగొన్న. 4. చ. బిరుదు లగు.

బుం దలకొల్పఁ జాలుదు రశేషపూర్వమనః ప్రమదంబు సేసుఖున్. 62
క. కృత మెఱుఁగుదు రుపకార, వ్రతమున వర్తింతు రెపుడు వదలరు కరుణా
న్వితు లీనరపతికి శుభ, ప్రతిపాదకు లగుదు [1]రేమిశుభంగుల నైనన్. 63
వ. కావున.
క. సైరంధ్రి యిట్టు లనుటకుఁ, గారణము దలంప నేమి గా నోపునో యం
చారసి బహుప్రకారవిచారములకుఁ జొచ్చు టుడుగు సరసిజవదనా. 65
క. ఇది యేమి యైన నే మగు, మది నా [2]కిం తేల యనుచు మన్నన యెల్లం
దుదిఁ జెఱుపక ప్రార్థన సే,యుదుగా కని నిశ్చయించు టుచితము నీకున్. 66
చ. అనిన సుదేష్ణ యిట్లనియె నం తవునంతకు మద్గృహంబునం
దునికికి సమ్మతించితి నిజోచితవృత్తిఁ జరింపు నాదునం
దనుల మదీయవల్లభు నుదాత్తమతిం బరికించికొమ్ము నీ
మనమున కెట్టు లూఱట సమస్తము నట్టుల చేసెదం దగన్. 67
క. అని యూఱడిల్లఁ బలికిన, విని తొల్లిటియట్ల యుచితవృత్తి ద్రుపదనం
దన యుండె నట్టియెడని, ట్లని మ్రోసిరి జనులు పురము నందును భూమిన్. 68
చ. విరటుమఱంది కీచకుఁడు విక్రమదుర్దముఁ డన్యసైన్యభీ
కరమహనీయమూర్తి బలగర్వసముద్ధతచిత్తుఁ డెందు నె
వ్వరు సరిలేరు వీని కన [3]వాలినదండిమగండు సూడ న
చ్చెరు వగుచావు సచ్చె నటు సేసినవార లెఱు యెట్టివారలో. 69
తే. సింహబలుఁడు గంధర్వులచేత నొక్క, సతికిగాఁ నిట్లు ఘోరంపుజావు సచ్చె
నకట రిత్తకు రిత్త మహాత్మ్యవనీశు,లావు గోల్పోయె సూతకులంబు వాలిసె.
వ. ఇవ్విధంబునం బ్రవర్తిల్లుజనవాదంబు గ్రమక్రమంబున సమస్తదేశంబుల [4]నెరసి
చెల్లుచుండె నట్టియెడ. 71

—◆ దుర్యోధనుని వేగులవారు పాండవుల వెదకి కానక వచ్చుట. ◆—

ఉ. పాతకి యై సుయోధనుఁడు పాండుతనూజులు సల్పుచున్న య
జ్ఞాతనివిధివ్రతంబు గలుషంబుగఁ జేయఁ దలంచి పంచినన్
భూతల మెల్లఁ జూచి మును పోయెడునప్పుడు సెప్పకొన్నసం
కేతపుఁజోటఁ గూడఁబడి ఖేదముఁ బొందుచుఁ జారు లందఱున్. 72
వ. మగిడి వచ్చి హస్తిపురంబు సొత్తెంచి. 73
సీ. వరుస నేనుంగులు గురిసినదానధా, రావలి దగుకలయంపి గాఁగ
రాజులసందడి రాసినతొడవులు, మురిసి రాలినపొడి మ్రుగ్గు గాఁగఁ
గాంతలసంకులగతిఁ ద్రెస్సి తొరఁగిన, హారముల్ పుష్పోపహారములుగ
నే మేమ యని యోలి నెత్తినపరదేశి, దొరలపావడములు తోరణముగ

1. చ. జ. రెన్ని. 2. గ. జ. కిచింత యేల ◆ మన్నన...టుచితమె, 3. గ. బ్రాలిన. 4 ఘ. సొగసి. 5. ఖ. వృథా.

తే. సహజమైనయలంకారమహిమ నతిశ,యిల్లి మహనీయవైభవ మెసక మెసఁగ
వఱలునరపతిమందిరద్వారభూమి, సేర నరిగి యావేగులవారు ప్రీతి. 74

వ. సముచితంబుగాఁ బ్రవేశించి. 75

తే. ద్రోణగాంగేయభానుమత్తూనుకృపసు,శర్మదుశ్శాసనులు సర్వసైన్యపతులు
నార్యజనములుఁ గొలువమహార్హకాంచ, నోన్నతాసనమునఁ గొలువున్నవాని.

స్రగ్ధర. మాళిస్రక్సంగరంగన్మధుకరపటలీమానసాకృష్టివిద్యా
శాలిస్ఫారాబ్జరేఖాంజలిపుటఘటనాచారుఫాలస్థలశ్రీ
పాలశ్రేణీవిశాలాంబకకుముదవనీబాంధవాయత్తచంద్ర
శ్రీలీలాగాఢకాంతిస్మితవదనరుచిస్ఫీతు నాగేంద్రకేతున్. 77

వ కని జయజయశబ్దపూర్వకంబుగా సాష్టాంగదండప్రణామంబు సేసి. 78

క. మొగిచినచేతులు ముందల, నిగిడించి నితాంతవినయనిరతిం జారుల్
దగ విన్నవించి రిట్లని, జగతీశ్వరునకు నిజప్రచారం బెల్లన్. 79

క. దేవరయానతిఁ బాండవు, లేవురు ద్రౌపదియు నున్న యెడ యే మరయం
గా వెడలి వారు సనినమ,హా[1]విపినంబులకుఁ దొలుత నరిగితిమి వెసన్. 80

వ. అందు. 81

ఆ. [2]పరఁగుపొదరు పొదరు పల్లంబుపల్లంబు, మ్రాను మ్రాను దుర్గమంపుఁజోటు
దుర్గమంపుఁజోటు దొన దొన గుహ గుహ, యాది గాఁగ నెందు నరసియరసి.

వ. ఒక్కయెడ నరదంబు లరిగినచొప్పుఁ గాంచి దానివెంబడిం జని చని. 83

క. కేవలసూతులతోడన, పోవుట గని వారిఁ జేరఁ బోవక యది యిం
కేవంకఁ బోవునొకో యను, భావనఁ బోయితిమి దానిపజ్జన యేమున్. 84

వ. అదియును ద్వారకానగరంబున కరిగిన. 85

క. అందుల నుండుదు రనునా,సం దెల్లము గాఁగఁ బెక్కుచందంబుల ము
ట్టం దిరిగి తడవి కుంతీ,నందనులం గాన లేక నానాభంగిన్. 86

వ. విచ్చి పోయి సమస్తదేశంబులుం గలయం గ్రుమ్మరి కొండొకయు నుపేక్ష లేక
[3]పరువుతోడిద కాఁ బరికించుచు బయలను నాలస్యంబు దక్కి రోలంబునట్ల
శోధించుచుఁ [4]గీ డయిన నుదాసీనత యుడిగి మేలుచందంబున భావించుచు
వివిధప్రకారంబు లయినబహుప్రదేశంబులు రోసి కౌంతేయులం గానక సం
కేతస్థలంబునం గూడికొని మావర్తించిన తెఱంగు దేవరకు నెఱింగించి యట
దివ్యచిత్తంబున నవధరించినభంగి సేయువారమై చనుదెంచితిమి మాకుం జూడఁ
బాండవులు పొడవడంగి లేకపోయిరి గాని యాలోకంబున నునికి గలిగిన నగపడ
కుండ నేర రిది యికార్యంబునున్న రూపు మఱియొక్క విశేషంబునం బ్రియం
బంది వచ్చితిమి చిత్తగింపుము. 87

1. జ. విపినంబునకు. 2. క, పఱపుఁబొదరు. 3. ఘ. వెరవు. 4. ఖ. గీడు నుదాసీనత,

సీ. మత్స్యదేశాధీశుమఱఁది గీచకునిఁ బ్రజ్వలాకృతి యగునొక్కవనిత
కతమున నడురేయి గంధర్వు లతిరహస్యప్రకారంబునఁ జంపి రదియు
నక్కజం బాయుధ[1]వ్యవహార మేమియు, లేదు శిరంబు గా ళ్లేలు డొక్క
లోనికిఁ జొరఁ ద్రోచి పీనుంగుముద్దగాఁ, జేసి నైచిరి దుష్టచిత్తు లైన

తే. యతనితమ్ముల నొక్కరి నైనఁ దప్పి, పోవ నీక యారాత్రి యపాదివి చిత్ర
నిహతిఁ దెగఁ జూచి యనిరూపశేయదుర్ని, వారవృత్తిమై నరిగిరి కౌరవేంద్ర.

వ. విరాటుంటు పగతుండు గావునఁ దదీయవ్యసనం బెఱింగింప వలయునని విన్న
వించితి మది య ట్లుండెఁ బాండవుల నన్వేషించుపని [2]యిటమీఁదం జిత్తగించు
తెఱం గాన తిచ్చునది యనిన విని యట్ల చేయుదముగాక యని వారలఁ బోవం
బనిచి కొంతసేవు చింతాక్రాంతుం డై యమ్మహీకాంతుండు మంత్రులం జూచి
యి ట్లనియె. 89

తే. సమయసముచితకృత్యంబు చక్కఁజేసి
పాండవులు రాజ్యమున కాస పడక మున్న
యరసి యెఱిఁగి యరణ్యంబునందుఁ దొంటి
యట్ల యిడుమలఁ గుడువఁబో నడువవలయు. 90

క. ఎఱుఁగుట దుర్ఘట మెవ్విధి, నెఱుఁగంగా వచ్చు మీర లెల్లను మీమీ
యెఱిఁగినచందంబున నా, కెఱిఁగింపుఁడు వారి వెదకి యెఱుఁగు తెఱంగుల్.

వ. అనిన రాధేయుం డి ట్లనియె. 92

ఆ. వివిధదుర్నిరూపవేషముల్ గైకొని, నిఖలదిశలయందు నిపుణవృత్తి
[3]నెఱుఁగునట్లుగా ననేకులఁ బుచ్చిన, నెల్లి నేఁటిలోన [4]నెఱుఁగఁబడరె. 93

క. అనుపలుకులు విని దుశ్శాసనుఁ డేమియు సరకుగొనక సమద[5]విలాసా
ననుఁ డై నిజాగ్రజన్మునిఁ, గనుఁగొని యిట్లనియె గాఢగర్వస్ఫూర్తిన్. 94

చ. వలవదు రోయఁ బాండవుల నా రొక [6]యూఱట లేని[7]త్రిమ్మటన్
బల మఱి వన్యసత్త్వములపాల్పడి చచ్చినచోటఁ బూరియు
న్మొలవదె యింత కిం కిట మనోముద మస్ఖలితంబు గాఁగ వి
చ్చలవిడి రాజ్యలక్ష్మిఁ దగుచందమునం గొనియాడు మున్నతిన్. 95

వ. అనిన విని దరహసితవదనుం డగుచుఁ గుంభసంభవుం డి ట్లనియె. 96

ఉ. తే త్రిసమగ్రు లార్యనుతగౌరవదీప్తులు వర్ణనీయసా
ధ్విత్రు లుదాత్తదైవబలభవ్యులు దివ్యసమాను లాపృథా
పుత్త్రులు వారి నాపదలు వొందునె యోపిన నింక నైన నీ
ధాత్రిఁ గడంగి యారయువిధంబులు సెప్పఁడు నేర్పు లేర్పడన్. 97

---

1. గ. వ్యాపార. 2. చ. కిఁక. 3. ఖ. నేగునట్లుగా. 4. క. గ. నెఱుకపడరె. 5. జ. ఖికాసా. 6. క. గ. యూఁకువ, యుడ్కువ. 7. క. పిమ్మటన్,

—♦భీష్ముఁడు దుర్యోధనునితో ధర్మరాజుసుగుణంబులఁ జెప్పుట♦—

వ. అనిన నాతనిమాట లాదరించి భీష్ముం డిట్లనియె. 98

ఉ. నల్లవొ నిక్క మాడె నృప‡నందనుముందట ద్రోణుఁ డొక్కఁడుం
దెల్లము వారు బాహుబల‡ధీబలదైవబలంబు లొప్ప వ
ర్తిల్లుదు రమ్మహాత్ముల క‡రిష్టము లేమిట నెందు నేల పా
టిల్లెడు వారిఁ [1]గాన్పను గ‡డిందితదీయమహానుభావతన్. 99

క. వారలును వీరలును నా, కారయఁగా నొక్కరూప ‡ యైనను గార్యం
బీ రెఱిఁగింప వలయు నని, కౌరవపతి నన్ను నడిగెఁ ‡ గాన నితనికిన్. 100

క. కలరూ పెఱిఁగింపంగా, వలయుం జెప్పెద మదీయ‡వచనములు హితం
బులు గాఁగ నిశ్చయస్థితిఁ, దలఁచి యనుష్ఠింప బుద్ధి ‡ దలకొనునేనిన్. 101

సీ. బ్రాహ్మణభక్తియుఁ ‡ బరహిత[2]శక్తియు, నిర్మలమతియును ‡ నీతిరతియు
సత్యభాషణమును ‡ సాధుపోషణమును, జిరవితరణమును ‡ సేవ్యగుణము
సన్మార్గరక్షయు ‡ నున్మత్తశిక్షయు, నంచితోదయము గృ‡పాతిశయము
బంధుసంప్రీతియు ‡ భవ్యవిభూతియు, [3]శాస్త్రోపగమము న‡స్ఖలితదమము

తే. సజ్జనస్తవనీయసౌ‡జన్యములును, ధర్మసంచితబహుధన‡ధాన్యములును
గలుగు నక్షీణపుణ్యదో‡హలుఁడు ధర్మ,సూనుఁ డున్నదేశంబున‡మానవులకు.

క. మఱియును నొక్కవిశేషం, బెఱిఁగించెద నతనియున్న‡యెడ గోధనముల్
మెఱుఁ గెక్కి పాఁడి నేమిం, గొఱతవడక యుండఁ జేపి ‡ కురియుచునుండున్.

వ. కావున నిట్టిదేశం బిప్పు డెయ్యది యగు నందుఁ గుంతీతనయుల నరయం బనుప వలయు ననినఁ గృపాచార్యుం డిట్లనియె. 104

క. అరయఁగ నయ్యెడు తెఱఁగుల, నరయుట కార్యంబు వారి ‡ నాలస్యము లే
కరయునది పెక్కుభంగుల, నరసినఁ దోఁచెదరుగాక ‡ యది యట్లుండెన్. 105

ఉ. వారలు పూనినట్ల వన‡వాసము సల్పిరి [4]వీరు వేచి త
మ్మారయఁగా బయల్పడని‡యట్లుగ నుండెడువత్సరంబునుం
[5]జేరువచేరువల్ గడచెఁ ‡ జిత్తములుం గలుషంబు లమ్మహా
వీరుల కీనృపాలునెడ ‡ వీరికి నూరక యున్కి గర్జమే 106

క. అలుకైనను బగతునిదెస, దలఁపు గలుగ వలయు ననిన ‡ దర్పోజ్జ్వలదో
ర్బలు లగుకౌంతేయుల మన, మెలమికలిమి నచ్చి యిట్టు ‡ లేమఱ నగునే. 107

చ. మనబల మెంత యంతయు స‡మగ్రసముద్యమదుర్దమంబుగా
మునుమును గూర్చి తోడుపడు‡మూఁకలకుం దగుమైఁ గ్రమక్రమం
బున నెఱిఁగించి రాఁ బనిచి ‡ భూరిసముజ్జ్వలసైన్యజృంభణం
బున [6]నెర వొంది యున్కి కురు‡భూపతి కిప్పటి కార్య మారయన్. 108

1 క. గాంచుట. 2. చ. జ. యుక్తియు. 3. జ. శాస్త్రానుగమము. 4 ఘ. వైరు లేచి... నుండిరి. వత్స 5. క. గ. జేరువసేరువం. 6. గ. వెర వొంది.

ఆ. పాండురాజసుతులు బాసమై నడవడి, గడచి కయ్యమునకుఁ గాలుద్రవ్వ
కున్నయట్టులైన నిన్నరనాథుతో, సంధి సేయు టొప్పు సముచితముగ. 109

క. ఏచి చలంబున [1]నొంటికిఁ, జూచిన నప్పటికి మనకుఁ జూడం గార్యం
బేచందంబునఁ దెఱఁగగు, నాచాలుట కోర్వవలయు నది యట్లుంటెక్. 110

క. వారలు [2]లేరటె పో పెఱ, వారలఁ దగుభంగి మనకు వశ్యులఁ జేయన్
భూరిబలయుతుల మగుటయు, కారణ మను టనుమతంబు గాదే మనకున్. 111

తే. ఇవ్విధంబునఁ దమతమయెఱుఁగు తెఱఁగు
లందఱును జెప్ప విని కురునందనుండు
దగ విచారించి కార్యంబు తెగునఁ గాంచి
యెలమి వారలఁ గనుఁగొని యిట్టు లనియె. 112

ఆ. సింహబలుఁడు భీమసేనుండు శల్యుండు, హలధరుఁడు సమానబలమువార
లొండొరులను గెలుచునుత్సాహమునుగల, [3]రుద్ధతులును బాహుయుద్ధపరులు.

క. ఈనలువురభుజశక్తుల, తో నెనయఁగఁ జాలునట్టిదోర్బల మెందుం
గానము గావున వీరల, లోనన యొండొరుల కని గెలుపు సమకూరున్. 114

ఉ. తక్కినవార లాతనికి దప్పులచోటులవారు వాయుజుం
డొక్కఁడ యింక సింహబలునుద్ధతి మాన్చిన మాన్చువాఁ డతం
డక్కడ నిల్చెఁ గావలయు నాసతి ద్రౌపది గాఁగ నోపు వే
ఱొక్కరుఁ డాజిఁ గీచకుల నోర్వఁగఁ జాలమి మీ రెఱుంగరే. 115

క. గంధర్వు లనునెపంబున, నంధతమసగూఢవృత్తి ననిలసుతుఁడు గ
ర్వాంధమతి యైనసూతు స, బాంధవముగఁ జంపెఁ గాక పరులకు వశమే. 116

వ. పితామహుం డుపదేశించినలక్షణంబు లద్దేశంబునం గలిగియుండు నని విందుము పాండవులు ప్రచ్ఛన్నవేషంబున విరటుప్రోలవసియించినవారు గావలయు నతండును బ్రతిభటుం డయి భంగించుచుండుం గావున నతనిపయి నెత్తిపోయి తదీయగోధనంబుల గ్రహించిన ధర్మతనయుండును దమ్ములు నడ్డపడం బఱతెంతు రయ్యవసరంబున మనము సమయభంగంబు సెప్పి వారలం గ్రమ్మఱం బండ్రెండువత్సరంబులు వనవాసంబు సలుపం బుత్తమ మైన నప్రతిహతంబుగాఁ జతురంతభూచక్రంబాక్రమించి కీర్తనీయులమై వర్తిల్లుదము కుంతీనందనులందు లేకతక్కిన మత్స్యపతిసమస్తవస్తువులును జూఱకొంద మదియును లాభంబ యెల్లభంగుల నిప్పటి కిదియె కార్యంబు మీకు నందఱకుం జూడఁబోలునేని దీని కనురూపంబగునుద్యోగంబు సేయుం డనినఁ ద్రిగర్తాధీశ్వరుం డగుసుశర్మ దొలుతఁ గర్ణదుశ్శాసనులతోఁ గొండొక ప్రసంగించి వారలయనుమతి నవనీపతితో నిట్లనియె.

క. కేకయ [4]సాల్వులు దోడుగ, నాకీచకుఁ డాజి నన్ను నపజితుఁ జేసెం

---

1. చ. నేటికిఁ. 2. లేఱట పో. 3. గ. యుద్ధతులును. 4. ఖ. సాల్వురు.

జా కుండ మున్న యొక పరి, నా కాతనితోడ భండ।నము లేదయ్యెన్. 118

ఉ. భంగముతోడ నున్న ననుఁ । బంపు విరాటునిమీఁద భూమికిం
జెంగట నుండు నా దయిన।జీతపుటాళ్లు సంతతంబు వా
నిం గడు గాసిసేయు నత।నిం జెఱుపం దఱి యయ్యె ముట్టి స
ప్తాంగముఁ జూఱదెచ్చెద న।హంకృతి యెల్ల నడంచి వచ్చెదన్. 119

ఆ. ఉద్దవిడిన పసుల । నూచముట్టుగఁ దెత్తు, నతఁడు వెనుక వచ్చి । యడ్డపడిన
చోటఁ బాండురాజ । సూనుల నరయుదు, నెల్లభంగి దీని । కేన తగుదు. 120

వ. అనవుడు. 121

క. బరవసముమైఁ ద్రిగర్తే,శ్వరుఁ డి ట్లను టుచిత మింక । జననాయకుఁ డె
ప్పరుసున నానతియిచ్చెను, దొర లే మని రట్ల చేయఁ । దుదిఁ గార్యమగున్.

చ. అనునినసూనుమాటవిని । యందఱుఁ గన్గొని పెద్ద లెల్ల [1]ని
న్ననుమతి సేయ సైన్యముల । నన్నిటిఁ బన్నఁగఁ బంపు రెండు మే
ల నడత మీఁ త్రిగర్తులబ।లంబుల ముందటఁ బంచి వానిపో
యినమఱునాఁడు పోద మని।యెం గురునాథుఁడు దుస్ససేనుతోన్. 123

చ. అనుటయు ఫాలభాగకలి।తాంజలి యై యతఁ డట్ల చేయువాఁ
డ ననిన మేదినీశుఁడు దృ।ఢం బగునిశ్చయ మెల్లవారుఁ గై
కొనుటకుఁ గార్యబోధమున।కుం దగఁ [2]జుట్టల నున్నవారలం
గనుఁగొని యాదరాధికస।గౌరవ[3]భావనతోడ ని ట్లనున్. 124

ఉ. మున్ను సుశర్మ దాను బల।ముం జని గోవులఁ బట్టువట్టినన్
వెన్నడి [4]వచ్చు మత్స్యపృథి।వీపతి సేనల నెల్ల గొంచు శౌ
ర్యోన్నతి సూపువాఁ డయి స।ముద్ధతిమై నిట వేఱ కౌరవుల్
గొన్నిటిఁ బట్టఁ గయ్యమున।కుం బఱతెంతురు పాండునందనుల్. 125

ఉ. కందువ సెప్పి యొక్కెడఁ ద్రి।గర్తులు [5]దాడికిఁ గూడువారు మీ
రందఱు వేఱ యొక్కయెడ । నాజికి సేనలఁ గూర్పుఁ డెల్లవాఁ
డుం దనవారిఁ దోకొని క।డున్ రభసంబునఁ గూడి వార్తకున్
ముందఱఁ బోయి గోధనము । ముట్టుకొనన్ వలయున్ మహోగ్రతన్. 126

వ. అని చెప్పి వెండియు సుశర్మం జూపి. 127

క. బహుళాష్టమి నీతఁడు స,న్నహనముతోఁ బసులఁ బట్టు । నవమిని మనగో
గ్రహణ మని నిశ్చయించిన, నహికేతనుపలుకులకు మ।హాహ్లాదమునన్. 128

వ. సమస్తపరిజనంబులును సముద్యుక్తులై రట్టిసమయంబున. 129

ఆ. పాండురాజసుతులుఁ।బాంచాలియునుదమ్ము, నొరులెఱుంగకుండఁ।దిరుగవలయు

1. క. మఱి. 2. చ. జుట్లను నున్న: 3. గ. భాషలతోడ. 4. ఘ. వచ్చి...సూపువాఁడటు సముద్ధతి. 5. జ. దాడిగఁ.

దుష్కరంపుఁ బేఁడు । దుది సేరఁ బాఱె నెవ్వరును దీనిఁ దలఁప। వలను లేర. 130

—♦ సుశర్మ దక్షిణగోగ్రహణంబు సేయుట.

వ. సుశర్మయు నేలినవానిపనిఁ బూనిజోడుపక్కెర కైదువు బిరుదు రవణంబు మొద లైనసవరణంబులం జూడ నక్కజంబుగాఁ గూడి పరదేశం బాపోశనంబు గొనం దమకించు తనబలంబుగజిబిజి యుడిపికొని గోగణంబులయగపా టూహించి జతనంబుతో నడచుచుండియు వెసగుందక వేగిరంపుఁబయనంబు లయ్యును బ్రజల నోలాకుపడనీక యెత్తెడిచోట్లను విడుదలలయందును లోనుగా నిస్సాణాదులైన యుద్భటచిహ్నంబులు ప్రకటింపక దాడిమెయిం జని వేగులవారివలన విరాటు తోట్టు లున్నయెడ యెఱింగి కదుపులం [1]గార్చిచ్చుచందంబునం బొదివి వెలిచిన.

శా. కూడం బాఱె సముద్ధతిం గఁడగి త।ద్గోపాలకుల్ మూఁక ల
ల్లాడం దాఁకి నిశాతసాయకపటు।వ్యాపారఘోరంబుగా
నీడం బోక పెనంగినం గని త్రిగ।ర్తేశుండు చే వీచుడుం
గ్రీడాఘాతనిరూఢి నాశ్వికులు వా।రిం దున్మి తూఁటాడినన్. 132

వ. [2]వారలలోన.

చ. అసదుగఁ దాఁకి మేనఁ దఱి । చై పొరి నెత్తురు గ్రమ్మపోటులన్
వస మఱి తూలుచుండియును । వారనిభీతిఁ బదంబులం గడున్
వెస[3]కలిమిం బురంబునకు । వేగమె కొందఱు వాఱి మత్స్యనా
థుసభకు నేఁగి దీనదశ।తోఁ బ్రణమిల్లుచు నార్తమూర్తులై. 134

క. కారణ మెయ్యది యగునొకొ, వీరలదురవస్థ కనుచు । వెఱఁ గందెడునా
భూరమణుఁడు సభయును విన, నీ రెలుఁగు దలంకఁ బల్కి । రిట్లని గోవుల్. 135

చ. హయరథదంతిసంతతి ని।రంతరదుర్గమలీలఁ బేర్చి నే
ల యవిసి మూఁగిన ట్లగుబ।లంబులతోడఁ ద్రిగర్తు లెంతయున్
రయమున గోవులం బొదివి । రక్షకు లొక్కట నార్చి తాఁకినన్
భయదమహాస్త్రశస్త్రపటు।పాతపరంపరఁ దున్మి యుద్ధతిన్. 136

క. గోవులకు వెనుక యై వెసఁ, బోవుచు నున్నారు గడవఁ । బోవక యుండం
బోవలయు నడ్డపడియెదు, దీవస [4]మెదఁ గలిగెనేని । దేవర కడఁకన్. 137

వ. అనిన విని విరాటుం డదరిపడి. 138

శా. ఏమీ నిక్కమె మున్నెఱుంగఁడె త్రిగ।ర్తేశుండు మద్గోధన
స్తోమంబుం గొనిపోవు తెంపునకు ను।ద్యోగించెనే మేలు మే
లామైతోడనె పోవుఁగాక యని వీ।రాలాపముల్ వల్కి యు
ద్దామక్రోధశిఖాకలాపవికటో।ద్యద్భ్రూకుటిస్ఫూర్తియై. 139

1. గ. గాంతారంబుఁ గార్చిచ్చు పొదువుచందంబున. 2. క. వార లాలోన. 3. చ. ఞ. కడిమిం. 4. ఘ. మేడ్తెఱయుఁ గలుగుదేవర.

—♦ విరటుఁడు సుశర్మమీఁద యుద్ధము సేయఁబోవుట ♦—

చ. సచివులఁ జూచి యిప్పుడు వెసఁ మన మెద్దుక తక్కినం బశు
ప్రచయము దప్పిపోవుఁ దుది భంగము సేగియు వచ్చుఁ గాన మీ
రుచితవిధాన[1]సత్వరత నుద్ధతయోధసమగ్రవాహినీ
ప్రచలితభూమిభాగము[2]గఁ బన్నఁగఁ బంపుఁడు దండనాథులన్. 140

వ. అని నియోగించి. 141

శా. యానప్రక్రమసూచకంబు లగుతూర్యంబుల్ దిశాపాటన
ధ్వానస్వైరవిహారకల్పితసముద్రక్షోభముల్ గా ధరి
త్రీనాథుండు రణోచితోద్యమము సంధిల్లంగ శస్త్రాస్త్రవ
ర్మానీతిక్రమదక్షులం బనిచె నయ్యైవారికిన్ గ్రక్కునన్. 142

ఉ. సారథిఁ జూచి నీవు రభసంబునఁ బూన్పుము ఘోటకంబులం
దేరఁ దదీయవర్మము లతిస్ఫుట[3]బంధము గాఁగఁ బెట్టు నీ
వీరవచోవిలాసములు విందుము మున్నిదె వచ్చెఁ గయ్య మే
పారఁగఁ జూపు నీ దగునహంకృతికిం దగు ధైర్య మియ్యెడన్. 143

వ. అని పనిచి తాను యోధవీరోచితప్రకారంబున సింగారంబు సత్వరంబుగాఁ జేసి
కొని [4]ఖచితకాంచనబిందుసందోహం బగుసన్నాహంబు వెట్టికొని విరచితాలం
కారచక్రంబును బద్ధపరికరకూబరాక్షయుగాద్యవయవంబును [5]బ్రతికల్పితతురం
గంబును సన్నివేశితవివిధాయుధంబును సన్నద్ధసారథికంబును నైనరథం బెక్కి
గోగణహరణప్రదేశంబు పశుపాలకులం దెలియ నడుగుచు వెడలునప్పు డమ్మ
త్స్యపతియనుజన్ముండు. 144

శా. లోకస్తుత్యవిభూతి నన్యపృతనాలుంటాకబాహాబల
శ్రీకల్మిన్ రథదంతి ఘోటకభటశ్రేణీసముద్దాంతసే
నా[6]కల్పధ్వజవిభ్రమంబున [7]సుహృద్యప్రోద్యముం డై శతా
నీకుం డుద్ధతి నేఁగుదెంచె నఖిలానీకంబు నుప్పొంగఁగన్. 145

ఉ. ఆతనితమ్ముఁ డైనమదిరాశ్వుఁడు కర్ణఝళంఝళాసము
ద్ధూతబలోత్థరేణుపరిధూసరితాంబర మైనవారణ
వ్రాతము గొల్చి రాఁ గడఁగి వచ్చె సముజ్జ్వలహేమవర్మని
ర్యాతరుచిచ్ఛటాపటలరంజితహేతిమహోగ్రసైన్యుఁ డై. 146

తే. అతనియనుజుండుసూర్యదత్తాహ్వయుండు, సమదసైనికనానాస్త్రశస్త్రబహుళ
దీప్తిజాలకప్రతిహతదినకరాంశు,రాజి యై చనుదెంచె సంరంభ మెసఁగ.

---

1. చ. జ. తత్పరత. 2. గ. న. 3. జ. బద్ధముగాఁగ. 4. క. గ. ఖచిత...సందోహసుందరం బగుజైమయుంపు వెట్టికొని. 5. గ. బ్రకల్పిత. 6. క. ఖ. కల్పోజ్జ్వలవిక్రమంబున. 7. గ. చ. మహోద్యత్ప్రోద్యముం డై.

ఉ. తెల్లనిజోడు వెట్టుకొని తీవ్రగతిం జనుదెంచె మత్స్యభూ
వల్లభునగ్రనందనుఁడు వైరిమదాపహవిక్రమప్రకా
[1]రోల్లసితుండు వన్యబల ముద్ధతిఁ [2]గొల్చుమృగేంద్రురేఖ శో
భిల్లుచు నుండ శంఖుఁడు విశేషణశంఖనినాద మొప్పఁగన్. 148

వ. మఱియు ననేకయోధవీరులు వివిధవాహనారూఢు లై గాఢసన్నాహంబు లగు నిజవ్యూహంబులతో నేతెంచు చుండిరి విరాటుండు బలంబులం గూర్చుకొను తలంపునం బురబహిరంగణంబునం గొండొకసేపు నిలిచె నట్టిసమయంబున ధర్మతనయుం డనిలతనయమాద్రీతనయుల నంతంతం బొడసూపి నిలువుం డని నిపుణంబుగా నియోగించి తాను మత్స్యమహీవల్లభు నల్లన జేరి యిట్లనియె. 149

చ. ఒకఋషిచేత నాయుధసమిత్కర మెల్లను [3]సప్రయోగమం
త్రకముగ నభ్యసించి సమరంబునకుం గొఱయైనవాఁడ గో
ప్రకరములుల్ మరల్చుటకు బంధులు నీవును బోవ నాకు నిం
టికడన యున్కి పాడియె ఘటింపఁగఁ బంపు రథంబు చయ్యనన్. 150

క. అనిన విని యియ్యకొనున, మ్మనుజాధీశ్వరునితోడ మఱియు నతం డి
ట్లనుఁ బవనతనయుఁ గవలం, గొని సమరంబునకుఁ బోవఁ గోరెడుమదితోన్.

సీ. మనవలలుండు లావున బంటుతనమున, జను లెఱుంగఁగ సడిసన్నవాఁడు
మంచిమగండు దామగ్రంథి యసమసంగ్రామకేళీగాఢకౌతుకుండు
వినుము తంత్రీపాలుఁడును దుర్దమారాతి, మర్దనచాతుర్యమహితభుజుఁడు
మున్నును వీరలు మువ్వురకడఁ కల, కొలఁదు లే నెఱుఁగుదుఁ గొంతకొంత
తే. యెక్కుఁడగునట్టియరదంబు లిచ్చి వీరి, ననికిఁ దోకొనిపోక కార్యంబు నాకుఁ
జూడ ననవుడు మేదినీశుండు హర్ష,నిర్భరాత్మకుఁడై శతానీకుఁ జూచి. 152

వ. కంకవలలదామగ్రంథితంత్రీపాలురం జూచి యిట్లనియె. 153

మ. రథముల్ మంచివి గాఁగ నాలు [4]గతిశీఘ్రవ్యాప్తిసత్త్వంబులం
బ్రథితం బైనతురంగమోత్కరము సంగ్రామార్హచాపంబు ల
శ్లథవర్మంబులు వీరి కిమ్ము రణలీలాదక్షతన్ మన్మనో
రథముం దీర్పఁగ వీర లోపుదురు దోర్గర్వం బఖర్వంబుగన్. 154

వ. అనిన నతం డట్ల చేయుదు నని వారలందోడ్కొనిచని సమస్తంబును సన్నద్ధంబు గావించి యంగరాగమాల్యాభరణంబుల నలంకృతులం జేసినం గైకొని తమతమయంతవట్టునుం గూడుకొని సూతకృత్యంబులకుం దార చాలి రథంబులు దోలికొని చనుదెంచిరి తదనంతరంబ. 155

సీ. గంధదంతావళకర్ణమారుతహతిఁ, గాంతారములు చాఁపకట్టు వడఁగ
రథఘోషమునఁ బ్రతిరవ మిచ్చునద్రులు, భయమున వాపోవుభంగి నుండఁ

1. ఘ. శోల్లసితుండు. 2. క. గొల్చు మృగేంద్రరేఖ. 3. క. సంప్రయోగ. 4. చ. వతి.

దురగఖురోద్ధూతధూళి [1]దన్నెరసిన, వననిధి పిండలివండు గాఁగ
బహుళపదాతిదుర్భరభార మడరిన, నురగకూర్మంబు లొండొంటిఁ బొంద
తే. సైన్యముల నడపించె నుత్సాహలీల, యతిశయిల్లంగ సంరంభ మగ్గలింప
బరవసము మిక్కుటంబుగఁ బసులుసన్న, జాడ గైకొని యమ్మత్స్యజనవిభుండు.
వ. ఇట్లు చని కూడముట్టిన. 157
క. విరటుబలంబు త్రిగర్తేశ్వరుబలముం జెలఁగ నార్చి వడిఁ దాఁకె భయం
కరనాదమేదురము లగు,శరనిధు లొండొంటిఁ దాఁకుచందం బమరన్. 158
మ. గుణరావంబుఁ గృపాణఘట్టనరవక్షోభంబునుం గింకిణీ
క్వణన[2]వ్యావృతహేషితస్వనములున్ ఘంటానినాదాత్తపో
షణనానాపటుబృంహితధ్వనియు శశ్వద్గాఢమై పేర్చినన్
రణనం బించుక దోఁప లేద బహుతూర్యశ్రేణి నాసేనలన్. 159

—♦ విరాటసుశర్మలసైన్యంబులుసంకులంబుగాఁ బోరుట. ♦—

వ. అట్టిసమయంబున. 160
సీ. ఒండొంటితోఁ దాఁకి మండెడునవియును, జిందముల్ పొడిపొడిసేయునవియు
గట్టిమైమఱువులు దట్టముల్ గావించు,నవియును నెఱను నోనాడునవియు
[3]నెట్టఁపైఁ బడి మేని[4]నెగయించునవియును, దల నేల డొల్లంగఁదాఁకునవియు
నిరుమెయిఁ[5]దొలిచి బెట్టిలఁ [6]దూఱునవియును,నలువుర నేవుర నాటునవియు
తే. నైనశరములు [7]గనుఁగొని యాడి యాడి, నారదుఁడు పిచ్చలింపంగవీరకేళి
సలిపెనుద్ధతిమై ధనుర్బలములడరి, లావు వెరవును నెఱయఁ జలంబు మెఱయ.
వ. అప్పుడు సుభటులు గడంగి. 162
ఉ. ఏటుల మ్రొగ్గువారిఁ గని యించుక కొంకక [8]యర్మ్మ పెంపునం
బోటులవాతఁ బోవుభటపుంగవులన్ మది మెచ్చుచున్ వడిన్
వ్రేటులఁ గ్రీడ సల్పి పృథివిం బడువీరులఁ ద్రొక్కికొంచు నె
చ్చోటుల నైన నగ్గలికఁ జొత్తురు నెత్తురు వఱ్ఱు సేయుచున్. 163
సీ. ఒక్కఁడు పెక్కండ్రకెక్కినవిచ్చియుఁ, బొదివి [9]చెఱొకపోటువొడుచునెడలుఁ
బలువు రొక్కనిమీఁదఁ [10]బఱపిన సైరించి, నళికి పైఁబెట్టక నిలుచునెడలు
దళము దళంబుతోఁ దాఁకి యగ్గలికమై, నీఁడఁబోవక వ్రేటు లాడునెడలు
నోహరిసాహరి నుయ్యాలచేరుగా, వెనుకొంచుఁ దెరలుచుఁ బెనఁగునెడలు
ఆ. నైయనేకభంగి నాశ్వికసేనలు, బొమ్మ లాడినట్లు పోరుచుండె.
నమరగణము సిద్ధసమితియు వేడుకఁ, జదల నిలిచి చూచి సంస్తుతింప. 164

1. ఘ. దన్నొరసిన. 2. క. వ్యాపిత. 3. గ. నేటుపై. 4. చ. నెరియించునవియును. 5. గ. గెలిచి. 6. ఖ. దూలు. 7. క. గైకొని. 8. ఘ. యమ్ము. 9. క. జ. వేఱొక. 10. క. బఱపి సైరించిన.

వ. ఒక్కయెడ. 165

ఉ. ఒండొరు మీఱుకోఁకిమెయి నొక్కట [1]బాసలవారు సొచ్చినన్
రెండయి పాయ యిచ్చిన యరిప్రకరంబులు వేఱువేఱ యు
ద్దండభుజాబలం బలరఁ దాఁకిన [2]సంగడిఁ బాఱు చుండఁగా
గండమరంగ నిల్చి చెలికాండ్రయి క్రమ్మఱ వత్తు రిద్దఱున్. 166

సీ. కరశీకరంబులు కరటగళద్దాన, తోయంబులును ధరాధూళి మిగులఁ
[3]బొడవులసడి సన్నయెడలుల [4]దెంచ న, మ్ముల పెంపు గగనంబు గొలఁదిపెట్ట
బృంహితధ్వనులును బృథులఘంటావలీ, రవములు దిక్కుల నవులఁ ద్రోవ
రోషారుణాక్షులరుచులును సిందూర, కాంతియు రవిదీప్తిఁ గ్రమ్మఱింప

తే. జోదులాక్కటవాలంపసోనగురియ, రౌద్రరసమాకృతులఁదాల్చి రణమొనర్చు
కరణి నత్యుగ్రముగఁ గరిఘటలుగడఁగి, కలను పీనుంగుపెంటగాఁగలయబెరసె.

ఉ. అక్కజ మైనశౌర్యమును నద్భుతసంపద నొందుశక్తులుం
జిక్కనిమేనులున్ మొనకుఁ జెల్వగు కైదువులుం దగంగ ను
క్కెక్కినయట్టిమేటిమగ లించుకవారణ లేక ఖేచరు
ల్వక్కసమంద నొచ్చియుఁ జలింపక పోరిరి పెక్కుభంగులన్. 168

సీ. నొగ నొగతోఁ దాకిఁ పగులంగ [5]నరదంబుఁ, బఱపి యా తేరిపై కుఱుకువారు
రథ్యముల్ వడ్డ విరథు లయ్యు నసిముద్గ, రాదుల నడరి పోరాడువారు
సారథి నొచ్చినఁ దేరును గడపుచు, నేయుచుఁ గయ్యంబు సేయువారు
నరదంబుపై వ్రాలి యాలోనఁ దెలిసి త, న్నేసినాతనిఁ బడ నేయువారు

తే. నగుచు రథికనికాయంబు లడరి యప్ర, మత్తనిజచిత్తవృత్తులై సమగతనంబు
ఘోరమూర్తులు గైకొని పోరునట్లు, సలిపె సంగ్రామకేళి సంకులము గాఁగ.

వ. ఇట్లిరువాఁగును నరవాయి గొనక పెనంగు చుండ. 170

ఉ. భీకరబాణవర్షములపెల్లున వైరులు [6]పెల్లగిల్ల మా
ర్వీకృతగర్జితంబు పృథివీవియదంతర మెల్ల నిండ ను
గ్రాకృతిఁ గల్పసంక్షయమహాభ్రముచందము నొందుచున్ శతా
నీకుఁడు దాఁకెఁ గంకటమణిద్యుతివిద్యుదుపాంతకాంతియై. 171

తే. అతఁడు నానాప్రకారశస్త్రాస్త్రనిహతి, నతులవిక్రమవిభవ మహానర్గళముగ
యోధసారథియుగ్యసంయుతము గాఁగ, నూఱురథములు వ్రేల్మిడి నుగ్గుసేసె.

మ. మదిరాశ్వుండు గడంగి యన్నకు బలోన్మాదంబు రెట్టింప స
ప్రదరజ్వాలతికాక్రియాసమభిహారక్రీడనం బప్పు డొ
ప్పిద మై యోగవియోగసంధులు నిరూపింపంగ రా కుండఁ గ

1. క. బాసటవారు. 2. చ. సందడి. 3. క. బొడువుల. 4. గ. దెంచి యమ్ముల. జ. డెక్కి యిమ్ముల. 5. క. బెడిదంబు. 6. క. దల్లడిల్ల.

ర్ణదళోపాంతము వింత సేయ నడరెన్ రౌద్రంబు శోభిల్లఁగన్. 173

క. అడరి పడి రథచతుశ్శతి, పొడిసేసి పరాక్రమం బపూర్వంబై యే
ర్పడఁ గరిహయనరనికరము, బడలుపడం దఱిమె నలి నభశ్చరు లార్వన్. 174

ఉ. మండలచారి ద్వైరథ మమానుషవిక్రమలీల నొప్ప ను
ద్దండభుజాబలంబు ప్రథితంబుగ నత్తఱిఁ దాఁకి సూర్యద
త్తుం డనివార్యశౌర్యగుణధుర్యుఁడు వీఁడ యనంగఁ బేర్చి వే
దండఘటావిపాటనవిదగ్ధతఁ బొల్చె రణాంగణంబునన్. 175

ఉ. అప్పుడు శంఖుఁ డెంతయుఁ బ్రియంబునఁ బెండ్లికిఁ బోవునట్లు మో
మొప్పఁగ నస్త్రశస్త్రములయుల్లసనంబున శత్రునేత్రముల్
గప్పఁగఁ జీఁకటుల్ రణముఖంబు సమస్తముఁ దాన యై రథం
బుప్పరవీథిఁ దోలికొని యుగ్రగతిం బఱతెంచి తాఁకినన్. 176

తే. మందరాచల చటులవిమర్దనమున, ఘూర్ణమాన మై గాఢసంక్షోభ మెసఁగఁ
దలఁకుజలనిధి నాఁ ద్రిగర్తక్షితీశు, బలము దిరుగుడువడియె సంకులముగాఁగ.

వ. అయ్యవసరంబునం దక్కినదొరలును దలపడి యతిభీమంబుగా సంగ్రామంబు
సేయం దొడంగిన. 178

చ. అనుజతనూజమంత్రిసుభటాప్తజనంబుల పోరు సూచి నె
మ్మనమున బొంగి మై పెనిచి మత్స్యమహీరమణుండు సారథిం
గనుఁగొని [1]యల్ల గట్టెమొనఁ గ్రాలుచు నున్నత్రిగర్తనాథుకే
తనమునచక్కటిన్ మనరథంబు వెసం జననిమ్ము నావుడున్. 179

క. అగ్గలిక నతఁడు హయముల,పగ్గంబులు సడల విడిచి పటురయమున నా
మొగ్గరము దఱియఁ బఱపిన, మ్రగ్గెను రథపంచశతము మత్స్యాధిపుచేన్.

మ. అవనీనాయకుఁ జూచి యేచి నలి వీరావేశదుర్దాంత మై
కవిసెన్ గుంతభుశుండితోమరగదాఖడ్గాదిశస్త్రాస్త్రతీ
వ్రవిహారంబు విరోధిదుర్విషహసంరంభంబుగా నొక్కపె
ట్టవడిం దద్బల మెల్ల నారదుఁడు వేడ్కం గుంచె సారింపఁగన్. 181

వ. ఇవ్విధంబున విరాటుండు దానును సేనయుం జేయం గలవారును బరవసంబు
సేసి యొక్కుమ్మడి నడరుటయుం దెరలి మరలిననిజసైన్యంబు దైన్యంబు గలయం
గనుంగొని కోపాటోపంబునం గెంపు గదురులోచనంబులుం [2]బెంపొలయుభుజ
శిఖరంబులుం గలిగి సుశర్మ దానుం దమ్ముండు సంగడంబుగాఁ గోత్తల సేసిరథ
సమూహంబుతో విరాటవ్యూహంబు నెదురుకొని. 182

క. బలవిక్రమములు మెఱయఁగఁ, దలపడి రథదంతిహయపదాతిచయంబుల్
[3]గలను సుడివడఁగ దామర, కొల నేనుఁగు సొచ్చినట్లు గురువుగఁ జొచ్చెన్.

---

1. క. యల్ల కంటె మొన. 2. ఖ. బలుఁ బొలయు. 3. చ. గలఁగి.

ఉ. ఏలినవానిఁ గాంచి మొన యెల్లను నెంతయు దర్ప మెక్కి యా
భీలనిశాతహేతిరుచిభీకరలీల నెదిర్చి మత్స్యభూ
పాలకసైన్యరాజిఁ దలపడ్డ మహోగ్రతఁ బేర్చి యా సమి
త్కేళి వియచ్చరప్రతతికిన్ వెఱఁ గందఁగఁ జేసె నెంతయున్. 184

తే. కడిమి [1]మెఱయంగఁ బోరు త్రిగర్తనాథు, రథముఁ గనుఁగొని కడఁగి విరాటవిభుఁడు
[2]వరవృనకు నల్గినట్టుల సరకుగొనక, యతులరభసాతిరేకత నతనిఁ దాఁకె. 185

— విరాటుఁడు సుశర్మమీఁదఁ దనరథంబు తోలించి పోరుట —

వ. ఇట్లు దలపడి. 186

మ. పటువేగం బగుశాతభల్లచయసంపాతంబునన్ మింట మి
క్కుటమై మంట ధగద్ధగద్ధగ యనం గోపంబు రూపంబులై
చటులక్రీడఁ జరించు నట్లిరువురున్ శౌర్యోన్నతిం బోరి ర
క్కటదర్పోద్ధతులై పరస్పరజయాకాంక్షం బ్రచండంబుగన్. 187

క. తదవసరంబున నొక్కటఁ, బదియమ్ములు దొడి త్రిగర్తపతివక్షంబున్
వదనంబు నేసి విరటుఁడు, మదమునఁ దురగముల నేసె మఱియుఁ బదింటన్.

క. ఇంచుకయు వీడఁ బోవక, కాంచనపుంఖప్రకాండకాంతిస్ఫాయ
త్పంచాశద్బాణంబులు, నించె నతఁడు మత్స్యమేదినీపతిమేనన్. 189

తే. దొరలు తలపడ్డ నాహవదోహలమున, నుభయబలములుఁ దమకించి యోర్వలేక
కలయఁబెరసి భూరేణుపుకతన రాత్రి, గాకమున్న యొండొరులనుఁ గానరైరి.

క. క్షతములఁ బెల్లు దొరఁగుశో, ణితము రజఃపటల మడఁచి నెఱసిన నరుణ
ద్యుతిఁ దమము వాపువేకువ, గతిఁ దత్సమయం బతిప్రకాశత నొప్పెన్. 191

ఉ. దానికిఁ జిత్తవృత్తులు ముదంబునఁ బొందఁగ మేను లుబ్బఁగా
సేనలు రెండు నుద్భటవిజృంభణతన్ వివిధాస్త్రఘట్టన
ధ్వానము దిక్కులం బరఁగఁ దాఁకి రణం బొనరించె నత్తఱిన్
భానుఁడు పశ్చిమాద్రిఁ గనుపట్టెఁ దలిర్చినమావిమ్రాకనన్. 192

క. సమరంబున భటులు గడు, న్శ్రమ మొందిరి తమము గవిసినం గాని సము
ద్యమసంరంభ ముడుగ రిది, సమయం బని తొలఁగినట్లు సవితృఁడు గ్రుంకెన్.

వ. తదనంతరంబ. 194

క. మఱిమఱిచీకటియప్పుడు, నఱిమఱి భటు లుడుగ కడరి యని సేయంగా
నెఱసి తమ మెల్లమెడఁ గ్రిక్కిఱిసిన మఱి పాసి నిలిచి రింతను నంతన్.

వ. ఇట్లుభయసైనికులు సాంద్రసంతమసంబునం జేయునదిలేక సంగ్రామంబు దక్కి
తమకం బెక్క నొక్కింతసే పూరకున్నంత. 196

క. తనమనుమలు పాండుతనయు, లని సేఁతకు వేడ్క సేయుటాత్మఁ గని తమం

1. గ. మెఱయంగ. 2. క. పరవృషభు నల్గి జ. తరవృనకు నగ్గి.

బున వారు మెఱయ రని వచ్చినక్రియ శశి పూర్వశైలశిఖరం బెక్కెన్.

క. వెలుఁగు గని కడఁగి యిరువాఁగులుఁ బోరికి జొచ్చె మత్స్యకుంజరుఁడును న
గ్గల మగుమగఁటిమిసొంపునఁ, దలపడియె సుశర్మతోడఁ దదనుజుతోడన్.

చ. తలపడి పోర వారియరదంబు లనేకము లొక్కపెట్ట యి
ట్టలపురయంబునం బొదివి డాసెఁ గడంగి వడిం ద్రిగర్తనా
థులు నిరుదేరుఁ దద్రథముతోఁ గదియించి తదీయసారథిన్
బరువిడిఁ గూల్చి రథ్యములప్రాణములుం గొని రుగ్రమూర్తులై. 199

వ. ఇవ్విధంబున విరాటుండు విరథుం డగుటయు. 200

చ. అతిరభసంబుమై నడరి యాతనిఁ బట్టి సుశర్మ వెల్చ నా
ర్చి తనరథంబుపై నిడి యశేషబలంబులు [1]నల్దెసల్ భయ
ద్రుతగతిఁ బాఱినన్ విజయదుందుభు లొక్కట మ్రోయ విక్రమో
ద్ధతివిభవంబునన్ మది ముదం బొలయన్ మరలెన్ మహోద్ధతిన్. 201

వ. అట్టియెడ ధర్మతనయుఁ డనిలనందను నవలోకించి సత్వరం బగుచిత్తంబుతో
మత్స్యవిభునివలను సూపుచు ని ట్లనియె. 202

తే. ఇతనియాశ్రయమున మన మెల్ల బ్రదికి, యున్నవారముగావున నుగ్రరిపుల
పాలువడకుండవిడిపింపఁ బాడియితని, నెయిదుమెయిదుమురథరయమెసక మెసఁగ.

చ. అనవుడు మేను వెంచుచు మహాబలనందనుఁ డప్పు డన్న కి
ట్లను నిదె సాలవృక్షము రయంబున దీని నరాతిసేన డొ
ల్ల నడచి యీసుశర్మనిబలంబుఁ జలంబును మాన్పి యవ్విరా
టుని విడిపించెదన్ రణపటుత్వము వైరులు పిచ్చలింపఁగన్. 204

తే. నీవుఁ దమ్ములు నొక్కెడ నిలిచి చూచు
చుండుఁ డని పల్కుటయుఁ బుయిలోటతోడఁ
గీచకారాతిఁ దప్పక చూచి నగుచు
నతని కి ట్లని చెప్పె ధర్మాత్మజుండు. 205

క. తరువు వెసఁ బెఱికికొని నీ, వురవడిమైఁ గవిసితేని నుభయబలము న
చ్చెరు వందుచుఁ జూచి వృకో,దరుఁడ వగుట యెఱుఁగకున్నె తద్విధ మేలా.

వ. కవలు నీకుఁ జక్రరక్షకులుగా లోకసామాన్యంబు లైనచాపకృపాణగదాదు లగు
నాయుధంబుల విరోధివధం బాపాదించి వేవేగ విరాటు విడిపింపుము. 207

చ. అనుపలు కంకుశంబునక్రియం గుదియించిన నిల్చి భూరుహం
బున దెస వోక మత్తగజపుంగవుచందమునన్ సమీరనం
దనుఁడు శరీర[2]దోళనవిధాపరిశోభితవిక్రమోద్యమం
బున విలసిల్లి యిట్టు లను భ్రూకుటి ఫాల మలంకరింపఁగన్. 208

1. చ. జ. బల్దెసల్. 2. క. గ. డోలన.

క. మీపనిచినట్ల చేసెద, నేపారినవైరిబలము నెల్లను బాహా
టోపమున నోర్చి మత్స్యమ, హీపతి విడిపించి తెచ్చి యిచ్చెద మీకున్. 209

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు సంతసిల్లి తమయంతవట్టునుం గూడుకొని. 210

—♦ పాండవులు సుశర్మ నోడించి విరాటుని విడిపించుట. ♦—

తే. తాను మున్నుగ శాత్రవసేనమీఁద
రథము లొక్కటఁ బఱపిరి పృథివి యద్రువ
నుఱక యేచి త్రిగర్తులు నుద్ధతముగఁ
జెలఁగి మార్కొని పొదివి సంకులము గాఁగ. 211

క. ఏయుచుఁబొడుచుచువ్రేయుచు,డాయుచునుద్వృత్తిఁదఱుముచుఁటయుఁ [1]బొడిసేసెన్
వాయుసుతుఁడు రథముల నిరు,వేయిటి రథిరథ్యసూతవితతంబులు గాన్. 212

తే. ఏఁడునూఱురథంబుల నేపుమాపె, నకులుఁ డప్పుడు మున్నూటినామ మడఁచె
నతనియనుజుఁడు కుంతీసుతాగ్రజుండు, రథికముఖ్యుల వేవురఁబృథివిఁ గూల్చె.

వ. అతండు మఱియును. 214

చ. తఱిమి సుశర్మఁ గిట్టి యతిదారుణభంగి రణంబు సేయ వాఁ
డుఱక నిశాతసాయకము లొక్క మొగిం బది మేనియందుఁ గ్రి
క్కిఱియఁగఁ జేసి నాలుగిట నేసెఁ దురంగములన్ యుధిష్ఠిరుం
డఱిముఱిఁ జంపె సారథిఁ దదశ్వములన్ వరబాణపాణియై. 215

వ. అయ్యవసరంబున మత్స్యమహీనాథుండు జనితోత్సాహుం డై. 216

ఆ. ఆసుశర్మ తేరియం దున్నఘనగదా, దండ మెత్తికొని యుదగ్రవృత్తి
జరఠదేహుఁడయ్యుఁ దరుణవయస్కు న, ట్లవని [2]కురికి పోయి యతని వ్రేసె.

క. అట్టిసమయమునఁ గరువలి,పట్టి త్రిగర్తేశురథముపై కుఱికి వెసం
బట్టికొని యతనిఁ బెడగే,ల్గట్టి పెలుచ నార్చెఁ దద్బలము పెల్లగిలన్. 218

వ. ఇట్లు సుశర్మం బరాజితుం జేసినఁ జక్రరక్షకుం డైనశోణాశ్వుండు మొదలుగా నాప్తభృత్యవర్గంబు ననుజుండైనసువర్మలోనైనబంధుజనంబులునాదిగాఁ గలపరివారంబు పలాయనపరాయణం బగుటయు వెనుకొని మొయిది గోధనవర్గంబు మరల్చి కరితురగరథంబులం దలమీఱి పొదివి తెచ్చి యన్నపాలికి వచ్చి తాను మున్నుత్రిగర్తేశురథంబుకడ నిలువ నియోగించి యున్నతమ్ములం గూర్చుకొని తమయంతవట్టును నొక్కట విరాటునకుం బొడసూపిన. 219

క. ఆదరము సంభ్రమంబును, మోదంబును దనమనమున ముప్పిరిగొన నా
భూదయితుఁడు వివిధప్రియ,వాదంబుల గారవించె వారల నెల్లన్. 220

వ. ఇట్లు సంభావించి పాండవాగ్రజు నవలోకించి. 221

క. మానముఁ బ్రాణముఁ గాచితి, దీనికి సరి గాఁగ నీమదికిఁ బ్రియ మొసఁగం

1. క. గ. పడిఁ జేసెన్...నిరువేయింటిని రథ్యసూతపీతంబులుగాన్. 2. జ. కెఱఁగి.

గా నాకుఁ జేయ నయ్యెడు, దాని నెఱుఁగఁ గాన మత్ప్రదము గైకొనవే. 222

తే. ఒడలు సిరియును నాకు నీయొసఁగినవియ, కాన దగ సమర్పించెదఁ గరుణనీవు
సమ్మతించి యిమ్మత్స్యదేశంబు గావు, పంచి పనిగొని నన్ను రక్షించికొనుము.

వ. అనిన విని యజాతశత్రుం డతని కి ట్లనియె. 224

చ. మనుజవరేణ్య నావలనిమన్నన యట్టిద కాదె శత్రుమ
ర్దన మొనరించి మత్స్యనగరంబున కుత్సవ ముల్లసిల్ల నీ
చనుటయ నాకుఁ దేజమును సంపదయుం గరిమంబుఁ గాక యి
ట్లనఁ దగునయ్య యే నిచట నైనది యేటిది యింత యేటికిన్. 225

క. అనుపలుకులకును విస్మయ,మును సంతోషమును జిత్తమునఁ బెనఁగొన నా
జనపతి ధర్మతనూభవుఁ, గనుఁగొని యిట్లనియె మఱియు గౌరవ మెసఁగన్.

క. ఉపకారమొ బంటుతనమొ, కృపయో పెంపో సమగ్రకీర్తిప్రియమో
రిపుదుస్సహ మగునీరణ,నిపుణతకుం గారణంబు నెయ్యమొ యెఱుఁగన్. 227

ఉ. మంటయుఁ బోనిశాత్రవసమాజము నించుకయేని శంక లే
కంటఁగ దాఁకి [1]వెండి తెగటార్చె మహాద్భుతశక్తిశాలి యీ
[2]వంటలవానిచేసినయవార్యపరాక్రమ మొండుచోటులం
గంటిమె వింటిమే యితఁడ కాఁడె వెసన్ గెలిపించె నన్ననిన్. 228

క. కంధరములు దెగి తలలు వ,సుంధర నతిపక్వతాలసుభగఫలాళీ
బంధురత రాలు దామ,గ్రంథి పగఱమీఁద గినిసి కవిసినయెడలన్. 229

క. ఎక్కడఁ జూచినఁ దానై, యక్కజ మగుకడిమికలిమి నరిసేనఁ గరం
బుక్కడఁ దంత్రీపాలుం, డొక్కఁడ పొలియించె నీరణోత్సాహమునన్. 230

క. ఈనలువురు దక్కఁగ మన, సేనల నొక్కరుని నైనఁ జేడ్పడనిభటుం
గానం జెలి కెడ రైనం, బూని తలఁగునతఁడ చూవె పురుషుం డెందున్. 231

ఉ. కావున మీకు దంతిహయకాంచనరత్నవిభూషణంబులుం
దేవనితంబినీజనసదృక్షమృగాక్షులు నాది గాఁగ నా
నావిధవైభవంబులు మనంబులవాంఛలకుం దగంగ నీ
కేవిధి నీఁగువాఁడ ఋణ మెయ్యది యేనియు వేఁడుఁ డిచ్చెదన్. 232

క. అనవుడుఁ బాండుతనూభవు, లనఘా యిట్లెంతయుం బ్రియంబున సంభా
వన సేసితి మా కిదియే, ధనము వడయుదానికంటెఁ దక్కువె చెపుమా. 233

—♦ ధర్మరాజు సుశర్మను సపరివారంబుగా విడిపించుట ♦—

వ. మమ్మెరవుగాఁ దలంచి యియ్యెడ నిట్టట్టన వలవదు పురంబున కరిగి యయ్యెడ
నీ కెట్లు ప్రియం బట్లు మన్నింపు మని రంపుఁ గంకుండు మఱియు నిట్లనియె.

క. తగ నొక్కటి వేఁడెద నిను, జగతీశ్వర యిచ్చు టొప్పు సరథగజాశ్వం

1. వీఁడె. 2. వంటలవాఁడు సేసిన.

క. మనమొనల దుర్నిమిత్తము, లనేకములు పుట్టఁ దోడఁగె నట్లగుట జయం
బనుమానం బొకకార్యము, వినుఁడా మీకెల్లఁ జూడ వెర వగునేనిన్. 183

ఉ. ముందర రాజుఁ బుచ్చి బలసములఁ గలయంబడి గోవ్రజంబులన్
దందడి వెట్ట కుండఁ బిఱుఁదన్ నడపింపఁగఁ బంచి గట్టిమై
నందఱు నింతకున్ వెనుక నైయె మొన లేర్చి చనంగ నెప్పు సం
క్రందనసూతి డగ్గఱియెఁ గయ్యము సేయుట కప్పు డిమ్మగున్. 184

వ. అనిన విని సుయోధనుండు భీష్మ కృప కర్ణ వికర్ణులదెసం గనుంగొని మున్న చెప్పితిన కాదె జూదంబునం బరాజయం బొంది పాండునందనులు పండ్రెండు వత్సరంబులు వనంబున వసియింపను బదుమూఁడగునేఁడు జనపదంబున మన మెఱుంగ కుండఁ జరియింపనుం బూని కాదె భూమి వెలువడిరి యీపదుమూఁడవ యేఁటికొలంత గలుగం బార్థుండు దన్నెఱింగించికొనియెనేని నెప్పటియట్ల వనవాసంబునకుం జనవలయు నిది మనము మోహంబునం గానమి నొండెవారు లోభంబున వచ్చుట నొండె నగుం గావున నెక్కువదక్కువలునిరూపించిభీష్ములు దీని నిశ్చయింప నర్హులు రిత్తయుత్తరుండుకాక గాండీవియు [1]నగుటమనకార్యంబు సఫలంబు సుశర్మ నక్కడ గోవులం బట్టం బనిచి యిక్కడ మనమును పసులం బట్టుట మత్స్యనగరంబునం గౌంతేయు లున్నవా రని శంకించి వారలు గూయి వచ్చినం గనుటకుం గాదె యిట్లు నిశ్చయించి చేసినపనికి నిపుడు విచారం బేల యని పలికి వెండియు ని ట్లనియె. 185

ఉ. అర్జునుఁ డైన నేమి సురరక్షైనను నే మగు విద్విష[2]చ్ఛిరో
పార్జిత మైనగోధనముఁ బట్టితి మెవ్వరు వచ్చిరేని వి
స్ఫూర్జితబాహుసంపదలు సూపుద మొండొరు మీఱి నిర్మలా
భ్యూర్జితకీర్తి కారణరణోద్ధతి వెల్వలఁ బొఱ నేటికిన్. 186

చ. మనసుల నూలుకొల్పి యనుమానము లెల్లను బాచి యేచి వా
హనములు నాయుధంబులును నాయిత మయ్యెదుభంగిఁ జేయుచున్
మొనలకు హెచ్చుగా మనము మున్ను గడంగినఁగాక శత్రులం
గనుఁగొనియిట్లు లొండొరుమొగంబులు సూచుచు [4]నున్నఁ బోవునే. 187

—♦ దుర్యోధనుఁడు ద్రోణాచార్యుల నధిక్షేపించుట. ♦—

ఆ. హరులహేషితములు ననుకూలవాయుసంచారములునుమనకుజయముకలిమిఁ
దెలుపుచున్నయవి యుధిష్ఠిరానుజుఁ డొక్కఁ, డీబలంబు గెలువనెట్లు నేర్చు. 188

క. ఎవ్వరు వినినను దీనికి, నవ్వుదు రని యెఱుఁగఁ డకట నామెదురెదురన్
వివ్వచ్చుఁ జూపి సేనలు,గ్రొవ్వఱఁ బలుపలుకు లిట్లు ద్రోణుఁడు వలికెన్. 189

1. క. వచ్చుట. 2. జ. చ్ఛిదోపార్జిత మైనగోగణము. 3. జ. మబ్బుగా. 4. క. నుండఁ జోలునే.

తే. రోష మొందెను రాజ్యాభిలాష మొందెఁ,గాక యాతనిరాకకుఁ । గారణంబు
పెఱ యెఱుంగమి యెదిరిని । బెద్దఁ జేసి, పూని వందివిధంబునఁ । బొగడ నేల.
వ. ఆచార్యులైనవారలు కార్యంబు దప్పులం గనియెడువారుగాన కయ్యంబు తెఱంగు వారల నడుగ వలవదు బుద్ధిమంతులిండ్లకడనుండి భోజనావసరంబుల నాయుధశ్రమసమయంబుల నీతిశాస్త్రగోష్ఠికాలంబుల నుచితాలాపంబులు వలుకుదురుగాని పోట్లాడెడువారు గారు వారిం గలనం గలసి నిలువనీక పిఱిందిదెస నిలిపినను నాకు వారువిజయంబు గోరుచుండుట లెస్సయనినవినియశ్వత్థామయతనికిట్లనియె.
ఉ. కావలివారిఁ దోలి యొసకంబున గోవులఁ [1]బట్టికొంటి నం
చీవెడమాటలేల ధరణీశ్వరయింతకు మున్న వీటికిం
[2]బోవవు శత్రునే వుడిపి । పోయెడువాఁడవు గావు నీవు సై
న్యావలి యైనఁ జేడ్పడక । యాతల కేఁగుట లేదు నేనియున్. 192
క. సమరమున గెల్చి యొరురా, జ్యము గొనియును సుజనుఁ డిట్టు[3]లాడఁడు సిరిజూ
దమునఁ గొని రజ్జు లేటికి, సమయం బరుదెంచెఁ దొంటిచందము గలదే. 193
ఉ. పాండవవీరులం గలన । బాహుబలంబున నోర్చియే సము
ద్దండత నీవు దొల్లి ద్రుపదక్షితిపాత్మజఁ గొల్వులోనికిం
దెం డని పుచ్చి తద్దెసకుఁ । దెచ్చుట పాబలునీతిఁ గాదె యా
తండ మరల్చుఁగాక సముదగ్రత వచ్చువిరోధి నిప్పుడున్. 194
వ. అబ్బంగి నవమానింపంబడినవాఁడుగావున ధార్తరాష్ట్రకులధూమకేతువగుకపికేతువు దోఁచె నీకు దుర్మదంబున ద్రోణాచార్యుల నధిక్షేపింపవచ్చునంతియకాక దేవదానవుల కయినను దుర్జయుం డగునర్జునునకుం దలసూపవచ్చునే నయవిక్రమంబుల నతిలోకుం డగునతని నెవ్వరి కేనియుం బొగడవలయు ననినం బుత్రనిర్విశేషుం డగునిజప్రియశిష్యుని నగ్గించుట గురునకుం గొఱంతయె యింక సిగ్గుమాలి రణంబు సేసెనేనియు ద్రోణుండ చేయుంగాని యే నిట్టిదాని కోర్వ నదియునుంగాక. 195
క. ప్రళయాంతకుండు బడబా,నలమును మృత్యువును నెదిరినం గొఱఁతవడక
నిలిపినను నిలుపు మార్కొని, చెలఁగిన నరుశరము [4]లనవశేషము సేయున్. 196
ఆ. కుటిలబుద్ధులిచటఁ । గొనవు నెట్టన ఘన,దోర్బలంబు మెఱసితొడరవలయు
నతఁడు గాండివమున । నడ్డసాళులు వైవఁ, [5]దురుల నంపవానగురియుఁ గాని.
క. విను మట్టులు గా కున్నం, దనగోవులవెనుక మత్స్యధరణీశుఁడు వ
చ్చిన మార్కొందుము నరుఁ డే,పున ముట్టిన నతనిపొంతఁ బోదుమె యధిపా.
వ. అనిన విని రాధేయుండు సక్రోధుం డై యోధవీరలోకంబు నాలోకించి. 199
చ. వడిగొని గోగణంబుఁ బొదువం బఱతెంచితి రెల్లవారు ము

1. గ. దెచ్చికొంటి. 2. గ. భోవని. 3. జ. లాడునె. 4. చ. నిరవశేషము. 5. క. ద్దరుల్ల.

నొప్పడఁబడి పాండునందనులు। యున్నెడ యిమ్మెయిఁ గాన వేఁడి యి
ప్పుడు నరుఁ గాంచి మీ రతని। పోటు నుతించుచు భీతి [1]నిట్లు వా
విడిచి యనేకభంగిఁ బృథి।వీపతి వీఁకుఁడిఁ జేయు టొప్పునే. 200

చ. వెఱచితిరేని నిల్వుఁ డొక।వీరున కొక్కఁడచాలుఁ గాక యెం
దఱు వలయుం గపిధ్వజము । దవ్వుల వేల్మిడిఁ ద్రుంచివైచెదం
బఱపెదఁ దత్పిశాచముల । భగ్నము సేసెదఁ దేరు సారథిన్
నెఱఁకులు నొంచెదం బొదులు । నించెద నర్జునుగాత్రశాలలోన్. 201

శా. జ్యాఘోషం బతిభీషణం బయి దిశా।చక్రంబు నిండన్ శర
వ్యాఘాతంబున శాత్రవుండు వికల।స్వాంతుండు గా నారద
శ్లాఘాపాత్రము నై యనర్ఘభుజా।సంరంభతన్ రౌద్రశే
ఖాఘోరాకృతి యేన[2]చూపెద నశం।కం జూడుఁడీ యేర్పడన్. 202

క. క్రోధజ్వాలలు నిగుడ వి,రోధిబలేంధనముఁ బొదువు।క్రూరతమై దు
స్సాధ మగునర్జునాగ్నిని, సాధించెద నేన పూని । శరవర్షమునన్. 203

వ. పాండవమధ్యముండు పదుమూఁడువత్సరంబులు పూఁచిపట్టి కయ్యంబునకువచ్చె నతనిలావును బీరంబును లోకంబునకు నెక్కి యున్నయవి యేనును గురుసేన యందు శక్తిశౌర్యంబులు గలవాఁడనపోలె వర్తించెదం గావున నేమిరువురము నొండొరులకు బాహుబలవిలాసంబును విక్రమక్రీడాకౌశలంబును బ్రకటించుట యుచితంబు గాదె యని వెండియు నిట్లనియె. 204

సీ. అనుదినంబును నంత।కంతకుఁ బెరిఁగెడి,యధిపతిమన్నన।యప్పు దీర్ప
నర్జును నోర్చెద । ననిలోన నే నని, యతనితోఁ బలికిన। ప్రతిన నెఱపఁ
గర్ణార్జునులయందు।ఘనుఁడెవ్వఁడగునొక్కొ,యనుజనంబులసందియంబుమాన్ప
జమదగ్నిసుతకృపా।శ్రయమునఁ బడసిన,విలువిద్యకలరూపు । వెలయఁజేయఁ

ఆ. గనుట నేఁడు పుణ్య।దిన మయ్యె నాకు మీ, [3]కెల్లఁ బోరు సూడ । నిష్టమేనిఁ
జూడుఁ డట్లు గాక । వేడుక లేదేని, సంతసమునఁ బసుల।జాడఁ బొండు. 205

వ. అనిన నమ్మాటలు విని కృపాచార్యుం డతని కిట్లనియె. 206

ఆ. కయ్యమునక యెపుడు।గాలుద్రవ్వుదు కార్య,గతికిఁజొరవునీతి।యుతులు సమర
[4]హత మసాధనముగ । నాడుదు రర్థసం,సిద్ధిఁ బొందు తెఱఁగు । సేయునెడల.

క. అగు దేశకాలబలయుత,ముగఁ జేసినపోర నర్థ।ములు మోఱకు లై
తెగఁబాఱి తమ్ము నెదిరిని, వగవక తొడరుటలఁ గీడు । వర్తిల్లుఁ దుదిన్. 208

వ. అక్కిరీటి యొక్కరుండ కాఁడె యని తలంతుమేని. 209

సీ. శక్రాదిసురలతో । సంగ్రామ మొనరించి, ఖాండవం బేర్చె నొ।క్కరుఁడ కాఁడె
యాదవబల మెల్ల।నాఁగఁ ద్రోచి సుభద్రఁ, గడిమిమైఁ దెచ్చెనొ।క్కరుఁడకాఁడె

1. గ. నిట్లు వా విడిచి. 2. చూపెదను జక్కం. 3. చ. కేల ఘోరు. 4. ఘ. మథమసాధన

దిగ్విజయంబునఁ § దేజంబు సేసె ని,క్కురువంశమునకు నొ§క్కరుఁడ కాఁడె
బలముతో గంధర్వ§పతి నోర్చి విడిపించెఁ గౌరవేశ్వరుని నొ§క్కరుఁడ కాఁడె

ఆ. యని నివాతకవచు§లనుదానవుల నాతఁ,డొక్కరుండ కాఁడె§యుక్కు[1]మడఁచె
నమరులకు నజేయు § లగుకాలకేయుల, నొక్కరుండ కాఁడె § యొడిచెఁ గర్ణ.

క. భూవరు లెల్లను నొక్కట, ద్రోవదికై తోడరి యతని§తోఁ బెనఁగి కడుం
జేవ సెడి పోవునప్పుడు, నీ వచ్చుటఁగలవొ లేవొ § నిక్కము సెపుమా. 211

శా. కుంతీనందను లొక్కఁ డొక్కఁడ రిపు§క్షోభంబు సంధిల్ల దు
ర్దాంతస్వైరపరాక్రమంబులు మహో§త్సాహంబునం జేసి ర
త్యంతోదగ్రతఁ బల్కె దీ విచట బాహా§శక్తి యిమ్మేదినీ
కాంతుం డియ్యకొనంగఁ [2]బూనితి వృథా§గర్వంబు నీ కేటికిన్. 212

తే. ఏచి మున్నీరు సేయాఁత§నీద నగ్గి, నుఱుక వాసుకికోఁఱలు § వెఱుకఁ గడఁగి
నట్లుగాదె రాధేయ నీ§వర్జునునకుఁ,బోర నెక్కటి మార్కొనఁ§బూను టరయ.

క. బలుగాలిఁ బేర్చుదావా,నల మొక్కరుఁ డార్పఁ బోయి§నను దీఱునె నీ
చల ముడుగు సాహసమునం, గలదే మే లెట్లు నధిపుఁ § గావఁగ వలదే. 214

తే. కురువిభుండును భీష్ముండు § గురుఁడుగురుత,నూభవుండునునీవు నే§నును గడంగి
కూడుకొనితాఁకుదముగాక § క్రీడితోడ,నొంటిమార్కొన వశమె ము§క్కంటికైన.

—◆ కర్ణుఁడు కృపాచార్యు నధిక్షేపించి పలుకుట. ◆...

క. అని పలికిన సంరంభం,బున నినసుతుఁ డిట్టు లను రి§పులయెడఁ జిత్తం
బున నీవు ప్రియము గలుగుటఁ, గనికని నినుఁ దోడు పిలువఁ§గాఁ బతి బేలే.

క. ఏలినవానిధనంబులు, బాలురు బంధువులుఁ దారు § బ్రదికినదినముల్
వేలారిచి తిం డ్రాతని, యోలము గని పిదప భీతి § నొదుఁగుదు రాజున్. 217

క. జన్నములు సేయునెడఁ బ,న్నాన్నంబులు గుడుచుచుఁ [4]చుండు § మధిపతి నిన్నుం
జన్నియ విడిచె రణముతఱి, మిన్నక కినుపడక పొమ్ము § మీగృహమునకున్.

తే. ఏను విల్లందుకొనిన నీ§రేడుభువన,ములును వడవడవడఁకు నా§యలఘుబాహు
బలముఁ దలఁపక పలికితి § పార్థుఁ డనఁగ, నెంతవాఁడొక్కరథికున§కింతయేల.

వ. అనియె ని త్తెఱంగున నందఱుఁ బలుకుపలుకు లెల్ల వినుచు గాంగేయుండు కౌరవేశ్వరు నుద్దేశించి ధర్మార్థసంగతంబును సువిహితంబునుగా నిట్లనుద్రోణాచార్యుండు నీతిపథంబునం బలికె నాచార్యతనయువచనంబు లుచితంబులు కృపాచార్యుండాడినచందంబును దెఱంగు వడియున్నయది మన్నన గలమానిసి యగుట నంగరాజునకు సంగరపాటవంబుమాటలు దగుం గాక మాన్యుల నధఃకరింప నగునే యని వెండియు. 220

1. గ. ఖ. మడిచె. 2. క. జూపితి. గ. జెప్పితి. 2. క. (వేలడఁచి తిందు రాతని; క. మేలను చ్ఛల్లి దిందు రాతని; జ. శ్లే లని కొని త్రిం (డాతని. 4. ఘ, చ్ఛుండ్ర నధిపతి.

ఆ. నేల ప్రాద్దెలింగి చాలుమానిసి రణో,ద్యమ మొనర్చి కాక తగినవారి
చెవికిఁ జేదు గాఁగ నవమానవాక్యంబు, లుడుగ కిట్లు వలుకు టొప్పునెట్లు.

క. బీరము లావును[1]మిగులఁగ, వైరులు [2]దఱి యైనఁ దొడర వచ్చినచోటన్
దూరమున వెరవుతోడివి,చారము గలుగు టిది దగ దె[3]సద్బుద్ధులకున్. 222

ఆ. అరులగుణములైన నగ్గింతు రెప్పుడుఁ, [4]గలయ బెరసినపుడు గలితనంబు
మెఱయుదురు మహాత్ము లెఱుఁగఁడు తుదిమొద, లెట్టివారి నితఁడు బెట్టుపలుకు.

వ. ఆచార్యులైనవారలు పూజావాక్యంబుల కర్హులుగాక గర్హించుటకు విషయంబె యనుచుఁ గృపాశ్వత్థామలకరంబులకు నిజపాణిపుటంబులు సాఁచి యిట్లనుఁ బని సాలినంత గలదు విబ్బచ్చుండు వచ్చుచున్నవాఁడు విరోధంబునకు సమయంబు గాదు మన మందఱముం గూడికొని కార్యంబు సేయుదము బలవద్వ్యసనంబునందు భేదంబు గలుగు టొప్పదని బుధులు సెప్పుదురు వేదంబు లొక్కవలనను ధనుర్వేదంబొక్కవలనను గలమీయట్టి మహానుభావులెందునుం గలరె కురుబలంబునకొకటి పుట్టినం బ్రసిద్ధులరు గావున నది మీతలన నిలుచు నట్లగుటం జేసి.

క. క్షమియింపవలయు నొకఁ డెఱుఁ,గమి నేమే నన్న నంతఁ గటకటఁబడి భూ
రమణునికార్యస్థితి చి,త్తములం దెడ సేయునట్టితరమే [5]మీరల్. 225

వ. అనిన విని వార లిట్లనిరి. 226

క. క్షమియింప నెవ్వరము భూ,రమణునికార్యమున కెవ్వరము ద్రోణులచి
త్తము శాంతి వొందఁజేయుట, మముఁ దెలుచుట యిట్టులేల మాకొలఁదులకున్.

వ. అనిన విని గాంగేయకర్ణులం గూర్చికొని కురుపతి గురునిం బ్రార్థించి యశ్వత్థామను వేఁడికొని కృపాచార్యులం దేర్చినం బ్రసన్నుండయి యోధవీరులం గలయం గనుంగొని ద్రోణాచార్యుం డిట్లనియె. 228

తే. అలుక భీష్మునిపలుకుల యపుడ పోయె, మీఁదికార్యంబు నడపుఁడు మీరలింక
మోహసాహసములఁ గురుముఖ్యు దెసకుఁ, గీడు రాకుండఁ దగఁ బరికింపవలయు.

క. వాసవనందనుఁ డెంతయు, గాసిలి యున్నాఁడు మనలఁ గని యించుకయుం
డా సైరణ సేయఁడు గను, మోసము లేకొక్కమొగిన ముసరఁగవలయున్.

వ. అప్పుడు కురుపతి సమయకాలవిషయంబుగా నాడినమాటయుం గలదు కాన నిరూపించి యున్నరూపు గాంగేయుండు సెప్ప నర్హుఁడనిన నతండు దుర్యోధనున కిట్లనియె. 231

— భీష్ముఁ డర్జుననజ్ఞాతవాసవత్సరవ్యాప్తి నిష్కర్షించుట. —

సీ. రెండవయేఁట నొక్కం డధిమాస మి,ట్టిక్కినయన్నెల లెల్లఁ గూర్చి
కొనఁ బదుమూఁడు హాయనములు దప్పక, నిన్నటితోడన నిండె నింత
యెఱిఁగియ తమపూన్కి యెల్లను దీర్చితి, మని పాడసూపె నర్జునుఁడు నేఁడు

---

1. క. జ. గలిగాడు. 2. క. పో టొడ్డి. 3. క. సద్భటులకునున్. 4. జ. గలన. 5. క. గ. మీకున్.

పాండుపుత్త్రులు ధర్మపరులు ధర్మాత్మజుం, డేరి కథిప్తాత వారు ధర్మ
తే. పథము దప్పరురే యన్ని పాటు లట్లు, పడినవారలు దఱియంగఁబొఱ నేర్తు
రెట్లు దమకించి నీతివిహీనవృత్తిఁ,దమకు నొకకీడు వచ్చువిధంబు గాఁగ. 232

ఉ. అట్టిద యైన నాఁడ తఱియంబడి మూర్ఖతనంబు సేయరే
నెట్టన ధర్మపాశముల నిల్చిరి కాలము వేచి యుండి రిం
కెట్టును వారు గొంత తమయేడ్తెఱ సూపక మాన నేర్తురే
ముట్టఁగ వచ్చిరేని మనముం దగ నోర్తముగాక దానికిన్. 233

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికినై పెనంగినబలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగుఁ గుం దగుం దొడరు లెల్లవిధంబుల [1]కోర్చు టట్లుగా
కిచ్చఁ దలంచి యొక్కమెయి ని త్తఱిఁ బొందగుచేఁతయుం దగున్. 234

వ. అనిన విని కురుపతి దరహసితవదనుం డగుచు నిట్లనియె. 235

ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకు, నెట్లు పొందు గలుగు నేను రాజ్య
భాగ మీను సమరభంగిక విక్రమ,నిరతిఁ బూను టిదియనిశ్చయంబు. 236

వ. అనిన నయ్యురువురవచనంబు లాకర్ణించిగురుండిట్లనుఁగార్యగతియును గయ్యంబు భంగియు భూపతికంటె మిగులం గనియెడువారు లే రయినను నా యెఱింగిన యంత నొక్క తెఱంగు సెప్పెద నీబలంబున నాలవపాలు గొని మహీపాలుండు సత్వరంబుగా ముందఱఁబోవవలయు నంతియసేన తదనంతరంబ కదుపులం బొదివి కొని చనవలయుఁ దక్కటిసగంబుతో మనము నిలిచి మోహరించి యల్లనల్ల నరుగవలయుఁ గవ్వడి యెయ్యెడం గవిసె నయ్యెడన తలపడ వలయునిట్లైన మానవేశ్వరుండు సురక్షితంబుగా సందడింబడక నడచుగోవులు[2]నిన్నెలంగడచు మనమును ధనంజయునకుం జాలినయప్పుడ యట దోడుపడ నెవ్వరు గలిగినను వారికిం [3]జాలి నిలుత మనిన విని సురనదీసూనుండు దానికియ్యకొని రాజన్యునకు సైన్యంబుఁ బంచి యిచ్చి పుచ్చి పసులకుం దోడగుభాగంబునుం బంచియున్నంత వట్టుచతురంగంబుల నియతిసేసికొని యాచార్యుండు నడుమను గృపాచార్యుండు వలపటను నాచార్యపుత్త్రుండు దాపటం గర్ణుండు ముందట వికర్ణదుశ్శాసన శకుని సైంధవ సోమదత్త బాహ్లిక భూరిశ్రవః ప్రభృతియోధవీరు లెల్ల నెడనెడం గలయ నిలుచునట్లుగా మోహరించి మహోత్సాహంబున సన్నాహ సౌందర్యంబు నొంది తాలధ్వజం బెత్తించి మెఱసితాను వెనుకయయి నడపించు చుండె నట్టిసమయంబున. 237

చ. అడుగడుగ నిట్టు లొక్కనికి నంతబలంబునకున్ మహోగ్ర సం

1. క. గ. చ. జ. కోర్చుటట్లు గాకిచ్చ; ఖ. ఘ. కోర్చునట్లు గా నిచ్చఁ, 2. ఘ. నిన్నెలవు. 3. గ. జాలుఁడ - జాలితి - జాలింత - మనిన.

గర మగుడఁ మనం బతుల♦కౌతుక మొంది కనుంగొనఁ సురే
శ్వరుఁడు సుదర్శనం బనఁ బ్ర♦శంసకు నెక్కు విమాన మెక్కి యం
బరగతి వచ్చె దేవముని♦పంక్తులు సిద్ధగణంబుఁ గొల్వఁగాన్. 238

వ. అద్దివ్యయానరత్నంబునందు. 239

తే. స్వర్గమున నున్న రాజులు♦జక్రవర్తులును యథోచితచ్ఛత్త్రంబు♦లును నిజార్హ
చామరంబులుఁ జెలువొందఁ♦జాపలిలఁ, గొలిచియుండిరి వేడ్కలు♦గొనలునిగుడ.

క. పాండుమహీపాలుం డా,ఖండలుచేరువన పెద్ద♦గద్దియ నమరీ
మండలి వీచోపు లిడఁగ, నుండి కనుంగొనుచు నుండె ♦ నుజ్జ్వలభంగిన్. 241

వ. అంత. 242

సీ. దేవదత్తాభీల♦రావంబు వెసఁ గర్ణ,ముల దీటుకొన లేట♦మొగము వడుచు
రథనేమిదళితధ♦రాధూళి యంగంబు, లెల్లఁ గప్పఁగ వెలు♦వెల్లనగుచు
బహుళకపిధ్వజ♦ప్రభలు లోచనములు, మిఱుమిట్లు గొనఁ బర్వ♦మెండుకొనుచు
నుద్భటాకారస♦ముద్ధతి మనము లు,త్తలపడఁ దోఁపంగఁ ♦ దల్లడిలుచు
తే. నడచుకౌరవరాజసై♦న్యంబు గదిసెఁ, దీఁగ దిగిచినగతిఁ దన♦తేరు మెఱయ
రయముమైఁ జని ప్రళయభై♦రవసహస్ర,[1]గర్జనోదగ్రతర్జనుఁ ♦ డర్జునుండు.

వ. ఇవ్విధంబునఁ గురుబలంబులఁ గ్రోశమాత్రంబునం గూడ ముట్టి క్రీడి తలయెత్తి
చూచి యుత్తరున కి ట్లనియె. 244

చ. ఇది యొకపెద్దగట్టిమొన ♦ యీమొనముందట గోగణంబుతో
నదె యొకయల్పసైన్య[2]మట ♦ యాతల వేఱొకకొంతసేన య
ల్లదె యిటుపంచి పెట్టఁ [3]జను♦నంతటిలోన వృథాభిమానదు
ర్మదబహుభాషి యైనకురు♦రా జెచటం జనుచున్నవాఁడొకో. 245

క. అరయుదము గాని యిమ్మో,హరమునకును డాపలించి ♦ యరదముఁ బో ని
మ్మురవడి నతనిక యుఱికెద, నరుదుగ నెబ్భంగి నెవ్వ ♦ రడ్డం బైనన్. 246

ఉ. ఆతఁడు సిక్కెనేని బల ♦ మంతయు విచ్చు మరల్పవచ్చు గో
వ్రాతము నట్ల యైన [4]సుక♦రంబుగ నంతట నెల్లఁ దీఱు నీ
యాతతసేనయం దతని ♦ నారసి కానసి యున్న వీరి ని
ట్లీతల డించి యాకదుపు ♦ నెయ్యఁగఁ బోదముగాక ప్రేల్మిడిన్. 247

క. విచ్చి చనకుండఁ బసులం, దెచ్చుట మునుమున్న వలయు♦ తెఱఁ గాపనికిం
జొచ్చి యది చక్కఁబెట్టఁగఁ, నచ్చోటన దాయ మనకు ♦ నగపడెడు బలే. 248

క. అనిన విని యుత్తరుం డ,మ్మొనవలపటఁ బెట్టి యరద♦మును బోవఁగ ని
చ్చిన సరస కరిగి కవ్వడి, కను విచ్చి బలంబు నెల్లఁ ♦ గలయఁగఁ జూచెన్.

---

1. చ. గర్జనోగ్రతర్జనుఁ డగు♦నర్జునుండు. 2. గ. మట ♦ యావల. 3. 'జనె ♦ నన్నిటి లోన. 4. చ. సుక♦రం బగు.

వ. ఇట్లు గలయం గనుంగొని మధ్యదక్షిణవామాగ్రపశ్చిమోత్తరభాగంబుల నిట్టిట్టి వారలు నడచుచున్నవా రని సారథితో నేర్పడం బలికి వీరలలో నురగకేతనుండు లేఁ డతండు గోవులం గొనిపోవ నోపు [1]నిరామిషం బైనయీసేనతో నని సేయం బని లేదు వీర లెయిది యడ్డపడి తడవు సేయకుండునట్లుగా ముట్టికొని పసులం బెట్టించి దొరయును [2]నెల గడవం బోవక యుండఁ బొదువవలయు నని చెప్పి యతని నద్దెసకుఁ దేరు వఱుపం బనిచి గురుకృపగాంగేయులకుఁ జరణసమీపస్థలంబులం బడ రెండును గర్ణాభ్యర్ణప్రదేశంబులం జన రెండునుగా నాలు గేసి యమ్ము లేసిన నాసవ్యసాచిం జూచి యాచార్యుండు పరిసరవర్తు లగునాప్తజనంబులతో నల్లన యర్జునుం డింత యొప్పి యుండునే యని యగ్గించి వెండియు.

—* ద్రోణాచార్యుఁ డర్జునుం జూచి ప్రశంసించుట *—

మ. విలసద్గాండివచాలనోద్ధతి కనద్విద్యుల్లతాలీలగా
నలఘుస్ఫారకపిధ్వజధ్వని సముద్యద్గర్జచందంబుగా
జలదాకారత నొందెఁ దే రితఁడు పర్జన్యాకృతిం బొల్చె దో
ర్బలతీవ్రారినిదాఘదుర్విషహగర్వస్ఫూర్తి [3]నిర్మూర్తిగాన్. 251

వ. ఇప్పుడు నాకుఁ బ్రణామంబులుగాఁ బాదంబులమొదలం బడ రెం డమ్ము లేసి పెద్దకాలం బేనిఁ బాసి యున్నవాఁడు గావునఁ గుశలప్రశ్నంబుగాఁ జెవులు సోఁకియుం జోఁకములుగా రెం డమ్ము లేసె నని పలికి వెండియు ని ట్లనియె. 252

క. ఇదుమలఁ బదుమూఁ డేండ్లుం, బడి కడుఁ గోపించి వచ్చె బలువిడి నీక
వ్వడి దఱియ నుఱికి వడి ని,ప్పుడ [4]యిమ్ముఁబ్రోవు నెల్లఁ బొరిగొనెడు బలే.

తే. విపినవాసంబు నజ్ఞాత[5]విధమువర్త
నంబు గడపి నవాభ్యుదయంబు నొంది
రాత్రిఁ బుచ్చి తోఁ తెంచుమార్తాండుమాడ్కిఁ
జూడ నుజ్జ్వలుం డగుచు నర్జునుఁడు వొలిచె. 254

వ. అనిరొఁ గృపాచార్యభీష్ములుపార్థబాణపాతప్రకారంబులు ప్రణామకుశలప్రశ్నంబులుగా నంతరంగంబులం గనికొని సంతసిల్లిరి ధనంజయుండును దక్కినవారికి దుర్నిరీక్ష్యుం డగుచు నమోఘప్రహారంబు దెస ననాదరంబు సేసి గోవులపజ్జం బోవుచుండె నతనిం జూచి సురనదీసూనుండు కురువీరులతో ని ట్లనియె. 255

క. చిరకాలమునకుఁ గంటిమి, నరు నక్కట వీఁడు సజ్జనప్రియుఁడు సుహృ
త్పరతంత్రుఁడు బాంధవహితుఁ, డరిభీకరుఁ డిట్టివార లవనిం గలరే. 256

క. మనచూడ్కికి వ్రేఁ గయి యీ,తనియతులితమూర్తియత్యుదాత్తతఁ గడు నొ
ప్పినయది గంటిరె జగ మె,ల్లను నేలఁగఁ దగుసముజ్జ్వలత యూహింపన్.

---

1. గ. నిరామిషమైన. 2. 'నెల' అనిపెక్కుప్రతుల లేదు. 3. క. మన్మూర్తియై. 4. గ. యిమ్ములఁబోవు. 5. వివిధవర్తనంబు.

క. వెనుకదెస వచ్చి కదిసియుఁ, దనరథము డొలంగనిచ్చి తఱియఁబడుట కొ
ల్లనితలఁపు గలిగి క్రేఁగం,టన మనలం జూచుచుం గడచి యట నడచెన్. 258

క. మొనఁ గలయఁ జూచి యూరక, చను టధిపతి నరసి తా నిచటఁ గానక యా
తనిపజ్జ నరుగు తెఱఁ గగు, ననుమానము లేదు క్రోశమగ్గలము మదిన్. 259

చ. మనకును గౌరవేంద్రునకు మధ్యముఁ జొచ్చెనయేని నాతఁ డ
ర్జునునకు [1]నొంటి సాలఁ డని రుద్రుఁడు నెక్కటి మార్కొనంగ లేఁ
డనిన నొరుండు శక్తుఁడె రయంబుమెయిన్ మన మెల్ల నిప్పు డా
తనికడ సేరఁగాఁ జనుట తప్పినఁ గార్యము దప్పు నెంతయున్. 260

ఆ. వాసవాత్మజుండు వసుధేశనందను, ముట్టికొనిన నొకటి పుట్టునేని
మనప్రయోజనంబు మఱి యేమి పసు లవి, యేటికొండు ధనము లెల్ల నేల.

వ. అని పలికి బలంబుఁ బురికొల్పికొని యతండు రాజరక్షణతత్పరత్వంబున నరదంబు సత్వరంబుసేసిన సేనాపతిం గని సైనికనికాయంబులుం గడఁగి చనం దొడంగె నిప్పాట నమ్మేటిమొనయును వెసం బోవ గోవులకావలిమూఁకయు వానిం దఱిమికొని యతిరయంబున నరుగం దానును [2]గెలనఁ గ్రోశద్వయమాత్రంబు నడచి పురుహూతపుత్త్రుం డుత్తరున కిట్లనియె. 262

మ. ఇదె గోవర్గము సేర వచ్చితిమి పో నిం కేల సైన్యంబులుం
గదియన్ వే చనుదెంచె రెంటినడుముంగాఁ జొచ్చి యీవచ్చును
న్మదవీరావలికిన్ భుజావిభవవిన్యాసంబు గాన్పించి మా
న్చెద గర్వంబు మరల్చెదం బసుల నాచేఁ జిక్కు రా జెమ్మెయిన్. 263

—♦ యుద్ధారంభము. ♦—

క. అనుటయు విరాటతనయుఁడు, మొన కడ్డముగాఁగ దూర్పుమొగమై రథముం
గొని కట్టెదిరికిఁ బోయినఁ, దనమూఁపులు రెండు నపుడు దలకుం గడవన్. 264

వ. తేరు సమ్ముఖంబు సేయించి పేరువాడి క్రీడికరతలం బెత్తినిలునిలుమని యదల్చిన ఘోషంబుతోడన వెడలునిశితశరపరంపరలదట్టంపుఁబఱపున నంబరంబునీరంధ్రం బగుటయుఁ దదంధకారంబును భయతిమిరంబునుం గవిసి గుండియ లవిసి కురుబలంబు లెదురు నడవను మరలం బఱవను మఱచి వెఱచఱచి హరితనయహస్తలాఘవప్రశస్తిదక్కం దక్కినచేష్టలు తక్కియుండె నతండు గోవులవెనుకం బోవునల్పబలంబు బెదరి తూర్పుదెసకుం జెదరునట్లుగా నరదంబుఁ బఱపించి తెఱపిసూపి [3]వెలిచీర సారించి దేవదత్తంబు పూరించినం గేతుకపి గర్జిల్లం దదీయభూతంబు లార్వ మార్వీరవంబును రథనేమినినదంబును బ్రతిపతాకినీతుములంబును గగనంబునం బొగడునమరులయెలుంగులును నొక్కటఁ జెలంగ సముదితసాంద్రసంరావంబు రోదసికుహరంబు నిండిన నొండొండ [4]మట్టలెత్తుకొని నేల మట్టవి

1. గ. నొంటిఁ జాలఁ డని. 2. గ. గెలపట; జ. గెలనిపట్ల. 3. గ. విల్లునారి 4. జ. మంట్ల,

యుచు నద్రువం బసుల వెసం దిరిగి మున్ను వివ్వచ్చుండు వచ్చినజాడం గైకొని
దక్షిణదిశకుం [1]గెరలువోడుచుచుం దెరలం బాఱిన. 265

క. గోవులతోఁ బోదువంబడి, పోవుచు నున్నట్టిగోప§పుంజంబు తదీ
యావసరంబున సరభస, మై వానిపిఱుందఁ దిరిగి § యమ్మెయిఁ బఱచెన్. 266

ఆ. అప్పుడర్జునుండు § దప్పక చూచి యీ,బలము పసుల కడ్డ§పడక యుండ
నెడ సొరంగవలయు § నిట యెద్దుకొను మని, పనిచె మత్స్యభూమి§పాలసుతుని.

క. పనిచిన నాతఁడు నమ్మెయిఁ, జన నిచ్చె రథంబు గోప§సంఘముఁ దిర మై
కొనిపొండు పసుల నోడక,యని [2]తానెలుఁగించి వీటి§కై నూల్కొలిపెన్. 268

వ. అట్టిసమయంబున. 269

క. కరితురగసమితిఁ [3]గార్కొని, కురువీరులమొనలు మొగులు§కొమరునఁ గవియన్
శరవేగంబున నరుఁ డు,ద్ధురమారుతచండభంగి § దోఁప దెరల్చెన్. 270

క. కదిసినబలములు విచ్చినఁ, గడఁపులఁ జెదరంగనీక § గాండీవి వెసం
బొదివి యట కడపె నవియును, గొదకొని తమపాలముసొచ్చె§గోపాలురతోన్.

వ. అని చెప్పిన విస్మయంబు నొంది. 272

ఆ. పసులు పట్టువడిన§పదపడి నరుఁ జెద్ది, యాచరించెఁ గౌర§వాధినాథుఁ
డేమిసేసె బలము § లెట్లయ్యె భీష్మాది, వీరు లెవ్విధంబు§వార లైరి. 273

వ. అనవుడు. 274

మ. నవతాదూర పురాణతానుపగతా § నానాత్వ[4]సంశోభితా
వివిధత్వాపగమోజ్జ్వలా బహుకళా§విర్భావశాలీ సము
ద్భవరాహిత్యనిరూఢ సూక్ష్మతర[5]సం§భాసా మహాస్థూలమూ
ర్తివిశేషా నిరుపాధికా గుణమయా § [6]ధీవర్తకా నిష్క్రియా. 275

క. అంతఃకరణచతుష్టయ,శాంతిసముద్యద్వివేక§సంపద్వేద్యా
చింతాతంతుత్రుటనా,త్యంతవిదగ్ధైకభజన§తత్పరహృద్యా. 276

మాలిని. ప్రణమదవనవిద్యా§ప్రౌఢిసంరూఢకాంతి
ప్రణుతచరణపద్మా § పద్మజాదిత్యసత్పో
షణచతురదయావి§స్ఫారితాలోక లోకా
పణనిపుణజనాంచ§ద్భక్తివిక్రీతమూర్తీ. 277

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతంబయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందుఁ
జతుర్థాశ్వాసము. 278

---

1. క. 'దెరలుపోడుచుచు;' ఖ. గ. ఘ. జ. ట. 'జెరలువోడుచుచు'; చ. 'జిఱ్ఱలు వోడుచుచు' 2. గ. తానెలుఁగిచ్చి. 3. గ. గార్కొని. కురువీరులు మొగులగముల ♦ కొమరున; జ. గూర్కొని కురువీరులు మొగులు గవియఁ ♦ కొమరున. 4. గ. సంబోధితా. 5. జ. సం♦భాషా; చ. 'సంభావా' 6. నిర్వర్తకా.



హ రి హ ర నా థా య న మః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము, పంచమాశ్వాసము.



సంపాదనచాతు
ర్యా సేవ్యపదారవింద । యాగికవిద్యో
[1]ద్భాసితమతిమూర్తిమయా
వ్యాససమాసైకరూప । హరిహరనాథా. 1

—* అర్జునుఁ డుత్తరునకుఁ గౌరవవీరుల వేఱువేఱ నిరూపించి చెప్పుట *—

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నివ్విధంబున విరోధివర్గం బుక్కు దక్కి వెక్కసపడి చూచు చుండ నిరర్గళభూజార్గళసంరంభవిజృంభణంబు శోభిల్లఁ బసులం బెట్టించి యనతిదూరవర్తియగు కౌరవచక్రవర్తిదెసంగనుంగొని ధనంజయుండు భూమింజయు నక్కడఁ దేరు వఱపం బనుప నప్పళించునప్పుడు కురువీరులుగూడుకొనిమూఁడువేలరథంబులతోడను గాంగేయకర్ణ లొక్కొక్క రుండు వేయింటితోడను దలకడచి రాజున కడ్డపడి కవ్వడిదిక్కు మొగంబుగాఁ దిరిగి రట్టియెడఁ గదుపులు పట్టువడుటకు నిట్టూర్పు నిగిడించుచు మగిడి మనుజపతియు ననుజసహితుండై సహస్రస్యందనంబులతోడ వెన్ను దన్ని నిలిచె నంతఁ దక్కటిబలంబులు నెయిదికొని [2]యమ్మెయిన దళంబుగాఁ గవిసిన. 2

క. కనుఁగొని మెల్లన వ్వాలయువ, దనమున గరువంపుఁజెన్ను । దలకొనఁగా న
ర్జునుఁడు విరాటసుతున కి, ట్లనుఁ గేవలవీరరసమ । యాత్మకుఁ డగుచున్. 3

సీ. కాంచనమయవేది । కాకనత్కేతనో, జ్జ్వలవిభ్రమమువాఁడు । కలశజుండు
సింహలాంగూలభూ । షితనభోభాగకే,తుప్రేంఖణమువాఁడు । ద్రోణసుతుఁడు
గనకగోవృషసాంద్ర । కాంతి[3]పరిస్ఫుట, ధ్వజసముల్లాసంబు । వాఁడు కృపుఁడు
లలితకంబుప్రభా । కలితపతాకావి, హారంబువాఁడు రా । ధాత్మజుండు

1. క. గ. జ. ద్భాసితమూర్తిమయా–సం–శ్రీ–సద్–వ్యాససమాసైకరూప; ఖ. ఘ. ద్భాసిత–మతి–గుణ–మూర్తిమయా, వ్యాససమాసైకరూప. 2. క. యమ్మెన. 3. గ. పరిస్ఫురద్ధ్వజ.

తే. మణిమయోరగరుచిజాల మహిత మైన, పడగవాఁడు కురుక్షితిపతి మహోగ్ర
శిఖరఘనతాళతరు వగు సిడమువాఁడు, సురనదీసూనుఁ డేర్పడఁ జూచికొనుము.

క. గురునకుఁ బ్రదక్షిణంబుగ, నరదముఁ బో నిత్త మిమ్మహాపురుషు నెడం
బరిభవము వలవ దీతఁడు, కురుకులనృపతనయశిక్షకుఁడు సుమ్మనఘా. 5

క. శస్త్రప్రకారనిపుణుం, డస్త్రవిదుఁడు దూరపాతనాభీలుఁడు వ
ర్చస్త్రాసితరిపుఁడు ధను, శ్శాస్త్రపరిజ్ఞానఘనుఁ డసదృశుఁడు శక్తిన్. 6

ఉ. ఈతనితోడి కయ్యమున కియ్యకొనం దగ దేను దుష్పృథ
¹ద్యూతజయోద్ధతుం డగుసుయోధనునిం బరిమార్పఁ బోవుచో
శాతశరోత్కరం బితఁడు చక్కఁగ నేయునొ నన్ను నేయఁడో
చూతము తాన మున్ననికిఁ జొచ్చినఁ జొత్తముగాక పిమ్మటన్. 7

క. గురుపుత్త్రుఁడు తేజోనిధి, సురాసురుల కైనఁ దేఱి చూడ నరిది సం
గరమున ²నీతని నీశ్వర, వరజనితుఁడు మేటి కౌరవవ్యూహమునన్. 8

క. ధైర్యధనుఁ డితఁడు ద్రోణా, చార్యుల కెన వచ్చు దివ్యశరవిదుఁడు కృపా
చార్యుఁడు మత్పితృసఖుఁ డా, చార్యక మొనరించె మాకు శైశవము తఱిన్. 9

తే. వీర లిరువురు మాన్యులు వీరితోడి, కయ్యమున కిప్డు మన మంత గాలు ద్రవ్వ
వలవ దెచ్చోట నెదురుగా మెలఁగి రచట, మనరథం బల్లనల్లనఁ జనఁగ నిమ్ము.

శా. యోధాగ్రేసరుఁ డిద్ధతేజుఁడు రణోద్యోగానురక్తుండు దు
స్సాధప్రక్రమబాహువీర్యుఁడు గురుత్మోపాలవాల్లభ్యల
క్ష్మీమద్ధామాత్ముఁడు జామదగ్న్యకలిత శ్రేష్ఠాస్త్రవిద్యాఢ్యుఁ డీ
రాధేయుం డొకచీరికిం గొనఁడు వీరవ్రాతముం బోరులన్. 11

క. శౌర్యాటోపంబున దో, ర్వీర్యంబున నస్త్రశస్త్రవిత్త్వమునను మా
త్సర్యంబు సేయు నాకును, దుర్యోధనుఁ డెపుడుఁ దన్నెదురు సేయంగన్. 12

చ. అతిదృఢవేది పేరు గల యట్టిమగండు రణంబు గల్గె నేఁ
డితనికి నాకుఁ దెల్లముగ నిట్టియెడం బరికించి చూడుమీ
మతి గలఁగంగ నీక యనుమానము వాయఁగ నీవు సాయకో
ద్ధతిఁ బ్రకటించుచో బహువిధంబుల నిద్దఱతారతమ్యముల్. 13

క. ఈయెడ ననుఁ గని వారణ, సేయుదు నితఁ డగ్గ మైనఁ జిచ్చుఱపిడు గై
పోయి పయిఁబడుదు నీ వర, వా యించుక లేక పఱపవలయు రథంబున్. 14

ఉ. ఉగ్రుఁ డనూనమానమహిమోన్నతచిత్తుఁ డజయ్యవిక్రమో
దగ్రుఁడు హస్తలాఘవసమన్వితుఁ డేయునెడన్ సమగ్రకో
పాగ్రహబుద్ధి మాదెస ననార్యుఁడుఁ గార్యమునందు ధార్తరా
ష్ట్రాగ్రజుఁ డీతనిం గదిసి నప్పుడు పండువు నాకు నుత్తరా. 15

1. క, జయోన్నతుం డగు. 2. గ, నీతం డీశ్వర.

తే. అరసికొని యెన్నిభంగుల § నైన నితని, తేరు మనవారి కగపడు § తెఱఁగు గాంచి
యడరి బాసటయైయెవ్వ § రడ్డపడిన, మెఱపుమెఱచినచాడ్పున § దఱియఁజొరుము.

క. అస్మత్పితామహుం డతి,విస్మయజననప్రతాప § విభవాగ్నిశిఖా
భస్మీభూతప్రతిప,క్షస్మయకాననుఁడు ప్రథమ § గణ్యుఁడు బుద్ధిన్. 17

క. బహుమహితాయుధవిద్యా,రహస్యసంవేది ధార్త § రాష్ట్రులకును మా
కు హితంబ కోరు సముఁ డై, [1]సహాయుఁ డగు వారలకు న § చటఁ దా నునికిన్.

క. వివిధము లగులక్ష్యంబులు, నవలీలం దునియ నాట § నవియఁగ నేయున్
భువనైకధ్వని నత్యు,గ్రవిచేష్టితు నోర్చెఁ బరశు § రాముం బోరన్. 19

క. శంతనునందనునరదము,పొంతం బో వలవ దలుక § పుట్టి యతఁడు భూ
[2]కాంతునకు సైన్యమునకుం, [3]జెంతలఁ జేరంగనీక § సిలుగులఁ బెట్టున్. 20

వ. అని యిట్లు వేఱువేఱ చూపి క్రమంబున నేర్పడం జెప్పి సవ్యసాచి సమరోన్ముఖుం
డగుసమయంబున సస్మితుండగుచు నశ్వత్థామ రవితనయునవలోకించియిట్లనియె.

క. నిను నీవ పొగడికొని పలి,కినపలుకులు పెక్కు గలవు § క్రీడి యనికి వ
చ్చినవాఁ డిదె పులివలె మా, ర్కొనరాదే కర్ణ సేన § కుం బ్రియ మెసఁగన్.

క. తలఁకు గల దేని శకునిం, బిలిచి విచారింపఁ బొమ్ము § పృథివీపతి నీ
తలన [4]తనకార్యఖడ్గం,బులమో పెక్కించె రిత్త § వోవునె నీకున్. 23

వ. అనిన విని యతండు క్రోధఘూర్ణమాన[5]తారకుం డగుచు ని ట్లనియె. 24

చ. తలఁకెడువానికిన్ [6]మగఁడు § తానటె న న్నడికించువాఁడిసీ
పలుకకు [7]భీతున ట్లాడుఁగఁ § బాఱునె శూరుఁడు నిన్ను నచ్చియే
కలనికి వచ్చితిన్ నరుఁడు § కాఁ డట వాసవుఁ డైన నేమి నా
బలముఁ జలంబు నేరిమియు § బంటుతనంబును నీవ చూడుమీ. 25

క. అని కడఁగుచినసుతునకు, న్మను ద్రోణుఁడు ద్రోణనంద § నుఁడుఁ గృపుఁడును శాం
తనవుఁడుఁ గడఁగుట దుర్యో,ధనుఁ డవలోకించి యత్యు § దగ్రతఁ గడఁగెన్. 26

వ. ఇవ్విధంబునన య్యేవురుదొరలును ధరణీశుండును సరభసంబుగాబరవసంబుసేసిన
దుశ్శాసన దుష్ప్రహదుర్ముఖప్రముఖనిఖిలకురుకుమారనికాయంబును శకునిసైం
ధవప్రభృతిబంధునివహంబును బాహ్లికసోమదత్తాదిసామంతనికురుంబంబును మ
ఱియునుం గలవివిధయోధవీరనిచయంబును నొక్కటఁ గరటిఘటాఘోటకఘట్ట
రథయూథపదాతివితతిసంరంభశుంభ త్సేనాసమూహసహితంబుగాఁద్రోచినడచిన.

చ. ధరణి పడంకె ధూళి దివిఁ § దన్నిన భానునిఁ గానరాద బం
ధురవివిధప్రకారపటు § తూర్యరవంబులఁ బొంగె దిక్కు లా
స్ఫురితమహాయుధోగ్రరుచి § పుంజవిజృంభణఘోర మయ్యె నం

1. క. గ. జ. సహాయ మగు. 2. గ. కాంతుదెస. 3. జ. జెంతం. 4. క. ఖ. గ. జ. మన
కార్య. 5. గ. మానసుం డగుచు. 6. క. మగఁడు తానటే; గ. మగఁడఁ దానటె. 7. భీరున.

తరము సహస్రనేత్రముఖ§దైవతమండలదుర్నిరీక్ష్య మై. 28

—♦ అర్జునుఁడు కౌరవసైన్యంబుల నుఱుమాడుట. ♦—

వ. అట్టియెడ నుద్భటహాసోల్లాసభాసురముఖుం డగుచు శతమఖతనయుండు. 29

చ. గుణమున లస్తకంబునను § గోటియుగంబునఁ గేలఁ [1]దార భీ
షణముగ నుప్పతిల్లి రభ§సంబున రేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట న§రాతిబలంబులఁ గప్పు గాండివ
క్వణనము రోదసీకుహర§కర్పరముం బగిలింప నుగ్రతన్. 30

క. తలపడి తలమీఱినకా, ల్బలములఁ బొడిసేయ మఱియుఁ § బైపైఁ బీనుం
గులఁద్రొక్కికొనుచు వెసముం, గలిమొనగవియుటయుఁ [2]గడఁక§గడలుకొనంగన్.

క. తనదృష్టియు ముష్టియుఁ దగు, ననువున మున్నెత్తి యేయు§నతఁ డప్పు [3]డు డిం
చినకాయముల సపాటం,బునఁ బదియుఁ బదేను నుచ్చి § పోయెం గోలల్. 32

చ. ఉడుగక వెండియుఁ౯ సుభటు § లొక్కమొగి౯ వెస నంటఁ దాఁకి క
వ్వడిపటుబాణభాస్వదని§వార్యసముద్ధతిఁ జేసి మంటలో
మిడుతలు సొచ్చిన ట్లయిన § మేటిమగల్ గని యీడఁబోక బ
ల్విడి మఱియు౯ వడిం బొదువ § వ్రేల్మిడిఁద్రుంచె నతండు దోడుతోన్. 33

తే. అంతకంతకుఁ గదిసి సై§న్యములుసుట్టు,ముట్టిశస్త్రాస్త్రసంచయ§మున నభంబు
దీటుకొనునట్లు సేయఁ గి§రీటి గాండి,వంబుపరిచాలనంబు దీ§వ్రంబు గాఁగ. 34

సీ. గోరఁ బోఁజినమాడ్కిఁ § గొన్నింటిఁ జక్కసాఁ,బాలుగా[4]వ్రయ్యలు§వాపి పాపి
[5]బాడిస నఱికిన§భంగిఁ గొన్నింటిఁ దు,త్తునియలుగా [6]బిట్టు § త్రుంచి త్రుంచి
వెస అంపమున నిడ్డ§వసిగఁ గొన్నిటి నిసు,మంతులుగా నుఱు§మాడి యాడి
పనివడి ఱోలఁ గొ§ట్టినలీలఁ గొన్నింటిఁ, జిఱునుగ్గుగాఁ బొడి§సేసి చేసి

తే. యడరిపొదివినబలమునా§నాయుధములఁ, బ్రతిహతంబులుగావించె§ నతిరయమున
నక్షతధ్వజసూతహ§యత్వలసద,ఫల్గురథవల్గనుం డగు§ఫల్గునుండు. 35

క. ఆమెయిన వివిధవర్మ, స్తోమం బఱవుల్లు సేసి § సునిశితబాణో
ద్దామప్రసారవిభవ,శ్రీ మార్తురకద్భుతంబు § సేసెం గడిమి౯. 35

క. గర్జ్జుణుఁ డై పగతుర, జర్జరితాంగులుగఁ జేసె § సాయకజాల
స్ఫూర్జన చూపఱు వొగడఁగ, నిర్జరవరనందనుండు § నిమిషార్ధమున౯. 37

శా. శక్తిస్ఫారధనంజయాయతభుజా§సంరంభగాండీవని
ర్ముక్తక్రూరశరావలీదళితశ§త్రువ్రాతముల్ శోణితా
సిక్తాకారతఁ బొంది సాంద్రకుసుమ§శ్రేణీవిలాసోల్లస
ద్రక్తాశోకతరువ్రజంబుల క్రియ౯ § రంజిల్లి యొప్పెం గడున్. 38

1. గ. ధార. 2. క. వేడ్క. 3. 'ఉడించిన' అనియే ప్రతులు. 4. జ. వ్రక్కలు. 5. క. బాడిత; గ. బాడిద. 6. ఘ. బెట్టు.

చ. తదవసరంబునన్ దొర లు–దగ్రతఁ ద్రోచినవజ్రఘట్టముల్
మదమున నొక్కపెట్ట బల–మర్దనసూనురథంబు గ్రక్కునం
బొదివెఁ దురంగకింకిణుల–భూరిరవంబుఁ గకీంద్రఘంటికా
భ్యుదితనినాదమున్ రథవ–[1]రోత్థితఘోషము [2]నుత్కటంబుగన్. 39

తే. అట్టియెడ వేల్పు వచ్చిన–యట్ల మేను, వొంగ నలిరేఁగి పాండవ–పుంగవుండు
మత్స్యనృపనందనునిబలు–మాటతోడి, యేపు సెవికిని జూడ్కికి–నింపు నొసఁగ.

క. మేదురదీర్ఘతరం బగు, నాదం బెడ తెగక గుణము–నను వడి నిగుడం
గోదండము సంతతవల, యోదాత్తస్ఫురణ వెలుఁగు–చుండఁగ నేసెన్. 41

మ. ఒకమాత్రన్ వితతప్రసారనిబిడా–త్యుగ్రాస్త్రసంతానముల్
సకలానీకములందుఁ బర్వ నరుభా–స్వన్మూర్తి శోభిల్లె దీ
ప్తికలాపంబులు లోకమంతటను వి–స్తీర్ణంబులై యాగప
ద్యకృతవ్యాప్తి వెలుంగ నొప్పెసఁగుమా–ర్తాండున్ విడంబించుచున్. 42

క. నరు లోరులు దృశ్యములపైఁ, బరఁగింపఁగఁ జూడ్కు లెట్లు–వడుఁ దప్పక య
ప్పురుసున నరుఁ డేయునిశిత, శరములు లక్ష్యములు దప్పి–చనవించుకయున్. 43

క. గజఘోటకరథసూత,ధ్వజకంకటయోధగాత్ర–తతియం దేచటన్
విజయధనుర్ముక్తశర, వ్రజములు దవులంగఁ బడ క–వారణ నిగుడున్. 44

చ. కవదొన లేల పూనునొకొ–కవ్వడి నా వలదుగ్రసంగరో
త్సవమున సవ్యపాణి నప–సవ్యకరంబున మార్చి మార్చి గాం
డివము ధరింపఁగా శరప–టిష్ఠతయుం బొరిఁ జేయి మార్చి చూ
పు వెరవుతోన వీడ్వడక–పొం దొడఁగూడెడు [3]నెప్డు సూచినన్. 45

క. సమవిషమవినిమ్నోన్నత, సమీపదూరస్థలములు–సదృశములు గఁ [4]జి
త్తముక్రియ నవిహతగతులను, సమరమహిం గ్రీడిరథము–సను నవితథమై.

వ. వెండియు నతండు. 47

మ. బల మెల్లన్ [5]వెఱ రెండుపాయలు గ ఘం–భద్వేగుఁ డై చొచ్చి యా
వలగా నడ్డము వచ్చి నాలువుగ దు–ర్వారోద్ధతిం బోయి మూ
లల నానాశకలాకృతిం బొరయ లీ–లాయానదుర్దాంతుఁ డై
వలయంబుల్ సని చించి చిక్కువఱుచున్–వైకల్యసంపాది యై. 48

వ. ఇవ్విధంబున నంబుధిలోన మహామత్స్యంబు విహరించుచందంబునఁ దదీయ రథంబు గౌరవసైన్యంబునందు సంచరించునయ్యవసరంబున. 49

ఆ. రత్నకేతనములు–రాజితశేఖరం, బులును రుచిరఘంటి–కలును బార్థ
బాణనిహతిఁ దునిసి–పడుఁ గౌరవులచేటు, దెలుప దుల్లు[6]నుల్క–ములునుబోలె. 50

---

1. గ. రోద్ధత. 2. జ. నుద్భటంబుగన్. 3. నేపు. 4. జ. చిత్రముక్రియ నవహిత. 5. జ. వెస.
6. గ. నుల్కా–కలును.

క. నరుభల్లంబుల నగ్రిమ, చరణంబులు ద్రెస్సి మ్రొగ్గు జవనాశ్వంబుల్
కరుణమెయి [1]రాహుతులకుం, శరణం బగు మనుచు మ్రొక్కు చందంబొందెన్.

క. దంతిఘటాసంతానము, కుంతీసుతనారసములఁ గూలినతఱి న
త్యంతనిబిడాభ్రమున దివి, యెంతయు సొంపారుభంగి నిల చెలు వొందెన్. 52

క. పలుపులుఁ గాండ్లుం బగ్గం, బులుఁ దనయస్త్రంబు లడరి పొడిసేసిన వి
చ్చలవిడిఁ బొటెమరథ్యం, బుల నేయఁడు దివిజరాజపుత్త్రుఁడు కృపతోన్. 53

ఆ. అర్జునాస్త్రఖండితాతపత్త్రధ్వజ, చామరములు గాలిఁ జదల దూలఁ
జిహ్నములవిభూతిఁ జెందంగఁ గని యొప్పె, నప్పు డాడుచున్నయట్టు లచట.

క. ఒకమఱి కిరీటికట్టెదిరికి [2]నుఱుమునఁ బోయిరేని రెండవమాఱి
య్యకొనుట కోర్వఁగ లేరై, రొకళ్లుఁ గురురాజుసేనయోధులలోనన్. 55

సీ. మండితధ్వజదండమండలంబులఁ గిట్టి, [3]విటతాటనంబుగా విఱిచి విఱిచి
చటులఖురోద్భటాశ్వశ్రేణిఁ బొదివి ర, యంబునఁ దునిమి తూఁటాడి యాడి
రాజితబహువిధరథసమూహముఁ జొచ్చి, గలిబిలి యగునట్లు గలఁచి కలఁచి
మదభరభీషణమాతంగముల ముట్టి, చిందఱవందఱ చేసి చేసి

ఆ. పటుపదాతిచయముపై రౌద్రరసమహో, గ్రముగ నడరి నేలఁ జమరి చమరి
సవ్యసాచిబాణసంఘంబు మత్తశుం, డాలఘోరలీలఁ గేలి సలిపె. 56

ఉ. శిక్షితచిత్రసంగరవిశేషములం బ్రతిహేతిఖండనా
దక్షత పెంపుసొంపునను దైవబలంబున నత్తఱిన్ సహ
స్రాక్షతనూజుసారథిరథాశ్వచయధ్వజముల్ పరాస్త్రశ
స్త్రక్షతి లేక యొప్పెఁ గురుసైన్యము [4]వెక్కసమంది బెగ్గిలన్. 57

క. తేజోధనుఁ డగునరుఁ డు, ద్భ్రాజితగతి నడుమ మెఱసి బడబాగ్ని దళం
బై జలనిధిఁ ద్రెక్కొనియెడు, నోజం గురుబలము పేర్మి యుడిపెం దోడ్తోన్. 58

తే. కాలపక్వంబు లైనలోకముల జముఁడు, పొరిసమరెడుచాడ్పున మారిమసఁగి
యుగ్రరూపుఁ డై శౌర్యసమగ్ర బాహు, సంపదుద్దాముఁ డగు క్రీడి సంపె రిపుల.

వ. అట్టియెడ మున్ను తురంగమఖురాదులందూలిన కెంధూళియుం బైపయి నేగయఁ బరబలంబు నెత్తుట జొత్తిల్లుచు నుచ్చిచనువివ్వచ్చునిశితశరపరంపరలును సైనికశరీరంబులపై సుడిసి తడిసి రుధిరశీకరనికరవికిరణపరిణతంబగుసమీరణంబును ఘోరాళికరాళరక్తపరిషిక్తవిశ్వంభరా[5]భాగంబును గలయం గెంపుసొంపు సంపాదించియకాలసంధ్యావహించినందదుచితవ్యాపారపారంగతంబులై పొడసూపిన యుడుగణంబులుంబోలెఁ బొలుచుధనంజయసాయకదళితకుంజరకుంభ వికీర్ణమౌక్తికవిసరంబులవలనను సముదీర్ణమదవేగదుర్నివార వారణవిదారణంబులగు నర్జు

1. క. రావుతులకున్. 2. క. నఱుదుగఁ; ఘ. గ్రమ్మనఁ. 3. చ. వీటతాటంబుగా. 4. జ నిక్కలిఁ గంది. 5 క. నభోభాగంబుల.

నాస్త్రపాతంబుల బెదరి తేం ట్లెగయుట పొగ లెగయుటయుం బ్రతిభటబాణ
ఘట్టనంబునం బాండవమధ్యమకాండప్రకాండంబుల నిబిడజ్వాలలు నిగుడుట
మంటయునుగా మూర్తం బగుతదీయక్రోధదవానలంబు ఛటచ్ఛటాశబ్దంబుల
చాడ్పునం జెలంగుచున్నయుధిష్ఠిరానుజాతనిష్ఠురభల్లభజ్యమానబలవదరాతిఖరాస్థి
నిస్వనంబులవలనను దొట్టి తొట్టి యెడనెడ మడువులు గట్టుశోణితంబు నీళ్లు
నందుం బడి తేలాడు వెలిగొడుగులు పుండరీకంబులును, వింజామరలు మరాళ
పుంజంబును నై కొలంకులచందంబు నొంద వాని [1]కెఱఁగెడుకొదమతుమ్మెదపదు
పులపగిదిఁ దొరఁగునాఖండలతనయఖండితపరవీరకాలాయసనారాచశకలంబుల
వలనను గిరీటిశరపాటవపరిస్ఫోటితరిపుకపాలగళితమస్తిష్క[2]పలలపంకంబునను
నలుదెసల నంతంతఁ గడియం జాఁగిపడి యున్నకృత్తకరచరణంబులను వెదపదనికి
రొంపి గలంచి వరుజులు పదిలంబుగా నమర్చిన కేదారంబు తెఱంగు దోఁచుటకు
నీడై చతురహాలికుండుసల్లుపరువంపు మొలకల చెలువునఁ జెల్లుడుల్లుఘల్లునాశుగ
సంతాడనవికీర్ణ శత్రుశేఖరవజ్రవ్రజంబులవలనను సంగ్రామం బభిరామం బయ్యు
ను ఘోరప్రకారం బయ్యె నమ్మహాభయంకరసంకులసమరంబున. 60

చ. ఉఱక విరోధిసైన్యముల ‡ నుక్కుమడంగఁగ నుల్లసద్గతిం
బఱప రథద్విపాశ్వములు ‡ పాండవమధ్యము తేరివీథియం
దఱవఱ లై పడం గని భ‡యంపడి యిద్దెస వచ్చెనేని న
త్తెఱఁ గయి పోమె యంచు [3]నెడ‡తెంపిగఁ గొందఱు [4]వాయఁ బాఱఁగన్. 61

క. వాలమ్ములు దాఁకి ధరన్, వ్రాలుభటులఁజూచి యెడలు‡వడఁకఁగ మేనుల్
దూలఁగ దముఁ దాఁకకయును, నాలము సాలించికొంద‡[5]ఱవలఁ జనంగన్. 62

తే. ప్రొద్దు గ్రుంకిన మఱి కాని ‡ పోవఁడొక్కొ, క్రీడి యని కొంద ఱాజికి‡నీడఁబోవ
బలము నెల్లను దెగటాఱఁ‡బఱపి కాని, తక్కఁడెట్టులుననుచుఁ గొం‡దఱుచలింప.

క. తరతరమ ప్రజలఁ దునిమెడు, నరునప్పటియెత్తికోలు‡నకు సురవిద్యా
ధరఖేచరులును భీతిం, బొరసిరి తమదెసకు నేమి ‡ పుట్టునొ యనుచున్. 64

క. తమతమయొద్దిబలంబులు, క్రమవిరళము లైన దొరలు ‡ గాండివిపై ను
గ్రముగఁ దఱుముటయు నాతఁడు, సమరోల్లాసమున దివ్య‡శరతత్పరుఁ డై. 65

సీ. ఆచార్యు డెబ్బది‡యమ్ముల నాచార్య,పుత్త్రునేడింటఁ గృపునిఁ బదింట
దుస్సహుఁ బండ్రెంట ‡ దుశ్శాసనునిఁ బది, యేనింట సౌబలు ‡ నెనిమిదింట
సమరనదీసూను ‡ నఱువదింటను నేసి, రవిసుతురథ్యసా‡రథుల నొంచి
వర్మమంతయుఁ ద్రుంచి‡వైచి మర్మాస్థిబం, ధములు భేదించి వి‡క్రమము నెఱపి
ఆ. యిట్లు దొరలు నొవ్వ ‡ నేత్తెఱఁ దనచేతి, కొలఁది సూపి క్రీడి ‡ సెలఁగి దేవ

1. గ. కరిగెడు. 2. జ. పటలంబునను. 3. క. నెడతెంపుగఁ; ఘ. నెడ ద్రెవ్వఁగ. 4. గ, ఘాయవాఱఁగన్. 5. క. గ. ఱవుల చనంగన్.

దత్తమొత్తుటయును దత్సైన్యములు సెడ, విఱిగి పాఱె భీష్ము మఱువుసొచ్చె.

క. గాంగేయుఁ డవష్టంభో,త్తుంగతనుం డగుచు నిట్లు దూలినకురుసే
నాంగంబులఁ బురికొలిపి సు,సంగతములు సేసె సమరసమ్ముఖములుగాన్. 67

వ. ఇట్లు భగ్నబలసమాశ్వాసనోద్భాసియగు భీష్ముభుజబలంబుప్రాపున మాతంగతురంగస్యందనసందోహంబులతోఁ గుంభసంభవకృపాశ్వత్థామకర్ణవికర్ణప్రముఖనిఖిలయోధజనంబులు సుయోధనుముందటఁ బన్ని నిలిచినం జూచి సవ్యసాచి ప్రత్యేకప్రధనకుతూహలాయత్తచిత్తుం డగుచు నుత్తరున కిట్లనియె. 68

ఉ. కందము లప్పళించి తురగంబుల నించుక నిల్పు వైరిసే
నం దెలియంగఁ జూడుము ఘనప్రకరంబునుబోలెఁ గాఱుకొం
చుం దఱచైనదంతిభటసుందర కేతనరాజి గ్రాలఁగా
[1]ముందట నిల్వఁ గట్టెదిరి మోహార మున్నవిధంబు గాంచితే. 69

ఆ. కర్ణు కేతనంబు గ్రాలెడు నల్లదె, యాతఁ డాజికేళికౌతుకమునఁ
గడఁగి వచ్చుటయును గలిగియున్నదిమున్న, తొడరవలయు నతనితోడ మనము.

వ. అని మఱియును. 71

చ. రయమునఁ గిట్టి యాతనిపరాక్రమలీల యడంచి నొంచి దు
ర్జయుఁ డని నమ్మియున్నకురురాజునకున్ వగ పుట్టఁ జేసెదన్
హయములఁ బోవ నిమ్మనుడు నాతఁడు నాతనిలావు నచ్చిని
ర్భయమునఁ దేరు [2]వోఁ బఱపె భాస్కరసూతికి సమ్ముఖమ్ముగన్. 72

—♦ అర్జునుఁడు చిత్రాంగదప్రభృతికురుకుమారుల నిర్జించుట. ♦—

వ. ఇవ్విధంబున వృషభంబున కాదికొనుబెబ్బులియునుంబోలె రాధేయుదెస నడచు కవ్వడిం గని చిత్రాంగదుండును జిత్రరథుండును సంగ్రామజిత్తును దుష్ప్రహుండును జిత్రసేనుండును వివింశతియును దుర్ముఖుండును దుర్జయుండును వికర్ణుండును శత్రుంతపుండును దుశ్శాసనుండును లోనుగాఁగల కురుకుమారవర్గంబు నిరర్గళప్రకారంబు లగురథచిత్రప్రచారంబులు మెఱయ మొనకుం దలకడచి చటులపటుబాణవేణికాపరంపరలు నిగుడ నొక్కపెట్ట కవిసిన నతండును గుణధ్వనితంత్రీనాదంబుగా నావిండ్లవా రొత్తుకాఱుగా గాండీవంబు వీణెగా వినోదంబు సలిపె నట్టియెడ వికర్ణుండు. 73

క. తలమీఱి నిశితశరమం,డలిఁ గప్పెం బార్థు నుత్కటక్రోధమునన్
విలు విఱుగ నేసి యతనిం, దొలఁగంగాఁ జేసె నరుఁడు దోర్బలలీలన్. 74

క. ఇంతయుఁ గనుఁగొనియును శ,త్రుంతపుఁ డోసరిల కాజి దోహల మలరం
గౌంతేయుతోడఁ దలపడి, వింత లయినకూర్మనఖరవిశిఖము లేసెన్. 75

వ. అర్జునుండును.

1. క. ముందర నిల్చి కట్టెదిరి.; జ. ముందర గట్టిమై నిలిచి, 2. క. జ. వే నడపె,

క. సూతుఁ బదింటను నైదిట, నాతనియంగంబు నొంచి ౹ యంత నిలువమిన్
శాతఘనశరము వే కొని, యాతల వెడలంగ నేసి ౹ యసువులఁ బాపెన్. 77

తే. ఇట్లు శత్రుంతపునిఁ ద్రుంచి ౹ యివ్విధమున
నొక్కఁ డొక్కఁడ తలపడు ౹ టుడుపఁ దలఁచి
వివిధబాణపరంపర ౹ వెల్లిగొలిపె
భయరసమువఱ్ఱుపెట్టునఁ ౹ బగఱు వాఱ. 78

క. అందఱు రథికులు పఱవఁగ, నిం దేటికి మున్ను వచ్చి ౹ [1]రిస్సీ యని సం
క్రందనసుతు మాఱ్కొనియెఁ ద,గం దెగిసంగ్రామజిత్తు ౹ గర్వోద్ధతుఁడై. 79

క. తలపడి వాలమ్ములు పై, నల వేర్పడ నిసుచుటయును ౹ నలుక వొడమినం
దల దునిమివైచె నాతని, బలసూదనసూనుఁ డొక్క ౹ పటుభల్లమునన్. 80

తే. అపుడు రాధేయుఁ డిమ్మెయి ౹ ననుజుపాటుఁ, జూచి యేనుంగునకు సిల్లు ౹ సూపినట్లు
గవిసి హయములమత్స్యభూ ౹ కాంతుతనయు, నేసి పండ్రెండుశరముల ౹ నేసె నరుని.

ఉ. కేసరివిక్రముండు కపి ౹ కేతనుఁ డత్తఱి వైరివీరసం
త్రాసకరప్రకార మగు ౹ దర్ప మెలర్పఁగ బాణజాలవి
న్యాసమునన్ వెసం బొదివె ౹ నర్కసుతున్ గరుడుండు పాము ను
ద్భాసితపక్షుఁడై పొదువు ౹ భంగి సురావలి పిచ్చలింపఁగన్. 82

క. ఇరువురు వీరులు నిట్లొం, డొరువులఁ దలపడుట సూచి ౹ యుత్కట మగున
చ్చెరువాటుఁ గౌతుకంబు న,డర నూరక యుండె నయ్యె ౹ డం గురుసేనల్. 83

మ. ప్రళయాంభోధరముక్తసాంద్రవిసర ౹ త్పాషాణవర్షంబు మి
క్కిలి యై శైలముఁ గప్పునట్లు నరున ౹ క్షీణాస్త్రసంతాన మి
ట్టల మై కప్పినఁ దీవ్రమారుతము గా ౹ ఢవ్యాప్తిజీమూతమం
డలిఁ బోలెన్ విరియించె భానుజుఁ డవ ౹ ష్టంభోజ్జ్వలాకారుఁడై. 84

క. విల్లును దానును శిఖ రా, జిల్లఁగ వెలుఁ గొందు వహ్ని ౹ చెలువంబున శో
భిల్లుట గని కురుసైన్యము, లెల్లను దూర్యములు మ్రోయ ౹ నేత్తెఱఁ జెలఁగెన్. 85

క. రవితనయుబాణములు వా,సవనందనుఁ బొదివినపుడు ౹ సంతోషముఁ ద
ద్వివిధాస్త్రము లాతనిపైఁ, గవియ విషాదంబు నొందుఁ ౹ గౌరవసేనల్. 86

వ. ఇవ్విధంబున నేట్లాడుచుం గదిసి గాండివి కర్ణున కిట్లనియె. 87

ఆ. సభలఁ బలుకు దీవు ౹ సరి లేరు నా కని, యిదె రణంబు వచ్చె ౹ నెల్లవారి
కెఱుఁగవచ్చు దీనఁ ౹ బెఱచోట రజ్జైన, యట్లు పూరగింప ౹ నగునె యిచట. 88

క. మాటలు పెక్కాడితి వీ,పోటుమగలు వినఁగ నింకఁ ౹ బోవుట దగ దె
ప్పాట నది గాక తమ్ముని,పాటును గన్నారఁ గంటి ౹ పాఱకు మింకన్. 89

1. క. తిస్సీ.

ఆ. పలుకవచ్చుఁగాక పలికినయట్టుల, చేయవచ్చు నెట్లు దాయ యెందుఁ
బోయెదట్లు ద్రుపదపుత్త్రికఁ బఱుపంగఁ, గాంచి నగినఫలముఁ గందు గాక. 90

క. ఏ నపుడు ధర్మపాశా,ధీనుఁడ నై కోపమునకు దీకొనరింపం
గా నేరకున్న మెయిమెయిఁ, బోనయ్యెం గాక యింకఁ బొమ్మా యిచటన్.

వ. అనిన విని రాధేయుం డి ట్లనియె. 92

ఉ. అప్పుడు ధర్మహానికి భయంపడి నిల్చితివో కడంకతో
నిప్పుడు వచ్చినాఁడ విట యెల్లను జేయుదుగాక యన్నపైఁ
దప్పు ఘటించి నీవు నొకతాలిమి గల్గినవాఁడ వై నెపం
బొప్పినఁ జెల్లె [1]నీదునిలుపోపును జూతము గాక యిచ్చటన్. 93

క. సమయంబు నడపినను రా,జ్యముభాగం బీరె యిట్లు నను నాస నర
ణ్యమున వసించితి గాక ని,జమునకు నీయందు ధైర్యసారము గలదే. 94

క. మును నీ వచట నచటఁ జే,సినబంటుతనంబు లెల్లఁ జెప్పఁగ విందుం
గనినఁ గదా నమ్మెదు నవి, యనుమానము నాకు నీభయస్థితిఁ గనుటన్. 95

—♦ కర్ణార్జునద్వంద్వయుద్ధము ♦—

వ. అనుచు వాలమ్ములు గురిసిన నర్జునుండును బ్రీతుం డై గాండీవవిక్షేపక్షోభిత
నభోభాగుం డగుచుం గానీనుపై నానానిశితవిశిఖంబులు నినిచె న ట్లయ్యిరువురును
దేవాసురసంగ్రామసాదృశ్యవిక్రమప్రక్రియం బొలిచి రట్టిసమయంబున. 96

క. రవిదీప్తులు సొర నేరమిఁ, గవిసెం జీఁకట్లు పవనగమనం బడఁగెన్
వివిధాస్త్రంబుల నంబర, మవిరళముగఁ బొదువఁబడుట నద్భుతభంగిన్. 97

ఉ. అప్పుడు కర్ణసైన్య మమరాధిపనందనుఁ జుట్టు ముట్టఁ దే
రుప్పరవీథి మై వలయ మొప్ప వెసం బఱపించి క్రీడి పెన్
గుప్పలుగా రథావలిని ఘోటతతిం గరిరాజిఁ గూల్చుచుం
దప్పక భానుసూనుమెయి దాఁకఁగ నేయుచు నుల్లసిల్లినన్. 98

వ. రాధేయుండును. 99

క. తఱిమి పయి నడరుటయు విలు, విఱుగంగా నేసె నరుఁడు విక్రమలీలం
గొఱఁతవడ నీక కర్ణుఁడు, మెఱుఁగు లడరుశక్తి సురలు మెచ్చఁగ వైచెన్.

ఆ. వైచుటయును సవ్యసాచియుఁ గొరవుల్, విస్మయంబుతోడి వెఱపు వొంద
నధికరయము మెఱయ నది పెక్కుదునియలు,చేసె నంతరమున శితశరముల.

వ. అట్టియెడ నినతనయు మన్నించుజోదులు దెగి పయిం బడిన గ్రోధారుణనయన
పల్లవితంబును దంతకాంతిస్తబకితంబును గుంభస్థలఫలితంబును నగుతదీయకరటి
ఘటావికటవిటపిపటలంబు నాత్మీయవిశిఖవ్యాపారమహావాతంబునన్ బడలువడం
గూల్చి చండమూర్తి దాల్చి శోభిల్లుబీభత్సుం గని యతండు బొమముడి

1. గ. నీనిలువునోపును.

నెక్కొన వేఱొక్కవి ల్లెత్తికొని. 102

క. తురగముల నాలుగిట ను, త్తరు నాఱిట నెనిమిదిట ర§థముఁ బదిటను వా
నరు నఱువదిశరముల న, న్నరునంగంబులను బెలుచ § నాటఁగ నేసెన్. 103

వ. ఇ త్తెఱంగున. 104

సీ. రోషంబు భీషణ§రూప మై చెలు వొంద, నతుల కేతువు శిఖ § యై వెలుంగ
శరజాలములు పటు§జ్వాలలై నిగుడ న,ర్కతనూభవోగ్రాగ్ని § ప్రజ్వరిల్లు
నుద్ధతి సైఁపక § యుజ్జ్వలదివ్యప, తాక మెఱుంగు గా§ దళితధరణి
రథనేమిరవము గ§ర్జనముగ శరపరం,పరలుధారలు గాఁగఁ § బరఁగి యడరె

ఆ. నర్జునాంబుదం బ§నన్యసామాన్యస, ముద్యమమున ముఖప§యోరుహముల
కాంతి దఱిఁగి యపుడు § కౌరవసేనాస,రోవరంబు దీన§భావ మొంద. 105

క. వెండియు నుడుగక రవిసుతుఁ, డొండొండ నిశాతసాయ§కోత్కరము సము
ద్దండతఁ బై నించిన నా,ఖండలనందనుఁడు గెంపుఁ § గనుగవఁ గదురన్. 106

క. శిరము లలాటంబును గం,ధరమును బాహులును నురము § దండడి వ్రయ్యన్
గిరిపైఁ బిడుగులు దొరఁగెడు,పరుసున దృఢదీప్తశాత§భల్లము లేసెన్. 107

క. అఱిముఱి నంగము లెల్లను, నుఱుముగ ని ట్లడరునర్జు§నునియమ్ములకున్
వెఱచఱచి సూతపుత్త్రుఁడు,పఱచెఁ బుడమి యద్రువ మత్స్య§పతిసుతుఁ డార్వన్.

వ. ఇట్లు కర్ణుండు గయ్యంబు విడిచి పాఱినఁ బార్థుండు దేవదత్తంబు పూరించి యు
త్తరున కిట్లనియె. 109

క. వీఁ డొకఁడు కురుబలంబున, వాఁడిమగం డనఁగఁ జాలు§వాఁ డిబ్భంగిం
బోఁడిమి సెడియెను ద్రోణుల, వేఁడిమి యిట మనకు మునుము§విక్రమమునకున్.

వ. అనుచు వీరావేశంబునఁ గౌరవానీకంబు నాలోకించునప్పు డుత్తరుండు. 111

ఉ. వెక్కసపాటు భీతియును § విహ్వలభావము నొంది యిట్లను
న్మిక్కిలి యైనశౌర్యమును § నిర్భర తేజము నంత కంత కి
ట్లెక్కుడులావుఁ జూచి మది § యెంతయు బెగ్గిలె మేలు చేష్టలం
దక్క నశక్యమిం కిట ర§థవ్యవహారము నిర్వహింపఁగన్. 112

ఆ. [1]పుట్టినంతనుండి § యిట్టివి యెన్నఁడుఁ, గాన నెందు నట్లు § గాన చోద్య
మంది యంతరంగ § మవశతఁ బొందిన,కతన నింద్రియముల§కడఁక దక్కె. 113

తే. అనినఁ గొండొకనవ్వొల§యంగఁ జూచి, యింద్రనందనుఁ డాతని § కిట్టులనియె
నేను గలుగంగ నీ కేమి§యెలమి వాహ,నముల కుబ్బుగ సంచోద§నంబు సేయు.

క. అనుటయు నాతఁడు దగ నూ,ల్కొనినం దా నుదితనినద§కోదండుం డై
యనితరసులభోద్యమమున, ధనంజయుం డిట్టు లను న§తనితో మఱియున్. 115

1. క. 'పుట్టినంతనుండి•యిట్టిది యెన్నఁడుఁజూడ నట్లుగాన•చోద్యమంది. యంతరంగమిప్పు•డవశతఁ బొందిన'.

క. అరుణాశ్వంబులఁ బూనిన, యరదంబున వీఁడె నిడుపు లగుచేతులు బం
ధురకంధరంబు వెడలుపు, టురమును నై ద్రోణుఁ డొప్పె నుత్తరకంటే. 116

వ. అని చూపి వెండియు ని ట్లనియె. 117

ఆ. సకలకురుకుమారచాపశిక్షాచార్యుఁ, డాజిదుస్సహుండు సాంగ వేద
వేది నీతిశాస్త్రవిదుఁడు దివ్యాస్త్రకో,విదుడు సుజనహితుఁడు విమలబుద్ధి.

వ. అని యగ్గించి. 119

క. తనతనయుకంటె నెమ్మన,మున నాకుం గూర్చు భావమున గురులకు మా
ర్కొనియెదము రాచధర్మం, బునకీడునఁజేసి యింత పుట్టఁగవలసెన్. 120

చ. ఎదురుగఁ బోవ నిమ్ము రథ మీతని తేరికి నన్న నాతఁడుం
బదిలముతోడ రథ్యములపగ్గము లేత్తెఱ నూలుకొల్పియు
న్మృదగతి నట్ల చేసిన నమానుషవిక్రముఁ డైనద్రోణుఁడుం
గదిసి యిభం బిభంబుఁ జెనకం జనుదెంచినలీల వచ్చినన్. 121

వ. నరుఁడు నమస్కరించి గురున కి ట్లనియె. 122

క. అడవులఁ బెద్దయుఁ గాలం, బిడుమలఁ గుడిచితిమి మాకు నిది దఱి యని యి
ప్పుడు వచ్చితిమి విపన్నుల,యెడఁ గృపసేయుటయ లెస్స యీరలుగకుఁడీ.

—♦ అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధంబు సేయుట. ♦—

క. మును వెఱతు నేయ మీరలు, నను నేసినఁ గాని యనుఁడు నాకేశసుతుఁ
ధనురాచార్యుం డిరువది, సునిశితబాణముల నేసెఁ జూపఱు వొగడన్. 124

ఆ. అర్జునుండు వాని నన్నిటి నడుమన, తునియ నేయుటయును ద్రోణుఁ డడరి
శతసహస్రసంఖ్య శరములు గప్పిన, నతఁడు నతనిఁ గప్పెఁ బ్రతిశరముల.

చ. అతిరథు లస్త్రశస్త్రవిదు లద్భుతబాహుబలుల్ పరాక్రమో
ర్జితయశు లిట్లు దాఁకి గురుశిష్యులు గౌరవసేనలోనిభూ
పతిసుతకోటికిన్ వెఱఁగుపా టొనరించిరి బాణజాలసం
వృతగగనాంగణం బగునవీనమహాహవ[2]విభ్రమంబునన్. 126

వ. అట్టియెడఁ గురుసైన్యంబుజనంబులు. 127

క. నరుఁ డొక్కరుండు దక్కఁగ, గురుఁడు గడగినపుడు మాఱుకొనఁ జాపధరుం
డొరుఁడు గలఁడె మఱి వెదకిన, హరుఁడు గలం డింకఁగలుగు నసరా దెందున్.

క. ద్రోణుఁడు రయమున నేసిన, బాణము లెడ తెగక యొక్కబాణమపోలెన్
శ్రేణి యయి వోవఁ బార్థుఁడు, రేణువు గావించుఁ గంటిరే చిత్రగతిన్. 129

క. గురుశరములు సితపక్ష,స్ఫురణంబున నంచపిండుపోలువు వహించెన్
నరుబాణతతి ఘనావలి,కరణి మిగుల నొప్పె నల్లగఱులచెలువునన్. 130

వ. అనుచుం గనుంగొనుచుండ. 131

1. క. చాపమున. 2. జ. విక్రమంబునన్.

శా. శ్రావ్యంబై చెలఁగన్ గభీరమధురజ్యానాద ముద్దామవీ
రవ్యాపారనిరూఢతం బ్రతిశరారంభంబు మర్దించుచున్
సవ్యప్రౌఢిదృఢాపసవ్యగతి నాశ్చర్యంబుగా నేయుచున్
దివ్యాస్త్రంబులఁ బోరి రిద్దఱును సాదృశ్యం బదృశ్యంబు గన్. 132

వ. ఇంద్రాగ్నివాయువరుణదైవత్యంబు లగుశరంబులు గురుం డేసిన నరుండును దత్త
ద్దేవతాకంబు లగునంబకంబులఁ బ్రతిహతంబులు సేయుచు వచ్చె నయ్యిరువురుఁ
బెల్లేయుసాయకంబు లంతరిక్షంబున దలంబై సంతమసంబు గలిగి యునికి
నేబాణం బెక్కడఁ బాఱుటయుం దోఁపకుండె నట్టియెడఁ గుంభసంభవుబలంబు
సరభసంబుగా నతని కడ్డంబు సొచ్చిన విజయుండు వ్రేల్మిడిం బొడిసేసి సకే
యూరంబు లగుబాహుదండంబులను సకుండలము లగుకర్ణపాశంబులను సకిరీ
టంబు లగుశిరోభాగంబులను భూభాగం బలంకరించి యప్పు డావహిల్లినరుధిర
సాగరంబునకురత్నాకరత్వంబలవరించె నిట్లు దుర్జయుండగునర్జునుండు సైన్యంబు
దైన్యంబు నొందించుచు నాచార్యునకు భరంబుగ నేట్లాడు చున్నం జూచి
యతండు విస్మితుం డై. 133

క. అర్జునుని నాహవంబున, నిర్జింపఁగ నగునె ఫాలనేత్రున కైనం
బర్జన్యసుతుఁడు శరవ, ర్షోర్జితమూర్తి యగుటరయ నుచితమ కాదే. 134

వ. అని మఱియును దగినపలుకుల నగ్గింప నిలింపనికరంబు. 135

తే. ఇంతప్రొద్దు కిరీటికెట్టెదుర నిలువ, వెఱవ కున్నప్డు ద్రోణుండ వింటివాఁడు
నల్లవో తనయున్న సేనకు నొకండ, బలిమిఁ దలమీఱునే యిట్లునిలువవలదె.

మ. అను చుండం ద్రిదశేంద్రసూనుఁడు రయం బత్యంతఘోరంబుగా
ఘనశాతోజ్జ్వలదుర్నివారవిలసత్కాండంబులన్ ద్రోణువా
హనసూతధ్వజదేహముల్ వొదివె నిట్లస్త్రాబ్ధినిర్మగ్నుఁ జే
సిన హాహానినదంబు లొక్కమొగిఁ బేర్చెన్ సర్వసైన్యంబులన్. 137

క. ఈమెయి నిజజనకుభుజో, ద్దామబలము దోడుతోడఁ దఱుఁగుటయు రథ
స్తోమంబుఁ దాను నశ్వ, త్థామ వెసం దాఁకెఁ బాండుతనయునితోడన్. 138

—♦ అర్జునుఁ డశ్వత్థామతో యుద్ధము సేయుట ♦—

చ. అతఁడును దీవ్రబాణముల నాతనిఁ గప్పుచు మాఱుకొన్న నా
శతమఖవృత్రసంగరముచందము దోఁచె వడిం జటచ్ఛటా
యితరవ మప్డు వేణువుల నేర్చుదవానలు మోఁతభంగి ది
క్తతిఁ బరఁగెన్ మహాద్భుతము కౌరవసేనకు నావహిల్లఁగన్. 139

వ. అట్టియెడ. 140

చ. ఉఱక నరుండు ద్రోణసుతుయుగ్యములన్ వెస నొంచె నాతఁడుం
డెలిపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబున నారిఁ ద్రుంచి క

న్గిఱిపినమాత్రలోన నత§నిం బటుబాణచతుష్కయుగ్మ మే
డ్తెఱఁ దొడి మార్వి గ్రమ్మఱ ఘ§టించునెడఁ వడి నేసి యార్చెనన్. 141

క. కురుసేనలోన ని ల్లై, వ్వరుఁ జేసిన వారు లే ర§వార్యభుజావి
స్ఫురణోదగ్రుండు గదే, గురుపుత్త్రుం డనుచు నమర§కోటి నుతించెన్. 142

చ. చిఱునగ వొప్ప గాండివము § సెచ్చెర సజ్యము సేసి సేన లు
క్కఱ రభసంబుమై నడరెఁ § గవ్వడి ద్రౌణియు నీడఁబోక య
త్తఱిఁ దఱుమంగ నస్త్రములు § దందడి [1]మార్కొని మండు చుండెఁ [2]జి
చ్చఱపిడుగుల్ వడిం దొరఁగు§చాడ్పున నంబరవీథి నుగ్రమై. 143

వ. ఇవ్విధంబున [3]ధనంజయుం డేయువేగంబున నేయుటయు ద్రోణతనయుతూణీరంబులు శరశూన్యంబు లయ్యెఁ దనతూణీరంబు లక్షయబాణంబు లగుటం జేసి యంతకంతకు నతిశయిల్లుపెల్లున నేయుచు నధికుం డగునప్పాండవమధ్యముం గనుంగొని కృపాచార్యుండు చెంగటం దల మీఱిన. 144

—* అర్జునుఁడు కృపాచార్యునితో యుద్ధము సేయుట *—

క. గురుపుత్త్రునిరథము విడిచి, సరభసముగ నందు సవ్య§సాచి గవియుడుం
దిరమై యాతఁడు శితశర,పరంపరలు గురిసె నుగ్ర§బంధుర [4]గతులన్. 145

వ. పాండుపుత్త్రుండును జిత్ర[5]సంచారంబుల మెఱయుచు. 146

క. పటువిశిఖపం క్తి[6]యత్యు,త్కటరయమున నిగుడఁ జేయఁ§గా నవ్విధ మూఁ
దట యైన మండె దీప్తో,ద్భటభంగిఁ గృపానలంబు § బలములు వొంగన్. 147

వ. ఇట్లు[7]మండిశిఖిఁబోలెడికనకలి ప్తఘనబాణంబు వనచరకేతువుందాఁకించి వేఁడిమి సూపి వివిధాస్త్రజ్వాలలు గవియించి దిక్కులు సెలంగ నార్చినం గోపంబున నాటోపంబు మిగిలి బలసూదనసూనుం డతనికేతనంబు దునిమి తరణికిరణానుకారపారంగతంబు లగునారాచంబులు దదీయాంగంబుల నినుపం దొడంగిన రథరక్షకు లగుచంద్రకేతుండును జిత్రాశ్వుండును మణిమంతుండును మంజుమాళియు హేమవర్మయును సురథుండును సుషేణుండును నరిష్ణుండును సుకేతుండును నుక్కు మెఱయ నొక్కటం దాఁకిన. 148

ఆ. అన్ని వెడఁదవాతి§యమ్ము లద్భుతముగ, నొక్కముష్టిఁ దొడిగి § గ్రక్కనంగ
నతఁడు లీలఁ దునిమె§నందఱతలలును, ఘోరభంగి రక్త§ధార[8]లెగయ. 149

సీ. తునిమితోడన యొక్క§సునిశితశరమునఁ, గాఁడియు రెంట నక్షములఁ ద్రుంచి
హరుల నాల్గిటఁ జంపి § యాలంపుగోలతో, నొగలు మూఁడమ్ముల § నుగ్గుసేసి
ధనువును సూతుని§తలయుఁ జెఱొక్కట, నఱికి లోచనముల § నవ్వు నెఱయఁ

1. క. దార్కొని. 2. గ. 'జిచ్చఱపిడుగుల్ వడిందొరఁగుచొప్పున' అనియొకప్రతిపాఠము. 3. క. 'ధనంజయురయంబు సెనయువేగంబున సేయుద్రోణతనయు'. 4. క. భంగిన్. 5. గ. ప్రచారంబుల. 6. గ. యుం దుత్కట. 7. చ. 'మండెడుశిఖిపోలెఁ గనలి దీప్తఘన'. 8. క. లులియ.

క. మీరలు ధర్మజువర్తన, గౌరవ మెఱుఁగుదుర కాదె § కావున నా గాం
ధారీతనూభవులకును, వీరలకును హితముగా వివేకప్రౌఢిన్. 10

తే. ధర్మమార్గంబు దప్పక § తలఁపుఁ డొక్క-, తెఱఁగుధర్మువు దప్పి యుధిష్ఠిరుండు
వడయ నొడఁబడఁ డయ్యింద్రపదవి యైన, నుచితగతి నెంతవడసిన § నుల్లసిల్లు.

వ. కావునఁ బాండవులకుఁ బితృధనం బగురాజ్యంబు [1]కపటద్యూతంబున దుర్యోధనుఁ డపహరించుటయు నది వీరలు దిగ్విజయంబుఁ జేసి యలవరించికొన్నపదం బగుటయు ధర్మసూనుమహానుభావంబు విచారింపక ధార్తరాష్ట్రులు పరిభవించినం దెగి యితండు వారలకుం గీడు సేయ రోయమియు నీరెండుదెఱంగులవారికిం బంచి కుడువం దగుటయుం దలపోసి తగినకార్యంబు సెప్ప నర్హులరేనును నాకన్నంత సెప్పెద వినుండు. 12

క. కుంతీతనయులు సమయము, శాంతతమై నడపి తమభుజాబలమును దు
ర్దాంతోద్యమశౌర్యము నెఱిఁగింతు మనుచు నున్నవారు § గినుకెదఁగదురన్.

క. వీరితలం పెఱిఁగిన గాం,ధారీతనయుఁడు సుహృద్వితానముఁ గూర్చుం
బోరఁ బరిమార్తుఁ గొంచెపు, వారై యున్నెడన యని యవశ్యముఁగడఁకన్.

క. అలఘుబలవిక్రమోదా, త్తుల కైనను బలము లేక § దోర్గర్వముమై
గెలువఁగ వశమె సహాయము, కలిమి ననంతంబు లగుపగఱసైన్యములన్. 15

క. కావునఁ బాండవపక్షము, భూవల్లభకోటి యిచటఁ § బ్రోవగు నిమ్మై
నీవీరులు నావీరులు, దేవాసురులట్ల యనికిఁ § దెగుదురు కడిమిన్. 16

వ. ఇది యిక్కడి తెఱంగునకుఁ దోఁచినతలం పక్కడివారిచిత్తవృత్తి యెట్టి దగుట యెఱుంగ మెదిరి[2]మతం బెఱుంగక యెట్టికార్యంబు నిశ్చయింప [3]నెర వగునే కావున నియ్యవసరంబునం దగినమానిసి నందులకుం బుచ్చవలయు దుర్యోధనుండు వీరికి రాజ్యంబుపా లిచ్చిన మే లగుఁ గాక తక్కిన నప్పటికిఁ బోలినపని సూచుకొంద మని పలికిన విని బలరామదేవుం డియ్యకొని రాజలోకంబు నాలోకించి యి ట్లనియె. 17

క. హరివాక్యము వింటిరె యది, యిరుదెఱఁగులజనములకును § హితమును ధర్మో
త్తరమును నై యున్నది యీ, వెరవున శక్యంబు మనకు § వీరలఁ దీర్పన్. 18

చ. తమసగఁబాలు గోలుపడి § దానిన యిప్పుడు గోరువీరికిన్
సముచితవృత్తి నిచ్చి తమసామున సంతస మంది యున్కి యు
క్తము ధృతరాష్ట్రసూనునకు § దాన నపాయము లేక యుండుఁ గో
ప ముడిగి వీరు సేయుదురు § బాంధవ మిజ్జగముం బ్రియంపడున్. 19

వ. కావున [4]నిక్కార్యం బెడసేయక యొక్కరుం బనుపవలయు వాడునుం జని యభిమతంబు సాధించునప్పుడు. 20

1. క. కపటంబున. 2. జ. తల్లం పెఱుం, 3. క. నేరనగునే. 4. క. నిక్కార్యంబున కెడ.

ఆ. మాటపొం దెఱింగి । యోటమై నల్లన, చేరి కౌరవేంద్రు । చిత్తవృత్తి
కనుగుణంబు గాఁగ । నానతుం డగుచుఁ బ్రార్థించి యడుగకున్నఁ । దెఱఁగుపడదు.

వ. అది యెట్లనిన ధర్మనందనుం డతనియుద్ధతికిం బుయిలోడి మెయివడి గలనడవడిం బ్రవర్తిల్లుచుండియు జూదంబువెంట మోసపోయి తొడరి చిక్కనం బడియె నది యును నతం డక్షవిద్యాపాటవంబు దనకు మిగుల లేమిం జేసియు బంధుజనంబులు దన్ను వారించుటయుఁ దా నాడుటమాని గాంధారరాజు నియమించినం దత్కళా కౌశలంబునం బరిణతుండుగావున నాశకుని యాడి యుధిష్ఠిరుం డొడ్డినయొడ్డమియు గెలుచుచు[1] వచ్చినట్లగుట నాతనియందును గొఱంత లే దిత్తెఱంగున వార లధర్మపరు లని నిందింపరా కునికి కారణంబుగా వీరలు పుచ్చినమానిసి వినయం బుతోన యిక్కార్యంబు దీర్చికొనిరావలయు ననిన సాత్యకి కోపించి యిట్లనియె.

—♦ సాత్యకి దుర్యోధనుకడకు దూతం బంపఁగూడ దని చెప్పుట ♦—

ఆ. ఇట్టు లాడఁ దగునె । యిది నీక పోలు ని, న్నే మనంగ నేర్తు । నిత్తెఱంగు
పాడి గాఁగఁ బూని । పలుకంగఁ [2]జెవి యొడ్డి, యాదరించువారి । నందుఁగాక.

క. వేడుక పుట్టినజూదం, బాడెనె ధర్మజుఁడు వార । లందఱుఁ దమలోఁ
గూడికొని పిలిచి బలిమిన, యాడి కపటజయము గొనుట । యది దగ వగునే.

క. ధర్మతనూభవుఁ డెస దు, ష్కర్మము రూపించి సభ నొ । కండును మైమైఁ
బేర్మి సెడక పోనేర్చునె, ధార్మికు లిం కెట్టివారు । తథ్యం బరయన్. 25

చ. పలికినచందముల్ నెఱపి । పైతృకమై చనురాజ్యభాగ మి
మ్ములఁ బడయం దలంచి బల । ముం జలమున్ నెఱపం గడంగు వీ
రలు నొరు వేఁడఁ బోదురె య । రాతులు సాధుల మెత్తురే రణం
బుల జయలక్ష్మిఁ జేకొనుటఁ । బోలునె యొండొకరాజధర్మముల్. 26

తే. సముచితము లగుమాటలఁ । జక్కఁబడక, తక్కెనే నుక్కివుం డగు । ధార్తరాష్ట్రుఁ
గ్రూరశరముల నే నియ్య । కొలుపువాఁడ, నవనిఁ గౌంతేయులకు నిచ్చు । నట్లుగాఁగ.

క. భీమార్జునులకు రణమున, నేమగలును బ్రతియె వీరు । నేనును సైన్యో
ద్దాములమై నడచిననే, భూమీశులు నెదిరి బ్రదికి । పోవం గలరే. 28

ఆ. కవలవారుఁ గొడుకు । గమియుఁ బాంచాలవ, ర్గంబు వృష్ణివరులుఁ । గడఁగిరేని
నొక్కమాత్రలోన । నువ్వెత్తుగొనరె దు, ర్యోధనాదిశతము । నుద్దవిడిన. 29

క. ఈమత్స్యపతి [3]సహాయము, గా మాకుం దీర్ప రాని । కార్యము గలదే.
సామాద్యుపాయపరుఁ డు, ద్దామభుజాబలయుతుం డి । తఁడు కేవలుఁడే. 30

క. నామతమునఁ గార్యము సం, గ్రామము సేయుటయ యిట్లు । గాకీలోనన్
సామవచనంబు లక్కఱు, భూమీశ్వరుతోడ నాడఁ । బుచ్చెద రేనిన్. 31

---

1. ఆ. వచ్చెనట్లగుట. 2. క. జెవు లొడ్డి...శౌరి, గ. జెవి యొగ్గి...శౌరి. 3. చ. జ. 'సహాయుఁడుగా.'

ఉ. దైన్యము దక్కి దూత యుచితంబుగఁ బొందు నృపాలుపాలు రా
జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెడు నన్న లోకసా
మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొంద మ
న్యోన్యవిరుద్ధభాషణము లాడినఁ దత్ఫల మాతఁ డందెడున్. 32

వ. అనిన ద్రుపదుం డిది వోలు బలదేవుమాట [1]మాట గాదు బలవిక్రమ
వంతుండును సహాయసంపన్నుండును దుష్టాత్ముండును నైన దుర్యోధనుండు ప్రియ
వచనంబుల రాజ్యంబుపా లిచ్చుట కియ్యకొనమి సిద్ధంబు యుద్ధంబునంగాని
చక్కంబడఁ డని పలికి మఱియు నిట్లనియె. 33

క. మృదుభాషణముల దుర్జన, హృదయములు ప్రసన్నతామహిమఁ బొందునె యె
ల్లిదముగఁ గొని యంతంతకుఁ, మద మెక్కుంగాక దురభిమానము పేర్మిన్.

వ. అదియునుం గాక. 35

తే. కూటికై ద్రోణభీష్ములు గుమతి యనక
యనుసరింతురు ధృతరాష్ట్రుఁడును దనూజు
తృష్ణ నూనినవాఁడు రాధేయుఁబోఁటి
తులువ లెల్లను నతని సద్బుద్ధి యండ్రు. 36

వ. కావున నతండు దుర్నీతుండై యుండు నెల్లభంగుల సంగరంబు గాఁగలయది
యీసమయంబున బలంబులం గూర్చికొని పిలువం దగురాజులం బిలిచిపుచ్చ
వలయు సుయోధనుండును దోడాసపడి[2]పుచ్చు నుచితపరులగునరపతులు దొలుతఁ
జెప్పినవారికి సహాయత్వంబుఁ జేయం జూతురు మనము వెసఁ గలకాలరుల
వేగంబ పుచ్చి శల్య కేకయ ధృష్టకేతు జరాసంధతనయ ప్రభృతులయినభూపతుల
కును వారివారిబంధుమిత్రజనంబులకును నెఱింగించిపుచ్చుట కార్యం బిది నాకుం
బోలినతెఱం గని పలికి తన కెలన సముచితాసనంబున నున్నవిప్రవరుం జూపి. 37

క. ఇతఁడు మదీయాగ్రపురో, హితుఁ డితనికి నెల్లపనులు నెఱిఁగించి తగన్
ధృతరాష్ట్రుకడకుఁ బనుపుఁడు, చతురవచనరచనఁ గలిపి సంప్రీతి మెయిన్. 38

ఉ. ఆతనిసమ్ముఖంబునఁ దదగ్రతనూజుకడన్ మరున్నదీ
జాతునిసన్నిధిం గలశసంభవునొద్దఁ గ్రమోచితంబుగా
నీతెఱఁ గిట్టు లాడు మని యేర్పడ నంతయుఁ జెప్పిపుచ్చఁగా
నీతిమెయిం దగం బలుక నెయ్యము లాభముఁ బెంపుఁ జొప్పడున్. 39

వ. అనిన వాసుదేవుండు పాంచాలపతివచనంబు లుచితంబు లయి యున్నయవి
యిబ్భంగిన చేయవలయు నని పలికి మఱియు నిట్లనియె. 40

1. పాటి గాదు. 2. గ. పిలిచిపుచ్చు.

క. [1]కౌరవులకుఁ బాండవులకు, నారయ నే నొక్కరూప యట్లగుటఁ దగన్
వారును వీరును దమతమ, నేరిమిమెయి ధరణి యేలి యెగడఁగఁ జూతున్. 41

తే. [2]పెండ్లి కని పిల్వఁ బంచినఁ బ్రియముతోడ, నేఁగుదెంచితి మిన్నాళ్లు నెల్ల యొప్పి
దములఁ జూచితి మిమ్మోడఁ దడవుఁ గాఁగ, నిలువవీఁడదు పోయిరావలయు మాకు.

వ. అని పలికి ద్రుపదు నాలోకించి మీరు మా కెల్లవారికి గురుస్థానంబు మీమాట
యనిన ధృతరాష్ట్రుండు బహుమానంబు సేయు మిమ్ము శాంతనవుండునుం గొని
యాడు మీయందు ద్రోణకృపాచార్యులు సఖ్యంబు వాటింతు రట్లగుటం జేసి.

తే. పాండవార్థమై యొక్కరుఁ బనుప మీకు, భరము మీపలు కందఱు పలుకు మీరు
తెఱఁగుపఱుపంగ మిగిలి యుద్రేకులైన, వార చెడువారు విమలవిచారవిభవ.

క. పొం దైన లెస్స విరసపుఁ, గ్రం దయ్యెడు చండ మైన రాజుల నెల్లన్
ముందఱ రావించి క్రమం, బొందఁగ మముఁ బిలువఁ బంపుఁ డొయ్యనఁ బిదపన్.

క. మీపనుపున రాజ్యము పా, లీపాండుతనూభవులకు నీకున్న భుజా
టోపభయంకరుఁ డర్జును, కోపానల మడరి ముట్టికొనదే వారిన్. 46

చ. అని గమనోన్ముఖుం డయి మురాంతకుఁ డాద్రుపదుండు ధర్మనం
దనుఁడు వృకోదరాదు లగుతమ్ములు మత్స్యమహీవిభుండుఁ ద
న్ననుప హలాయుధప్రభృతియాదవలోకము తోడ రా ముదం
బున నిజపట్టణంబునకుఁ బోయె సముజ్జ్వలవైభవంబునన్. 47

వ. వివాహమహోత్సవంబునకు వచ్చిన తక్కటిరాజులును సంగ్రామ సన్నాహంబున
కై తమతమపురంబులకుం జనిరి తదనంతరంబ. 48

క. సమరమునకుఁ దగునుద్యో, గమునఁ బ్రవర్తిల్లి రెలమిఁ గౌంతేయులు మ
త్స్యమహీనాథుఁడు [3]సన్నా, హము సేసెఁ ద్రుపదవిభుఁడు నాయిత మయ్యెన్.

వ. ఇట్లు సన్నద్ధులై వెలివీడు విడిసి తమకు ననురక్తులైన రాజులపాలికిం దగుదూతలం
బుచ్చి రట దుర్యోధనుండు వీరలచందంబు విని తానును దనబంధుమిత్త్రగణం
బైన రాజలోకంబు నెల్ల రావించిన. 50

క. ఇభతురగస్యందనగతి, రభసంబున బృథివి యద్రువ రాఁ దొడఁగిరి భూ
విభులు నలుదిక్కులను లో, కభయంకరలీల నుభయకటకంబులకున్. 51

—♦ ద్రుపదుఁడు దనపురోహితుని దుర్యోధనుకడకు దూతఁగాఁ బంపుట ♦—

వ. అట్టిసమయంబున నజాతశత్రు ననుమతి వడసి పాంచాలపతి వయోజ్ఞానవృద్ధుం
డైన తనపురోహితుం గురుపతిపాలికిఁ బుచ్చువాఁ డై యతని రావించి. 52

క. హితుఁడవు మతిమంతుండవు, చతురవచనకోవిదుఁడవు సమయజ్ఞుఁడవు
న్నతవంశవర్ధనుఁడ విం, గితవేదివి నెచ్చెలివి సుకృతి వట్లగుటన్. 53

---

1. క. కౌరవులును బాండవులును. నారయ నా కొక్కరూప. 2. పెండ్లికిని బిల్వ.
3. జ. సన్నాహము.

తే. నాకుఁ గర్తవ్య మగుపని నీకుఁ జేయఁ, దగవు గావున నెల్లవిధములఁ బూని
పాండవార్థంబు ధృతరాష్ట్రుపాలి కరిగి, నేర్పువాటించి కార్యంబుదీర్పవలయు.
వ. అని చెప్పి యొడంబఱిచి యతనితో మఱియు ని ట్లనియె. 55
క. విను కొడుకు గొన్నవేఁదుఱ, కొని [1]కొట్టినతిండికాఁడు కుటిలుం డతఁ డా
జనపతిచందము ధర్మజు, ననుపమశీలంబు నెఱుఁగు దది య ట్లుండెన్. 56
తే. పుడమిపాలు పాండవులకు నడుగఁ బోయి
నీవు ధృతరాష్ట్రుతో ధర్మనిష్ఠ మైన
యుచిత మాడిన నందుఁ బో టొడ్డి యున్న
దారలభృత్యులమనములు దిరుగఁబడవె. 57
క. గురుభీష్మాదులమనములు, దురమునకుం జొరకయుండ దుర్యోధనుఁ డా
తురుఁ డై యొడఁబఱుపఁగ ని,ష్ఠురుసున నెర వైన ఱిచ్చవడు బల మెల్లన్. 58
ఉ. పాండుతనూభవుల్ వడినపాటులు బంధుల కెల్లఁ దెల్పుచుం
బండితవృద్ధసజ్జనులపాలికిఁ బోయి కులోచితంబు గా
కుండుట సూపి చెప్పఁ చుఁ బ్రియోక్తులఁ దక్కటివారి నిట్లు మే
లొండొకచంద మొప్ప దని యుల్లములం దలపోయఁ జేయుచున్. 59
వ. మఱియు సమస్తజనంబులమనంబులు నిక్కడ వ్రాలునట్టి యుపాయంబు లెన్ని గల వన్నియు నమ్యోతగవులమై నాచరించుచుఁ జరియించునది యిచ్చట విరాటు కొలువుకూటంబునం బుట్టినకృష్ణాదుల సంవాదంబు తెఱంగును మనమెఱింగిన యదియ తదనురూపంబుగాఁ బలికి పాండవులకుఁ దేజోలాభంబుం గావించుట కర్తవ్యంబు నీవు కరినగరంబున వసియించి ధృతరాష్ట్రధార్తరాష్ట్ర గాంగేయవిదురగురుకృపాదులకడ కరిగి నానాఁటికి వారివారిచిత్తంబుల తెఱంగెఱింగి ప్రవర్తింపుము దైవగతిం జేసి నీ[2]యొడ్డినసూత్రంబునకు సుయోధనుం డొడంబడియెనేనియు నదియ సకలజనసమ్మతం బయినవిధం బగు దాన నజాతశత్రుండును బ్రీతుండగుఁ బోయి రమ్మని నిశ్చయంబుసేసిన నమ్మహీసురవరుండు.
క. మును పాంచాల విభుని వీడ్కొని ధర్మజు భీము నరు నకులు సహదేవుం
గని యనుమతుఁ డై యందఱు, ననుపఁగ మన్ననలు వడసి యరిగెం బ్రీతిన్.
వ. అంత నక్కడ దుర్యోధనుండు సకలరాజన్యసామాన్యంబుగా గోపాలదేవుపాలికి దూతం బుచ్చుట దగ వగునే యని విచారించి. 62
క. వెరవుమెయిఁ దాన కతిపయ, పరిజనసహితముగ నరిగెఁ [3]బటుతురగగతి
స్ఫురణానుమోదలీలా, భరితుఁ డగుచు వేగిరంపుఁబయనములఁ దగన్. 63
వ. చని తదీయపుర ప్రవేశంబు సేసె నాదివసంబునన ధనంజయుండును గోవిందుం గాన వచ్చె నట్టియెడ. 64

1. గ. జ. కొట్టినతిండికాఁడు. 2. క. యాడిన. 3. గ. చ. జ. బటుతరగతివిస్ఫురణా,

తే. అతఁడు పవడింప మును కౌరవాధినాథుఁ, డరిగి తలయంపి దెస నున్నతాసనమున
నుండెఁ బదపడి కాల్కడయొద్ద కల్లఁ, జని వినమ్రుఁడై నిలుచుండెఁ సవ్యసాచి.

వ. అంత. 66

క. మేలుకని కృష్ణుఁ డర్జును, నాలోకించి మఱి కౌరవాధిపుఁ గని త
త్కాలోచితబహుమతిమైఁ, జాలఁ బ్రియం బిరువురకుఁ బ్రసన్నతఁ జేసెన్. 67

వ. తదనంతరంబ. 68

ఉ. వారలఁ జూచి కేశవుఁడు వచ్చినకార్యము సెప్పుఁ డన్న న
క్కౌరవనాథుఁ డిట్లనియెఁ గయ్యము సేయవగన్ సహాయముం
గోరి [1]భవత్సకాశమునకుం జనుదెంచితి మేము వీరు నీ
కారయ నొక్కరూప హృదయంబునఁ బేర్చినబాంధవంబునన్. 69

క. మున్నేను గాన వచ్చితి, నిన్ను సుజను లైనవారు నెమ్మిని మునుమున్
గన్నం దగఁ గైకొందు ర, మున్నతసౌజన్యసారయుతుఁడవు నీవున్. 70

వ. కావున లోకంబుపాడి విచారించి నాకుం దోడు గావలయు ననిన వాసుదేవుం
డిట్లనియె. 71

ఉ. నీ విట మున్న వచ్చితిది నిక్కము పార్థునిఁ దొల్తఁ గాంచితిం
గావున మీకు నిద్దఱకు గౌరవ మొప్పఁగ దోడుపాటు స
ద్భావము [2]దీనికిం దెఱఁగు దప్పక యుండఁగ నేర్పరించెద
నీవల పెట్టు లట్లు తగ నీవును నీతఁడు గోరికొం డొగిన్. 72

క. నాపాటియ పదివేవురు, గోపాలురు గలరు సమరకోవిదబాహా
టోపాభిరామమూర్తులు, చాపాద్యాయుధకళావిశారదచిత్తుల్. 73

క. నారాయణాభిధానులు, వారలు గయ్యంబు [3]సేయువా రొక్కెడ నే
నూరక నిరాయుధవ్యా, పారతమై నుండువాఁడఁ బరమాప్తుఁడనై. 74

క. వా రొకతల యే నొకతల, యీరెండుదెఱంగులందు నెయ్యది ప్రియ మె
వ్వారికిఁ జెప్పుడు దొలితొలి, గోరికొనఁ బాలునికిఁ దగుం బాడిమెయిన్. 75

♦ అర్జునుఁడు శ్రీకృష్ణునిం దనకు సహాయునిగాఁ గోరికొనుట. ♦

క. అని పలికి హరి కిరీటిం, గనుఁగొని కొండికవు నీవు గావున నీకున్
మును గోరఁ బాడి యనవుడు, విని కృష్ణునిఁ గోరికొనియె విజయుం డెలమిన్.

ఆ. దాని కాత్మఁ బొంగి ధార్తరాష్ట్రుఁడు వారి, నపహరించుకొనినయట్లకాఁగఁ
దలఁచి చెన్నుమీఱి బలములఁ గైకొని, చనియెఁ బ్రీతి రాముసదనమునకు.

వ. చని యతనిం గని సమ్మానంబు వడసి తనవచ్చినకార్యం బెఱింగించిన దుర్యోధ
నునకు బలదేవుం డిట్లనియె. 78

1. క. భవత్పరిపాదమునకుం. 2. జ. తోడ నెంతయును దప్పక. 3. క. సేయువలను గల్గరు నే,

క. అభిమన్యువివాహమునకుఁ, బ్రభువర్గం బెల్లఁ గూడఁ§బడి యుండఁగ నా
సభ నీకై వేఁ బలికితి, నిభపురమున మాట వుట్ట § [1]దె ట్లీవు వినన్. 79

వ. దానికిఁ గొంద ఱసహ్యపడి పాండవపక్షపాతంబునం బ్రతికూలవచనంబులు పలికిన నవి కృష్ణునకుఁ బ్రియంబులై యుండె నట్లగుటం జేసి. 80

తే. అతనిఁ బాసియొక్కింతప్ర§ద్దైన నిలువఁ, జాలమియుమూలముగ విర§సంపుమాట
లాడ నొల్లమి నేమియు § ననక యంత,నుండియొక నిశ్చయమ్ము మై§నున్నవాఁడ.

వ. అది యెయ్యది యం టేని. 82

క. మీరును వారును జలమునఁ, బోరెదు నెడ [2]నెద్ది యెట్లు § వోయిన నెఱి నే
నూరక యుండుదుఁ దోడై, వ్వారికిఁ బో నింత నిక్కు§వం బెబ్భంగిన్. 83

వ. అనిన విని దుర్యోధనుండు దాని కియ్యకొని సవినయంబుగా బలదేవుని వీడ్కొని వాసుదేవు నామంత్రణంబు సేసి కృతవర్మపాలికిం జని యాతం డొక్క యక్షౌహిణితోడఁ దన్నుంగలయ వచ్చువాఁ డయి యాఅడం బలికినఁ బ్రియంబంది నిజపురంబున కరిగెఁ దదనంతరంబ కృష్ణుం డర్జునున కిట్లనియె. 84

క. నారాయణగోపాలుర, భూరిపరాక్రములఁ గురువి§భుఁడు గొన సంగ్రా
మారంభరహితు నన్నుం, గోరికొనుట నీకు మే ల§గు నె తలపోయన్. 85

క. అనుటయు నాతఁడు హరి కి, ట్లను నేను రణంబునకు స§హాయం బొల్లక్
విను సుప్రసిద్ధుఁడవు నీ, వని నేసినఁ బేరు నీక § యగు నెప్పాటన్. 86

వ. నీ కెదురై జయంబు గొన రా దట్లగుటం జేసి విజయమూలం బగు నీతోడును వలయు నీవు సమరంబు సేయ కునికియుం బ్రియంబు కావున నిన్నుం గోరి కొంటినని చెప్పి మఱియు నిట్లనియె. 87

క. సారథ్యం బొనరింపు మ, పారకృపాలీల నెల్ల§భంగుల నాకీ
గౌరవమును జిరకాలము, గోరినయది దీని నిమ్ము § గుణరత్ననిధీ. 88

క. అనినఁ గిరీటికి హరి యి,ట్లను నీ దగుకోర్కి దీర్చు § టది నాకు వ్రతం
బనఘా తగ సారథ్యం, బొనరించెద నీకు నసమ§యుద్ధక్రీడన్. 89

క. అని యూరడించి నరుఁ దో,డ్కొని ధర్మతనూజునొద్ద§కుం బ్రియ మెసఁగం
జనుదెంచెం గార్యాలో, చనమును దగఁ జేయుబుద్ధి § శౌరి గడంకన్. 90

వ. అంత నట శల్యుపాలికిం బోయినదూత లతనిం గని సముచితాలాపంబుల సమరసహాయత్వంబునకుఁ గోరి పిలిచినం బ్రీతుండై యతండును బుత్త్రమిత్త్ర సమేతంబుగా నానాసేనాతిసంకులంబుగాఁ గదలి పాండవు లున్నయెడకు నిత్య ప్రయాణంబుల నడచుసమయంబున.

1. క. దే యీవు వినవ్. 2. అ. నెవ్వ రెట్లు.

—♦ దుర్యోధనుండు శల్యసాహాయ్యంబు గోరుట. ♦—

తే. ఇంతయును విని కౌరవాధీశ్వరుండు, దక్షు లగునాప్తజనములఁ దత్క్షణంబ
మద్రనాథునిచనియెడుమార్గమునకుఁ, బుచ్చి యెడనెడ నతులవిభూతి మెఱయ.

సీ. అరుదారుమేలుకట్లాయితం బై చూడ, నొప్పారి తను పగుచప్పరములుఁ
[1]బరపైనచెలువంబు గరగరికయుఁ దియ్య, తెలినీరుఁ గలిగినదీర్ఘికలును
[2]బొడవైనమువ్వంచఁబొలుచునట్లుగ నేనుఁ, గులకుగుజ్జములకుఁగొట్టములును
ముందర బయలైనచందంబుఁ జతురాభి,మత మైనయాస్థానమండపములు

ఆ. బియ్యములును నేయుఁబెరుఁగును గూరగా,యలును వంటకట్టియలును గడ్డి
[3]కవణములును బెల్లుగా నొడఁగూర్చి ని,గూఢవృత్తిఁ దానుఁ గూడ నడచె.

వ. ఇవ్విధంబున విడిదలపయినంపుసంపదలు పొంపిరివోవం దనకు సమకట్టినసమస్త
వస్తువులయవైకల్యంబునకు శల్యుండు సంతుష్టాంతరంగుండై నిజపరిజనంబులం
జూచి యిట్లు చతురంబుగా మనకు వలయువాని సంపాదించుటకుఁ బ్రవర్తకులైన
యుధిష్ఠిరామాత్యు లెవ్వారు వారలం దోడ్కొని రండు వారలు ప్రసాద
దానంబున కర్హులని పలుకునవసరంబున నటమున్న పలుదెఱంగులఁ బనులు సేయు
చున్నతనపల్లాయనంబువారిలోఁగలసి మఱువడి యున్నకౌరవేశ్వరుం డమ్మాటలు
విని యతనికిం బొడసూప నిదియ సమయం బని సముచితప్రకారంబునఁ ద
న్నెఱింగించుకొని వినయంబునఁ గనిన నతండును సంభ్రమమున గాఢాలింగనంబు
సేసి కనకాసనంబున నునిచి యింతయు నిమ్మహాత్ము నుద్యోగంబున నయ్యెం
గావలయు నని తలంచి విస్మయం బంది నీ కెయ్యది యిష్టంబు గోరు మిచ్చెద
ననిన గాంధారీనందనుండు పరమానందంబునం బొంది యి ట్లనియె. 94

క. సత్యసరస్వతి వగు మా, చిత్యవిశారదము నీదుచిత్తము [4]నియమా
దాత్త్యంబు మెఱయ నాకు న, మాత్యుఁడవై పూని నడపు మత్సైన్యంబున్.

ఆ. తలఁపఁ బాండవులును ధార్తరాష్ట్రులు నీకు, నొక్కరూప భక్తియుక్తిఁ జాల
నీవు నన్ను మాననీయుఁడు గాఁగ న,నుగ్రహించి తగఁ బరిగ్రహింపు. 96

చ. అనవుడు శల్యుఁ డియ్యకొని యట్టిద కాదె విభేద[5]వృత్తి నా
మనమున లేదు పాండవసమాజము మీరును నొక్కరూప కా
వున నిది లెస్సమాట దగవుం దలపోయఁగ మున్న ప్రీతిఁ గాం
చిననిను నెమ్మిఁ గూడుటయ చేయుదు నిట్టుల యెల్లభంగులన్. 97

ఉ. దానఁ గొఱంత లే దభిమతం బిది గాకయుఁ గల్గెనేనియుం
బూని యొనర్తు నన్నుఁ గురుపుంగవుఁ డెంతయుఁ బొంగి నీవు స

---

1. అ. బరపులై చెలు. 2. క. బొడవులై; అ. బొడవులై మువ్వ. 3. గ. ఖాణములును
4. జ. ధీయుదాత్తంబు. 5. అ. బుద్ధి.

మ్మానము సేసి నాకిటు లక్షమాత్ముఁడ వైనపదంబుకంటె మే
లై నుతి కెక్కుకోర్కి యెటు ♦ లారసి చూచిన నొండు గల్గునే. 98

వ. అనిన విని వికచవదనుం డగుచు మద్రేశ్వరుం డు. 99

క. చను నీవు హస్తినగరం, బున కేనును బాండుభూపపుత్త్రులఁ బ్రీతిం
గని యట వత్తు నవశ్యం, బును వారలఁజూడవలయుఁ ♦ బోయెద ననినన్. 100

ఆ. అట్లకాక వేగ ♦ మట వోయి మరలుండు, వరము మఱవ కుండ♦వలయుమిమ్ముఁ
జేరి నెగడువాఁడఁ ♦ గారుణ్యమున నిట, యరసి యుండుఁడనియెఁ♦గురువిభుండు.

వ. అనవుడు. 102

క. దరహాసముతో మద్రే, శ్వరుఁ డాలింగనముసేసి ♦ సందియపడ కీ
వరుగు మని పనుప నాతఁడు, కరిపురికిం జనియె మది వి♦కాసముఁ బొందన్.103

—♦ శల్యుఁడు పాండవులం జూడ నుపప్లావ్యంబునకు వచ్చుట. ♦—

వ. అంత శల్యుండు నుపప్లావ్యంబునకుం జని స్కంధావారంబు దఱియం జొచ్చి ధర్మ నందనునివాసంబున కరిగిన నతండు దమ్ములుం దానును ద్రౌపదీసుభద్రలు నభిమన్యుప్రభృతిపుత్త్రవర్గంబును నెదురు వచ్చి కృతప్రణాముఁ [1]డై తోడ్కొని పోయి కాంచనాసనంబున నునిచి యర్ఘ్యపాద్యంబు లిచ్చి కుశలం బడిగిన సర్వం బును గుశలసంపన్నంబ యని వారల నందఱ నభినందించి యుధిష్ఠిరుం బున రాలింగనంబు సేసి యి ట్లనియె. 104

క. జనరహితం బగువనమున, ననుజన్ములు ద్రుపదభూపవరాత్మజయును నీ
వును నింతకాల మలయక, యునికి కడుఁ దుష్కరము మహోదాత్తమతీ.105

ఆ. దానికంటె నరిది ♦ దలపోయ నజ్ఞాత, వాస ముజ్జ్వలాంగ♦భాసమాను
లై నమీకు మీఁద♦యా[2]సూనృతాదుల, పెంపు మిమ్ముఁ గడవఁ♦బెట్టకున్నె. 106

క. ఇమ్మహి యెల్లను నీమది, యుమ్మలికకుఁ జాల నొచ్చె ♦ నుర్వీవర నీ
విమ్మెయి నిప్పు డఖలదురి, తమ్ములుఁ గడచుటకు సమ్మ♦దమ్మునఁ బొదలెన్.

వ. అని యుచితసంభాషణంబులు సేసి దుర్యోధనుండు దన్నుం గాంచినవిధంబును నతండు ప్రార్థించిన తెఱంగును దానికిఁ దానియ్యకొనుటయుం జెప్పిన ధర్మ నందనుం డతని కి ట్లనియె. 108

తే. మేలు సేసితి [3]రొక్కరి ♦ మెచ్చి వారి, కోర్కి దీర్చుట పెద్దల♦గుణమ కాదె
యది మదీయచిత్తమునకు ♦ హర్షకరమ, తివిరి యొక్కటి వేఁడెద ♦ నవధరింపు.

వ. పార్థునకుఁ గృష్ణుండు సారథ్యంబు సేయువాఁడై యున్నవాఁడు కర్ణుండు పార్థుతో నెప్పుడు మచ్చరించుచు నుండు వీరిరువురకు సంగ్రామం బైనయప్పుడు కృష్ణునకుఁ బ్రతిసారథ్యం బొనరింప మీరకాని యక్కడం దక్కొరొండు లేఁడు గావున నవ శ్యంబును మీకుం గర్ణసారథ్యంబు గర్తవ్యంబు గాఁగలయది సమరసమయంబున

1. క. ఖ. గ. జ. డై.2.క.గ.జ.సుకృతాదుల; 3.చ.రొక్కట్ల మెచ్చివారి; గ..రొక్కని మెచ్చివాని

నిరాకరించి పలికి కర్ణుచిత్తంబునకుం గలంక పుట్టించి పార్థు రక్షింపవలయు నకృత్యం బని యనుమానింపక మత్ప్రార్థనంబున నెల్లభంగుల నిష్ఫలం బనుష్ఠించువార లని యభ్యర్థించిన సమ్మతించి శల్యుం డిట్లనియె. 110

క. అగు నిది వ్రాఁలును నాకుం, దగ వట్టిద కర్ణునకు రథంబు గడప నీ
వగు దని కోరినకౌరవ, జగతీశ్వరుప్రార్థనంబు § సలుపఁగవలయున్. 111

క. కర్ణునిసారథినై నను, నిర్ణయమున కేను బార్థునిం గాచెద నా
దుర్ణయవిచారు నెమ్మెయిఁ, గర్ణకఠోరంబు లాడి § కలఁతుం బోరన్. 112

తే. దర్పమును దేజమును మాయఁ § దలరఁ బలికి, చిక్కువఱిచిన నేయంగఁ § జేతులాడ
కునికి రాధాతనూజు నర్జునుఁడు తీవ్ర, బహుళబాణపరంపర § పాలు పఱుచు.

చ. ఇది యొకఁ డేల నీవు మది § నెయ్యది గోరినఁ జేయువాఁడ నాఁ
డదయత సూతసూతి సభ § నాడినమాటకుఁ జాల నొచ్చి మా
హృదయము లెల్ల నీవలన § నెంతయుఁ బఱుముసేయు [1]నక్కటా
యదియును గాక మీఁపడిన § [2]యాపద లెవ్వరి నొవ్వఁ జేయవే. 114

ఆ. ఇట్లు వడితి ననుచు § నెడ నీవు వగవకు, గారవమున నిమ్మనోరథమ్ము
ఫలమువొందు నెల్ల § భంగుల దేవత, లయినఁ బడుదు రొక్క § యవసరమున.

క. వాసవుఁడు దొల్లినిజకాం, తాసహితము గాఁగ నధిక § దైన్యము వొందెన్
మీసంపద పెద్దయె విధి, సేసినగతిఁ బడకయుండ § శివునకువశమే. 116

వ. అనిన విని ధర్మనందనుం డింద్రుండు శచీసమేతంబుగా నట్టిదురవస్థ యేమికారణంబున నెత్తెఱంగున ననుభవించె నని యడిగిన మద్రపతి దొల్లింటియితిహాసంబు సెప్పెద విను మని యిట్లనియె దేవతలయందు మాన్యుండై త్వష్ట యను పేరం బరఁగువాఁడు వాసవునకుం గీడు దలంచి మూఁడుదలలవాని నొక్కని సృజియించి విశ్వరూపనామధేయుం జేసిన నతం డింద్రపదవిం గోరి ఘోరతపంబుసేయుచున్న దానికి భయం బంది నిలింపపతి యప్సరస్స్త్రీలఁ దత్తపోభంగంబు సేయుం డని నియమించి పంచిన. 117

క. వారివిలాసంబులను వి,హారముల విలోకనముల § నాలాపములన్
మారవికారం బాతనిఁ, జేరద యన్నాకపతియు § సిగ్గెపఁ గదురన్. 118

తే. [3]తలరి యమ్మునిఁ దెగఁజూచి § ధర్మరహితుఁ, డగుటయెవ్వరు నెఱుఁగని § యట్లుగాఁగ
నేఁడుగాలంబు గడపిన § నెఱిఁగి భూత,గణము లాక్రోశ మొనరింపఁ § గా నతండు.

వ. తనదుష్కర్మంబు ప్రకటం బగుటకు రోసి యొక్కవిషమవ్రతం బాచరించి సముద్రతరుధరణిస్త్రీజనంబులయందు బ్రహ్మహత్యవిభాగించి పెట్టినిజకల్మషంబుఁ బాపి కొని మునిగణసేవితుం డయి సముల్లాసంబునం బొంది యునికిఁ ద్వష్ట కోపించి.

1. క. నల్లవో, 2. క. యక్కట. 3. క. తలఁకి.

తే. అనపరాధుఁ దపోనిధి నధికశాంతి, యుక్తుఁ జంపినపాపాత్ము ననుఱక పట్టి
మ్రింగఁజాలెడువాని నుత్తుంగదేహు, నేను సృజియింతుఁజూడుఁడీ యాక్షణంబ.

చ. అనుచుఁ గడంగి నిష్ఠమెయి నగ్నిముఖం బొనరించి వేలిమిం
దనయు సృజించి లోకవిదితంబుగ వృత్రసమాఖ్య యిచ్చి మ
ద్వినుతతపోబలంబునఁ బ్రదీపితతేజుఁడ వై జయింపు నీ
వని నియమించి పంచె నమరాధిపుతో సమరంబు సేయఁగన్. 122

— ఇంద్రుఁడు వృత్రాసురునితో యుద్ధంబు సేయుట. —

చ. పనిచిన నాతఁడుం జనియె బాహుబలంబున [1]నేచి వాసవుం
డని కెదు రేఁగుదెంచె నిటు లద్భుతసంగర మైనచోట న
య్యనిమిషనాథుఁ బట్టుకొని యంగద వృత్రుఁడు మ్రింగె దేవత
ల్మనమున బెగ్గలింపఁగఁ జలంబు బలంబును సూపి యుగ్రుఁడై. 123

వ. ఇట్లు మ్రింగినం ద్రిదశగణంబులు దత్క్షణంబ యాదైత్యునకు నావులించునట్టి యాలస్యం బావహించిన. 124

తే. అసురనాథుండు నలసత యడర నీల్గి, యావులించిన నత్తఱి నమరవిభుఁడు
దనశరీరంబు సంకుచితంబు సేసి,కడుజవంబునఁ గుప్పించి వెడల నుఱికె.

క. వెలలి బలరిపుఁడు చలమునఁ, గలహమునకుఁ జొచ్చె వృత్రుఘనబాహుబలం
బలవికి మీఱెను దండ్రి వి,మలతపమునఁ జేసి సురలమనములు దలఁకన్. 126

వ. ఇ[2]ట్లధికబలుం డైనవృత్రునాటోపంబు సహింపం జాలక సురపతి దెరలి మరలి పఱచి మందరగిరిశిఖరంబున కరిగినం గనుకనిం జని యనిమిషు లతనిం గూడుకొని వృత్రవధోపాయంబు విచారించునెడ నవ్వాసవుండును దనమనంబున నిశ్చయించి. 127

క. వారిఁ గాంచి యతని చెప్పిన, పరమోపాయంబు సేసి బ్రతుకుద మనినన్
సుర లదియ కర్జ మని య, మ్మురమర్దనుకడకుఁ జనిరి మునులుం దారున్.

వ. ఇట్లు దివిజానీకంబును మునిలోకంబును బాకశాసనుం బురస్కరించుకొని. 129

మ. చని యాదైత్యు తెఱంగు సెప్పి యతులోత్సాహంబుమై నెప్పుడున్.
దనుజవ్రాతముత్రుళ్ళడంచి దివిజేంద్ర శ్రీవిలాసంబు పెం
పునఁ బొందించుట నీకు నైజము గదా భూతేశ ఘోరారిమ
ర్దనసంక్రీడ యొనర్పు లోకముల కత్యంత ప్రమోదంబు గాన్. 130

క. అనిన విని యొకటి సెప్పెద, వినుఁ డాతనితోడ నమరవిభునకుఁ దగఁ బోం
రొనరింపుఁ డొక్కసమయం, బున [3]నడఁకువఁ గులిశధారఁ బొందెద నేనున్.

వ. మదీయ తేజోవిశేషంబున నప్పురుహూతున కుత్సాహంబు సంభవింపం గలయది యప్పు డనాయాసంబునఁ బగతు వధియింప నగు నని గదాధరుం డూఱడిలంబలి

1. గ. తేర్చి 2. క. ట్లవికబలుం 3. క. చేఁడుఁవ.

కీన బలసూదనప్రముఖనిఖిలసురలోకంబును సంతసిల్లి మఁగిడి వచ్చి వృత్రుకడకు మునిజనంబులం బుచ్చిన వారును జని యతని కిట్లనిరి. 132

క. భుజబలదుర్జయుఁ డింద్రుం, డజయ్యుఁడవు నీవు నీకు నతనికి మీలో
విజయము దక్కదు మీ రేచి జగంబులు నొవ్వ రణము సేయఁగ నేలా. 133

క. మైత్రీసౌఖ్యముఁ బోలునె, శాత్రవ మెమ్మెయిఁ దలంప శక్రశ్రీకిం
బాత్రమ వై యింపుగఁ దన్మిత్రుఁడ వగు మిదియ మేలు మీయిద్దఱకున్.

వ. అనవుడు వృత్రాసురుండు తేజంబువానికి నాసపడియెడు మాయిరువురకు సఖ్యంబు సమకూర నేర్చునే యనుటయు నమ్మునులు సత్పురుషసాంగత్యంబుసంభవించినం జేయమి నీతి గాదు మహేంద్రుండు సకలలోకసమ్మతసద్భావుండు గావున నతని తోడిచుట్టఱికంబు మే లనిన నొడంబడి యతండు వారల కిట్లనియె. 135

క. ఏ నొక్క తెఱఁగు సెప్పెద, దానిం గా దనక చేసి తగ మీరలు సం
ధానము దృఢముగఁ జేయుం, డానాకేశునకు నాకు నధిక ప్రీతిన్. 136

వ. అది యెయ్యది యనిన నార్ద్రం బగుదానను శుష్కం బైనసాధనంబునను దారు వునం బాషాణంబున శస్త్రాస్త్రంబులం దివంబున రాత్రియందును నేను వధ్యుండఁ గాకుండవలయు ననిన వారును దానికి నొడంబడి యవ్విధంబు లొసంగి వృత్రవజ్రధరులకు మిత్రభావం బొనరించి మగుడం జని యత్తెఱంగు వాసవున కెఱింగించి నిజనివాసంబుల కరిగిరి సురనాథుండు సుఖంబుండి పెద్ద కాలంబునకుం దనమనంబునఁ బాయనివైరంబు సైరింపం జాలక దామోదరుని పూనికయు మునిజనంబు సేసినసంధివిధంబును నిరూపించి రిపుం బరిభవింప రంధ్రాన్వేషణంబు సేయుచుండి యొక్కనాఁడు. 137

చ. జలనిధితీరభూమిఁ దనశత్రుఁ గనుంగొని వీని నిప్పు డో
ర్బల మెసఁగంగ నాదుభిదురంబునఁ ద్రుంచెద రాత్రి గాదు తాఁ
దలఁప దివంబు గా దిది యుదగ్రపరాక్రమయోగ్యసంధ్య నా
యలవుఁ జలంబుఁ జూప నెప మై తగునాధన మెద్ది గల్గునో. 138

క. అనితలఁచుచు నచ్చట నొక, వననిధిఫేనంబుఁ జూచి వాసవుఁ డార్ద్రం
బును శుష్కంబును గా దిది, యనుచుం గులిశమునఁ గూర్చియధికరయమునన్.

తే. దాన వృత్రుని వ్రేయ నత్తఱి మురారి
యందుఁ దగ సంక్రమించి యయ్యసురఁ జంపె
జిష్ణుఁ డతిభక్తి విష్ణుఁ బూజించె నాత్మ
నఖిలలోకంబులకు మోద మావహిల్లె. 140

వ. ఇవ్విధంబునం బగతుం బరిమార్చి పేర్చి యింద్రుండు నిజపురంబునకుం జనియె మఱియును భూతసంఘం బిట్లు బ్రహ్మహత్య సేయం దగునే యని యతని నిందించినం బ్రభుత్వసంపద సెడుటయు, 141

ఆ. నీచదశకు వచ్చి నిషధాచలంబున, కరిగి సురవరేణ్యుఁ డడఁగి యుండె
నమరు లెల్లఁ గలఁగి యన్యోన్యపీడన,భయముఁ బొంది కూడఁ బాఱి తమకు.

క. కావలియై సురరాజ్య, శ్రీ వాలింపంగఁ దగువిశేషంబున సం
భావితుఁడు నహుషుఁ డని చని, యావిభుఁ గని తారు మును లతనికి నెమ్మిన్.

—♦ దేవతలు నహుషుని సురరాజ్యాభిషిక్తునిం జేయుట. ♦—

వ. పాకశాసను తెఱం గెఱింగించి. 144

క. ర మ్మింద్రపదవి సేకొని, మ మ్మెల్లను నరయు మనిన మానవపతి నా
కమ్మహిమకుఁ దగుమాహా, త్మ్యమ్ము గలదె నన్ను నేల యలఁచెద రనినన్.

వ. అంత నిలువక యత్యంతప్రార్థనంబు సేసి. 146

క. యమవరుణాదిత్రిదశులు, దమతమశక్తిప్రభావదర్పంబులు భూ
రమణునకుఁ బంచి యిచ్చిరి, ప్రమోద మెసఁగంగ మునిసభామధ్యమునన్.

వ. ఇవ్విధంబున నిచ్చి యధిక బలసమన్వితుం గావించి తోడ్కొనిపోయి పూజ్యం బగు దివిజరాజ్యంబున కభిషిక్తుం జేసిన నతండును బరమధర్మపరుండై కిన్నర కింపురుష గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాది సమస్త దేవయోనులవలనను దేజోభాగంబులు పుచ్చికొని మహానుభావుండై దివ్యమునిసేవ్యం బైనయద్దేవేంద్ర పదంబు సేకొని తుంబురు నారదాదివినోదపాత్రంబులును రంభాద్యప్సరో గణంబులుం గొలువ నభిమతభోగంబు లనుభవించుచు మదంబు మిగిలి మన్మథాధీనుం డై వర్తిల్లుసమయంబున నొక్కనాఁడు. 148

తే. మహితలావణ్యమున నసమాన యనఁగఁ
జనినపౌలోమి యానహుషునకు నయన
మార్గగోచర యగుటయు మదనబాణ
భిన్నహృదయుఁ డై ధృతిఁ బాయఁ బెట్టి యతఁడు. 149

క. సురలోకరాజ్యపదవీ,గరిమంబున నున్ననన్నుఁ గవయం బరమా
దరలీలఁ జతుర యగునీ, సరసిజముఖి రామి యేమిచందమొ తలఁపన్. 150

క. అని యప్పొలఁతిం బిలిపిం,చిన నదియును భయము నొంది శీఘ్రమ దేవే
జ్యునిసదనమునకు శరణం, బనుచుం జనుటయును వాసవాచార్యుండున్. 151

వ. పరమాదరంబున నద్దేవిని గారవించి నిన్ను నహుషుదుర్వినయంబుఁ బొరయకుండ నరయువాఁడ నాఖండలుండు నాయత్నంబున నవశ్యంబును దడయక వచ్చు నని యూఱడించిన. 152

క. అది యెల్ల నెఱింగి కోపం, బొదవఁగ నహుషుండు గురున కుచితమె యే న
మ్మదితం బిలిపింపఁగఁ దన,సదనంబున నునుచు టనియె సంక్షుభితుండై. 153

చ. అనుడు మునీంద్రులున్ సురలు నక్కట నీమహనీయగౌరవం
బునకుఁ బరాంగనం గవయుబుద్ధి జనించుట యొప్పు గాదు నా

విని మును పూని యిమ్మెయి వివేకము గౌతముభార్యఁ బాకశా
సనుఁ డెడఁ గోరుచోఁ గలుషఁ జాలర మీఁ దది యెట్లు సెప్పఁడా. 154

వ. అనుచు నతండు కోపించిన భయంబుఁ గొని వార లాపౌలోమి నతనిపాలికిం దోడ్కొనివచ్చువారై పూని బృహస్పతికడకుం జని యద్దేవి వినుచుండ నిట్లనిరి.

క. నహుషుఁడు మహేంద్రపదవీ, సహితుఁడు శచికిఁ వరింపఁ జను నాతనిలో
కహితంబు గాఁగఁ బుచ్చుము, మహాత్మ తచ్చిత్తమునఁ యమర్షం బడఁగన్. 156

క. అనవుడు శోకం బడరఁగ, ననిమిషగురుఁ జూచి యిట్టు లను శచి యటు వ
చ్చిన దూఱు రాదె నను శుచి, యని మీఁకొనియాడు టెల్ల ననృతముగాదే.

వ. అనిన విని దరహసితవదనుం డగుచుఁ బురుహూతపురోహితుండు. 158

క. నహుషుండు పనుచువాఁ డటె, విహితానుష్ఠానపరులు వీరటె తా లో
కహితం బటె యిది మనకుఁ, మహాస్పదము కాక యెట్లు మానఁగవచ్చున్.

వ. అని యుల్లసం బాడి యనిమిషులను ఋషులను జూచి యిట్లనియె. 160

తే. శరణు సొచ్చిన రక్షింపఁ జాలియుండి, కడపి పుచ్చిన నూర్ధ్వలోకములు దప్పుఁ
బుణ్యకర్మంబు లఫలతఁ బొందు ననఁడె, కమలగర్భుండు దొల్లి జగద్ధితముగ.

వ. అని యనురూపాలాపంబుల నిషేధింప వార లట్లేనిఁ గర్తవ్యం బెయ్యది యూహింపు మనిన నద్దేవి నహుషుకడకుం జని సముచితంబుగాఁ దదీయసాంగత్యంబున కెడ వలికికొని వచ్చునది యటమీఁద మన మందఱముం బురందరున కభ్యుదయం బగు తెఱం గాచరించువార మనుటయు వాచస్పతివచనంబులకు సంతసించి సురసంయమిసంఘంబు లరిగినయనంతరంబ. 162

క. పౌలోమియు నానహుషుని, పాలికిఁ జనుటయు నతండు భావజవికృతి
వ్యాలోలమానసుం డయి, లీలాసంభావనాలలితముఖుఁ డయ్యెన్. 163

వ. అట్టియెడ. 164

ఉ. అల్లన యింతి యిట్లనియె నారసి వాసవుకల్మి [1]లేమియుం
దెల్లముగా నెఱింగికొని తేఁకువ లేకిట వచ్చు టొప్పు నా
యుల్లము శంకితం బగుచు నుండఁగ వేగిరపాటు మేలె నీ
వెల్ల నెఱుంగు దిప్పు డెడ యిచ్చుట యుక్తము నాకుఁ జూడఁగన్. 165

వ. అని యొడంబఱిచి కొండొకకాలం బెడ వలికికొని యింద్రాణియు మగుడం జనుదెంచె నమరగణంబును మునిజనసహితంబుగ విష్ణుదేవుపాలికి రహస్యవృత్తిం బోయి జిష్ణునిదురితంబు వాపుటఁ గోరిన శౌరి కరుణాయత్తచిత్తుండై. 166

క. హయమేధంబున నాకుం, బ్రియ మొనరింపంగ వృత్రభేదికిఁ బుణ్యో
దయ మగు నావుడు వారలు, రయమునఁ జని రందఱుం బురందరుకడకున్. 167

1. క. లేమి యోఁ.

—♦ ఇంద్రుఁడు నహుషుతేజోవిశేషంబు నూచి మఱుఁగుపడుట ♦—

క. చని యతని నశ్వమేధం,బునఁ గల్మషరహితుఁ జేయఁ । బురుహూతుండుం
దనపురికి నరిగి నహుషుం, గని తత్తేజోవిశేష।కంపితుఁ డయ్యెన్. 168

వ. ఇట్లు వృత్రారి తన బ్రహ్మహత్య వాయుటయుఁదనకునహుషునంతబలంబు లేమిం
జేసి భయాకులితచిత్తుం డై. 169

క. ఎందేనిఁ జనియె నాతని, సుందరియును నెమ్మనమున । శోకోద్రేకం
బొంది పురందరుఁ డరిగిన, కందువ యే నిప్పు డెట్లు । గాంతునొ యనుచున్.

వ. నిశాసమయంబున నుపశ్రుతి నారాధించినఁ దదీయాధిదేవత [1]నీసత్యంబువలన
నీమగనిం గను దని చెప్పి యనంతరంబు సాకార యై పొడసూపినఁ బౌలోమి
నీ వెవ్వర వని యడిగిన నదియును భవత్పాతివ్రత్యశౌచంబులకుఁ బ్రియం
బంది వచ్చితి నుపశ్రుతి నని చెప్పి నీకుం బాకశాసనుం జూపెద రమ్మని తోడ్కొని
హిమవంతంబునుత్తరంబున ముంజవంతం బనుమహాశైలంబున కరిగి దాని
యందు శతయోజనవిస్తీర్ణం బైనయొక్కసరోవరంబు సొచ్చి యచ్చట నుల్లసిల్లు
పంచవర్ణకమనీయంబు లగుకమలంబులలో నొక్కనాళంబు భేదించి ముందటఁ
బ్రవేశించె నింద్రాణియుం దోడన చని తదీయతంతుమధ్యంబున సూక్ష్మరూపం
బున నున్నసురపతిం గన్నంత నయ్యుపశ్రుతి యదృశ్యం బగుటయు. 171

క. పతిసన్నిధి వడసి మహా,ద్భుత మందెడుశచి తదీయ।పూర్వసుకర్మ
స్తుతి సేయుచు నిలిచిన నతఁ, డతివం గని సంభృతాదరాత్ముం డగుచున్. 172

ఉ. ఇచ్చట నేను నిల్చు టిది । యెట్టు లెఱింగితి నన్నుఁ గాన నీ
వచ్చినకార్య మేమి యన।వద్య గుణోత్తర చెప్పు నావుఁడున్
బొచ్చెము లేక యానహుషు।పోయిన [2]పోకలు [3]వానికిం దగం
జెచ్చెరఁ గాలయాపనము । సేసినభంగియుఁ జెప్పె దేవియున్. 173

వ. చెప్పి యుపశ్రుతి తెఱంగును నతని కెఱింగించి దేవా నీ విత్తఱిం బ్రకాశుండ వై
భవత్ప్రతాపంబున నహుషునకుఁ బరాభవం బొనరించి నను రక్షింపక తక్కిన
నుక్కివుం డగునతనిపాపనిశ్చయంబున నాపద వచ్చు ననిన విని వల్లభకు దివిజ
వల్లభుం డిట్లనియె. 174

క. ఆనహుషుబాహుగర్వ మ, నూనం బై యున్నయది స।ముజ్జ్వలముని స
న్మానన ప్రవృద్ధ మగుటను, దానం గాలంబు వేచె।దను జయమునకున్. 175

చ. తఱి యగునంతకున్ రిపున।దగ్రత సైఁచుట నీతి నీవు నా
కఱపినయట్ల చేయుము త।గం జని యాతనిఁ గాంచి నన్ను నె
త్తెఱఁగున నైనఁ బొందగ మ।దిం దలఁపోఁతయు కల్గెనేనిఁ గ్ర

1. క. నీసత్యంబువలనం గను ధని. 2. 'పోకులు' అని కొన్నిప్రతులు. 3. క, గ, జ. దానికిం

చ్చుట మునివర్గవాహనుఁడ § వై చను దెమ్మను [1]మంతఁ దీటెఱుఁగన్. 176

ఆ. అనిన నట్ల కాక § యని పతి వీడ్కొని, యింతి నహుషుపాలి § కేఁగుటెంచె
నతఁడు దమకు మడర § నద్దేవిఁ బెద్దయు, నాదరించి యిష్ట § మడుగుటయును.

వ. ఇంద్రాణియు ని ట్లనియె మననిరూపించినసమయంబునకుఁ గొండొక తడవు గలదు కాలం బగుటయు నిన్ను వరియించెద నీవు మహామునివాహనుండవు గా వలయు నది నాకుఁ బ్రియంబు నీకు ననన్యసామాన్యం బైనయానంబు తేజోవిశేషకరం బగు ననిన నప్పలుకులకు నహుషుండు ప్రహర్షచిత్తుండై. 178

ఆ. ఏను దక్క నొరుల § కెవ్వరి కైన న, వ్వాహనంబు నెక్క § వశమె నీకు
సమ్మదంబు గాఁగ § సప్తర్షిగణము నా, యందలంబు మోవ § నరుగుదెంతు.

క. అని వనితఁ బంచి యప్పుడు, మునులం బిలిపించి మార్క్ష్య§మునఁ దనకున్ వా
హనముగఁ జేసి యొకింతయు, ననుమానము లేక తిరిగె § నతఁ డెల్లెడలన్.

క. చని పౌలోమియు సురగురుఁ, గని నహుషుఁడు వేచి యున్న § కాలం బెడ లే
దనిమిషనాథునకిత్తఱి, ననుగ్రహము సేయ వలయు § నవహితబుద్ధిన్. 181

వ. శరణాగత నైననన్ను రక్షింపు మనిన నతం డి ట్లనియె. 182

క. ఆనహుషువలన నాపద, రా నీ నాతనికి నాతు§రత గావింపం
బూని యొనర్చెద వేలిమి, [2]దానను మునివాహనత గ§తస్థైర్యుఁ డగున్. 183

క. వెరవున నీపతియునికియు, నరసెద నని యూఱడించి § యప్పుడ వైశ్వా
నరు నర్చితుఁ జేసి పురందరు తెఱఁగుం జెప్పి యతనిఁ§దడవం బనిచెన్. 184

—♦ అగ్నిదేవుఁ డింద్రుని వెదకి బృహస్పతికిం దెలుపుట ♦—

వ. పనిచిన వహ్నియు వనితారూపంబునంజని మనోగతి యగుటం జేసి సర్వదిశలును భూమ్యంతరిక్షంబులును గిరివిపినంబులును గొండొకసేపునకుం గలయం జూచి సంక్రందను నెందునుం గానక మగిడి వచ్చి వాచస్పతికి నత్తెఱం గెఱింగించి నాకు జలంబులు ప్రవేశింప రామి నంద పరికింప నేర నైతి నప్పులవలన నగ్నియు బ్రాహ్మణులవలన క్షత్రియజాతియు నశ్మంబులవలన లోహంబును నుద్భవించె వానివాఁడిమి యెల్లయెడలం జెల్లుఁ దమతమ జన్మస్థానంబులయం దడంగుం గావున నీళ్లు నాకు సంక్షయంబు సేయుట సుప్రసిద్ధం బనిన విని యనిమిష గురుండు హవ్యవాహను నత్యంతగౌరవంబునం గనుంగొని. 185

మ. సకలస్థావరజంగమంబులు భవ§త్సాన్నిధ్యమాత్రంబునన్
వికసిల్లుం గ్రతువైభవంబులుఁ జతు§ర్వేదంబులున్ నీవ పా
వక నీయంద జలంబులుం గలిగె § విశ్వవ్యాప్తిమై నున్ననీ
కొకచో నెట్టు లగమ్య మయ్యె నిను నీ § వూహింపు పెం పారఁగన్. 186

1. గ. నంత. 2. గ. దానను మున్నియానమున.

ఉ. ఏనును బ్రాహ్మమంత్రముల నెంతయు నీ కభివృద్ధిఁ జేసెదం
[1]గాన విశంకతన్ సలిలగామివి గమ్మనినం గృశానుఁడుం
బూనిక నేఁగి వారినిధిభూరినదీసరసీతటాకసం
తానము రోయుచుం జని శతక్రతుఁ డున్నసరోవరంబునన్. 187

ఉ. అంబురుహంబులం గలయ నారసి చొచ్చి యొకండునాళసూ
త్రంబున నున్నయింద్రుఁ గని రాగమునన్ గురునొద్ద కగ్ని శీ
ఘ్రంబున నేగుదెంచి తనకన్న తెఱం గెఱిఁగింప నాతఁ డు
ల్లంబున నుల్లసిల్లి సురలున్ మునులం దగఁ గూడి గ్రక్కునన్. 188

మ. దివిజాధీశ్వరుపాలికిం జని కృతార్థీభూతచేతస్కుఁడై
వివిధస్తోత్రపరంపరాచతురవాగ్విన్యాసతం బ్రీతుఁ జే
సి వరిష్ఠం బగునీదుకృత్యము ననుష్ఠింపంగ నీ వుత్సహిం
పవు నీ కేమికొఱంత వృత్రవధ మేపాపంబు రూపింపుమా. 189

క. శరనిధిఫేనంబున నా,హరి వొంది జగద్విరోధి యగువృత్రునిఁ దాఁ
బరిమార్ప నీకు విజయము, దొరకొనియెం గాక దీన దోసము గలదే. 190

వ. అని సముచితంబుగా సంబోధించిన గురునిసంభాషితంబుల నిర్ఘోషితుం డయి నిజ
రూపంబు వహించి సకలసుమనోమునిసహితంబుగా నతని సంభావించి జంభారి
కర్తవ్యం బెయ్యది యని యడిగిన నాచార్యుం డితం డెఱింగినను విస్పష్టంబుగా
నహుషువృత్తాంతం బంతయు వివరించెదం గాక యని తలంచి యిట్లనియె. 191

క. నాఁ డట్లు నీవు నీ దగు, పోఁడిమి సెడి యడఁగుటయును భువనంబుల కె
వ్వాఁడును రక్షకుఁ డయ్యెడు, వాఁడిమగఁడు లేమిఁ ద్రిదశవర్గము[2]మునులున్.

ఉ. ఒండొరుచేతఁ బీడ వడ నోపక రక్షకుఁ డైనవాని నా
ఖండలతుల్యు నేమిగతిఁ గాంతుమొకో యను చున్నచోట ను
ద్దండబలైకరక్ష్యము శతక్రతురాజ్యము దాని నేల న
న్యుండు సమర్థుఁడే యనుచు నొల్లరు దివ్యులలోన నెవ్వరున్. 193

వ. అట్టిసమయంబున మునిజనసహితంబుగ ననిమిషులు నహుషుకడకుం జని మనం
బుల మనుజుం డనుననుమానంబు దక్కి యతని నింద్రపదవిఁ బరిపాలించుటకుం
బ్రార్థించిన నతండును దాను హీనబలుండ నని శంకించినం దమతమ తేజంబుల
యంశంబు లతని కొసంగి శక్తిమంతుం గావించి యభిషిక్తుం జేసిన. 194

క. మహనీయభవత్పదవీ,మహితుం డై నహుషుఁ డేచి మదమున ధర్మ
స్పృహ దక్కి తన్ను [3]నిప్పుడు, వహియింపఁగ సన్మునీంద్రవర్గముఁ బనిచెన్. 195

ఆ. ఇదియ కాదు మఱియు నెన్నియు దుర్ణ,యములు గలవు వానికలసి నిన్ను
వెదక వచ్చితిమి వివేకహీనుం డగు,నతనిఁ జెఱుప నిప్పు డవసరంబు. 196

1. క. గ. జ. గాని. 2. అ. నేమునున్. 3. క. గ. చెప్పుడు.

వ. అది [1]యెట్లంటేని వినుము నాఁడు హరిపంపునం జేసినయశ్వమేధంబున నీవపగత కల్మషుండ వైనను నహుషునకుఁ దేజోహాని సేమింజేసి యతని నాక్రమింప రా దయ్యె నిప్పుడు మహామునుల నధఃకరించి యతండు నిస్తేజుం డై యున్నవాఁడు గావున నీచేతం జెడు నట్లగుటయుం దురగమేధఫలపరిపాకంబయింకను త్సాహంబు సేయు మనుచున్నసమయంబున యమవరుణకుబేరులు సోమసహితంబుగా నరుగు దెంచి పురందరుం గాంచిన నతండు ప్రియం బంది యప్పటికార్యంబు తెఱంగు వారల కెఱింగించి తగినసంభాషణంబుల వారలఁ బ్రీతచేతస్కులం జేసి దృష్టి విషయదుస్సహుం డైననహుషు గెలుచునుపాయంబువిచారించునవసరంబున. 197

క. కష్టుం డగునానహుషుఁడు, నష్టాత్మకుఁ డయ్యెదివిజనాయక నీయు
త్కృష్టచరితమున సురలకుఁ, దుష్టిగ నిజరాజ్యసంగతుఁడ వగు మనుచున్. 198

క. మునివరుఁ డైనయగస్త్యుఁడు, సను దెంచిన శతమఖుండు సమ్మతి నుచితా
సన మిడి యర్ఘ్యముఁ బాద్యము,నొనరిచి యిట్లనియె సవినయోక్తి నతనితోన్.

ఆ. అధికవిభవ మెసఁగ నసమానశక్తిని, నాథుఁ డగుచు నున్ననహుషుఁ డిప్పు
డేమికతన భాగ్యహీనుఁ డై యుజ్జ్వల, శ్రీ దొఱంగె మునివరేణ్య చెపుమ.

—♦ అగస్త్యుఁ డింద్రునకు నహుషభ్రష్టతఁ దెలుపుట ♦—

వ. అనిన విని యమ్మునీంద్రుం డిట్లనియె నన్నహుషుని మోచి వేసరు చున్నమును లతనికడ గోష్ఠీవినోదంబుల నుండి బ్రాహ్మణంబు లయినమంత్రంబులు గోసంప్రోక్షణంబునందుఁ జెప్పంబడి యుండు నవి నీకుఁ బ్రమాణభూతంబు లగునే యని యడిగినం బాపనిశ్చయుం డై యతం డమ్మంత్రంబులు ప్రమా ణంబులు గా వనిన నే నమ్మాట నిషేధించి పూర్వాచార్యులచేత నభినందితంబు లగుమంత్రంబులు నిందించుట యజ్ఞానం బని వివాదంబు సేసిన నతండు కోపించి మదీయమస్తకంబు దన్నిన నతనిం గనుంగొని పుణ్యహీనుండును దేజోహాని దీనుండును నగుట యుపలక్షించి నీవు పూజనీయు లయినమహామునుల నిన్ను వహింపం బనిచితి వారలు గొనియాడుమంత్రంబులు గర్హించి తదియునుం గాక నన్ను నవమానించితి గావున నింద్రపదభ్రష్టుండ వై బహుసంవత్సరం బులు భూలోకంబున [2]నురగరూపంబున నుండు మని శాపం బిచ్చి పదంపడి యనుగ్రహించి భవదీయవంశజాతుం డయి యజాతశత్రుం డను పెంపు గలిగి యుధిష్ఠిరనామధేయుం డైనయొక్కసత్పురుషునిసందర్శనంబున దురితంబులఁ బాసి పుణ్యలోకంబు వడయుఁవాఁడ వనినఁ దత్క్షణంబ. 201

క. [3]స్వర్గపరిభ్రష్టుం డై, దుర్గతికిం బోయె నతఁడు దుష్టాత్ములకున్
దార్గత్యము సుజనులకు న, నర్గళసద్గతియు నగుట యరుదే యెందున్. 202

మ. అనినన్ దేవతలుం దపోధనులు న త్యానందముం బొంది రా

1. య ట్లుండె వినుము. 2. క. నురగంబవై. 3. గ. స్వర్గపదభ్రష్టుండై.

మునిఁ బూజించె నమర్త్యనాథుఁడు మనోమోదంబు సంధిల్ల న
య్యనురాగంబు చరాచరంబులకు హృద్యం బయ్యె సర్వాప్సరో
జనముం గౌశికుఁ గాన వచ్చె సుభగైశ్వర్యంబు శోభిల్లఁగన్. 203

వ. తదనంతరంబ. 204

ఉ. పావకుఁ డాదిగా దిగధిపాలురుఁ గిన్నరసిద్ధసాధ్యులున్
దేవగురుండుఁ దోడ చనుదేరఁగ వైభవ ముల్లసిల్ల నై
రావణదంతి నెక్కి యమరావతికిం జని యింద్రుఁ డాశచీ
దేవియుఁ దాను మోదమునఁ [1]దేలె నభీష్టవినోదలీలలన్. 205

వ. ఇవ్విధంబున మహానుభావుం డగునమ్మహేంద్రుండు. 206

క. ఆజ్ఞాభంగం బయినం, బ్రాజ్ఞేతరునట్లు దుఃఖపడి యుండడె తా
నజ్ఞాతవాసమును గా,లజ్ఞతఁ జలుపండె యన్యులకు వగ పేలా. 207

క. కావున మీపడినయర,ణ్యావాసక్లేశమునకు నజ్ఞాతవిధిన్
సేవకుల రైనదానికి, నోవకుఁడీ మీగు లఘుమనోవృత్తుల రై. 208

వ. అని యిట్లు సెప్పి శల్యుండు సభాసదులం గలయం గనుగొని. 209

ఉ. కౌరవనాథుఁ డానహుషుకైవడి నాశముఁ బొందు వాసవ
శ్రీరమణీయుఁ డై జయము సేకొని ధర్మజుఁ డంబురాశివే
లారశనాసముజ్జ్వలవిలాసమనోహరమేదినీవధూ
సారసమగ్రభోగముల సన్నుతి కెక్కెడుఁ దానుఁ దమ్ములున్. 210

వ. అని పలికి వెండియు నతండు పాండవాగ్రజున కిట్లనియె. 211

క. సౌఖ్యంబులు వొందు జగ, త్ప్రఖ్యాతులుఁ జెందుఁ దగఁ బురందరవిజయో
పాఖ్యానము విన్నను ద,ద్వ్యాఖ్యానము సేసినను జనావలి కనఘా. 212

క. మోహరము నడచు చుండఁగ, నీహరివిజయంబు వినునరేంద్రుఁడు రిపుసం
దోహంబు గెల్చుటకు సం, దేహం బించుకయు లేదు ధీరవిచారా. 213

వ. అనిన విని ధర్మనందనుండు మద్రపతిం బ్రస్తుతించి మహానుభావా భవదీయభా
షణశ్రవణంబునఁ జిత్తంబు కలంక దేఱె నని సంభావించి యతనికి సముచితంబు
లగుమజ్జనభోజనంబు [2]లొనరించి యనంతరంబ యతండు పయనంబునకు
నుద్యోగించిన. 214

ఆ. అతని ననుప నేఁగి [3]యధికసంప్రీతి నే, తెంచునప్పు డయ్యుధిష్ఠిరుండు
రణములోన మీరు రాధేయుఁ బలుకుట,మఱవకుండవలయుమమ్ముఁదలఁచి.

క. అనుటయు మద్రేశ్వరుఁ డా,తని నూఱడఁ బలికి గాఢతరముగ నాలిం
గన మొనరించి చనియె హా,స్తినాపురికి బలముతో నతిత్వరితగతిన్. 216

వ. అట్టియవసరంబున. 217

---

1. ఉ. గ. జ. దేలి రభీష్ట. 2. క. గ. లొనగూర్చి 3. జ. యతిశయప్రీతి.

మ. సకలారాతిభయంకరుం డగుచు నుత్సాహంబు వాటించి నే
లకు వ్రేఁగయ్యెడుభంగి వచ్చె రణలీలాకౌతుకం బొప్పఁ దా
నొక[1] యక్షౌహిణితోడఁ బాండవబలం బుల్లాసముం బొంద సా
త్యకి బాహాబలగర్వనిర్వహణవిద్యాప్రౌఢిసంరూఢుఁ డై. 218

వ. అంతం జేదిపతి యగుధృష్టకేతుండును జరాసంధనందనుం డగుసహదేవుండును
నె క్కొక్కయక్షౌహిణితోడం జనుదెంచిరి సహోదరు లేవు రగు కేకయ
పతులు నేకాక్షౌహిణీసమేతు లై యేఁగుదెంచిరి తదనంతరంబ. 219

క. కొడుకులుఁ దానును గుజ్జపు,దడములఁ గరిఘటల భటరథవ్రాతములం
బుడమి చలింపఁగ ద్రుపదుఁడు, గడువేడుకఁ దోడు సూపెఁ గౌంతేయులకున్.

వ. అదియును నొకయక్షౌహిణికిం గలిగి యొప్పె నయ్యవసరంబున ననుజతనుజ
సమేతుండును బార్వతీయమహీపాలసహితుండును నై యొక్కయక్షౌహిణి
యొడ్డనంబు దీర్చి. 221

క. చిందములమ్రోఁత బగతుర,డెందంబులతోడ దిక్తటీసంధులు నం
దంద పగులంగఁ గుంతీ,నందనులకుఁ దోడు మత్స్యనాథుఁడు సూపెన్. 222

వ. పాండ్యవిభుండు లోనుగాఁ బలుదెసలనుండి వచ్చినబలం బొక్కయక్షౌహిణికిం
గలిగియొప్పె. 223

క. ఏ డక్షౌహిణు లిమ్మెయిఁ, గూడెం బాండునృపసుతులఁ గ్రూరాహవసం
క్రీడావినోదమునకుం, దోడుపడం బూని యతికుతూహలవృత్తిన్. 224

వ. ఇవ్విధంబునం గూడి పెరిఁగియుధిష్ఠిరుసైన్యంబు గయ్యంబునకుం గాలుద్రువ్వుచు
నుండె నంత నక్కడం [2]గిరాతకాంచనసైన్యనిచయంబులం గూర్చికొని సమ
రంబునకు నమరి యొక్కయక్షౌహిణి గల భగదత్తుండు సుయోధనుం గలసె
భూరిపరాక్రముం డయినభూరిశ్రవుండును మహాబలుం డయినశల్యుండును
నేకాక్షౌహిణీసమేతంబుగా నేతెంచిరి వారలయట్ల సన్నద్ధుఁడై కాంభోజనాథుం
డై నసుదక్షిణుండను యవనేశ్వరుండును వచ్చె నత్తెఱంగున సమకట్టి జయద్రథ
ప్రముఖులై నసింధుసౌవీరనరపతు లరుగుదెంచిరి మాహిష్మతీపతి యగునీలుండు
యాదవవీరుం డగుకృతవర్మయు నవంతీశ్వరులు సోదరులు నగువిందానువిందు
లిరువురునుం గా నిన్నలువురు నొక్కొక్కయక్షౌహిణితోడఁ జనుదెంచిరి మఱి
యునుం బలుదెసలనుండి వచ్చి కూడినవాహినులు మూఁడక్షౌహిణులకుం గలిగె
ధార్తరాష్ట్రులకుఁ దోడుపడం బూనినయవి పదునొకండక్షౌహిణులయ్యె నట్టియెడ.

2. అక్షౌహిణికి మాఱుగాఁ దిక్కన 'నక్షౌహిణి' యనియె 'సహస్రాక్షౌహిణు—నూడరె' (ఉ ౧౨౩౮) ఇత్యాదిస్థలములం బ్రయోగించియున్నాఁడు. ఇది 'అక్షాదూహిన్యా ముపసంఖ్యానమ్' అను వార్తికముచే బాధిత మగుచున్నది. 2. గ. గిరాతనిచయంబునం గ.గిరాత-చ-యవన-జ. పుళింద-నిచయంబులం.

క. సవరణల నొప్పి యనిఁ బాం,డవబలముల మాఱ్కొనం గడంగుచు నత్యు
త్సవమునఁ జేర్చినసేనల, కవకాశము లేదు విడియ హస్తిపురమునన్. 226

క. నానాముఖములవిడియం,గా నియమించెను బలంబుఁ గౌరవపతి యా
[1]సేనలదొరలకు నిలువఁగ, నైనను నెడ లేమి నధికహర్షం బెసఁగన్. 227

వ. ఇత్తెఱంగునం గురుజాంగలంబున రోహితకారణ్యంబున మరుదేశంబున నహి
చ్ఛత్త్రంబునఁ గాలకూటంబున గంగాకూలంబున వారణావతంబున వటస్థానంబున
[2]విచ్చలవిడివిడిసిధనధాన్యాదిసమస్తవస్తువులకలిమిం జేసియెలమిమిగిలియున్నంత.

క. పాంచాలమహీవల్లభు,పంచినభూదేవుఁ డుచితభంగి నగరి కే
తెంచి ధృతరాష్ట్రుఁ బ్రీతిం, గాంచి కృపద్రోణవిదురగంగాసుతులన్. 229

వ. వారివారిమందిరంబులకుం జని కని సముచితాలాపంబులం బ్రసన్నచిత్తులం జేసి
దుర్యోధనుసందర్శనంబును నిర్వర్తించి నిత్యనిపుణారాధనంబున ధృతరాష్ట్రు
నభిముఖుం గావించి యొక్కనాఁ డక్కౌరవేశ్వరు పేరోలగంబున సమస్తసేనా
పతులం గలయం గనుంగొని యిట్లనియె. 230

సీ. ధృతరాష్ట్రపాండుభూపతులు సహోదరు, లగుటయు వారలయాత్మజులకుఁ
దమతమతండ్రుల ధనములుగైకొనఁ, దగుటయు మీకు నందఱకుఁ జూడ
నుచితంబ కాదె యట్లుండెఁ దొల్లింటిచం,దంబును మనకుఁ దెల్లంబ కాదె
ప్రాణగొడ్డము లగుపనుల వారలఁ దీర్పఁ, దలఁచినఁ బుణ్యంబుకలిమిఁ జేసి

తే. బాహుబల మొప్ప నిజరాజ్యపదవిఁ బొంది
యున్న వంచనమెయి మహిఁ గొన్న తెఱఁగు
నెఱుఁగుదుర కాదె దీనికి నెల్ల నియ్యె
[3]కొనియె నీపెద్దరాజు నే మనఁగ నేర్తు. 231

శా. నారీరత్నము నట్లు దెచ్చి సభలోనన్వారలుం జూడఁగాఁ
జీరల్ ప్రోవులు గాఁగ [4]నొల్చుటయు [5]లచ్చిం బుచ్చికోలున్ మహో
గ్రారణ్యస్థలి నిల్వఁ బంచుటయు దైన్యవ్యక్తిమై పల్కులున్
సైరింపం జనుపాండవేయులకు నీసంధిక్రమం బొప్పదే. 232

క. వీరలవృత్తముఁ బాండుకు,మారులవర్తనము తెఱఁగు మాత్సర్యము లే
కారసి ధృతరాష్ట్రునకున్, గారవమున బుద్ధి సెప్పఁగాఁ దగు మీకున్. 233

తే. పాండవులు కౌరవవులతోడఁ బగకు నొల్ల, రఖిలభూప్రజనాశన మగుటఁ జేసి
వార [6]లసద దని తలఁపంగ వలవ దధిక, ధర్మపరులైనకతమునఁ దగవునడచె.

వ. అందుఁ గూడినవి యేడక్షోహిణు లిందుఁ గూడినవి పదునొకం డక్షోహిణు లని
తలంతు రేని వినుండు. 235

1. గ. సేనకు దొరలకు. 2. గ. విడిదల వీడని. 3. జ. కొనినయీపెద్ద. 4. క. గ. జ. జేయు
టయు. 5. క. లక్ష్మిం. 6. 'అసదు' అని వ్రా. ప్ర.

క. బాహుబలఘనుఁడు భీముఁడు, సాహసరసికాత్ముఁ డయిన । సాత్యకియు మహో
గ్రాహవ భూమి సహస్రా,క్షౌహిణు లట్లగుట మీరు । చూడరె యెందున్. 236

క. గాండీవధన్వునాహవ,పాండిత్యముఁ [1]దలఁప నతని । భండనమున మా
ర్కొండు నని యొకఁడు గడఁగుట, కొండం గని తగరు దాఁకఁ । గోరుటగాదే.

క. ఆబీభత్సునిభూరిభు,జాబలమును దుర్నివార । శౌర్యము శరవి
ద్యాబహుళతయును బందికి, నై బవరముఁ జేసినట్టి । హరుఁడ యెఱుంగున్. 238

వ. అదియునుం గాక. 239

మ. వివిధోపాయపరాయణుండు రిపుదో । ర్వీర్యాపహారక్రియా
ప్రవణోద్యోగుఁడు మంత్రరక్షణకళా । ప్రావీణ్యగణ్యుండు ధై
ర్యవివేకాదిగుణోత్తరుం డఖిలవి । ద్యాజాలసంవేది మా
ధవుఁ [2]డాదిక్కటె పాండవేయుల క । సాధ్యం బెద్దియుం గల్గునే. 240

ఆ. అదను దప్పకుండ । నమ్మహాత్ముల నెమ్మిఁ, బిలువఁబంచిహితముఁ । బ్రియము రెండు
పక్షములకు నగుట । [3]పాటించి తగవుమైఁ, గొంతభూమి యిచ్చి । కూడిమనుఁడు.

చ. అనవుఁడు భీష్ముఁ డిట్లనియె । నక్కట భాగ్యము గాదె పాండునం
దను లోకయాపదం బడక । ధర్మగతిం దగ నందఱున్ సుహృ
జ్జనులను గృష్ణునిం గలసి । సమ్మద మొందుటయుం బ్రశాంతిమై
మనముల నీసు దక్కి మృదు । మార్గము వట్టుటయుం దలంపఁగన్. 242

క. నీవాక్యము విప్రస్వా,భావిక మై యిట్లు శ్రుతికి । బరుషం బైనన్
భావింపఁ గార్యమునయం, దేవిధమున సభకు నింత । యిష్టం బగునే. 243

చ. సమయుమ యూఁది పాండవు ల । శక్తులచాడ్పున నిందు నాఁడు బ
న్నము వడి చన్న దైన్యము వ । నంబున బడ్డవిషాదవేదనా
శ్రమము విరాటువీట లఘు । సంచరణంబున దాఁగి యున్నదుః
ఖమును జగం బెఱుంగదె య । కల్మషులం బఱుపంగఁ బాడియే. 244

క. పితృధన మగుపా లుచిత,స్థితి వారల కిచ్చి నిర్వి । శేషుం డై యీ
పతి లోకము మెచ్చఁగ నిజ,సుతనివహమునట్ల వారిఁ । జూడఁగవలయున్. 245

వ. అట్లుం గాక. 246

చ. కడవఁగ జూద మాడి యవుఁ । గా దన నేరక సత్యభాషణం
బెడలిన వచ్చుధర్మగతి । హీనత కోర్వక రాజ్యహీనతం
బడుటకు నోర్చి ధర్మజుఁడు । పంచిన సైరణ సేసెఁ గాక క
వ్వడి నెఱగిన్క కెట్టిమగ । వారును నోర్తురె యిజ్జగంబులన్. 247

వ. అనిన విని కర్ణుండు కనలి యిట్లనియె. 248

క. జను లెల్ల నెఱింగిన యీ,పని యేటికి నుగ్గడింపఁ । బలుమఱు దుర్యో

1, క. ధలఁప కతని. 2. అ, డాదిక్కఁట. 3, క, గ. భావించి.

ధనునకయి శకుని జూదం,బున మేదిని గెలిచె ధర్మపుత్త్రుం డోడెన్. 249

ఆ. దీన నేమితప్పు కానకు నేఁగిన, యతఁడు సమయవృత్తి నాక్రమించి
తండ్రిపాలు మాకుఁ దగు నంచు నడియరి,తనము సేసి రాక తప్పఁగాక. 250

క. విరటుఁడు ద్రుపదుఁడుఁ దోడుగ, బరవసమున నెత్తి విడిసి బలిమి నడిగినం
గురుపతియు వెఱచి యిచ్చునె, ధరలోఁ జక్కఁగ మిట్టితగవులు గలవే. 251

వ. అనిన గాంగేయుండు గటకటంబడి కర్ణున కిట్లనియె. 252

ఉ. చిక్కనిపోటుమానిసి విసీ వినువారలు నవ్వ నేమిగా
నెక్కుడుమాట లాడెద వహీనపరాక్రమశాలి యర్జునుం
డొక్కఁడఁ యార్వురన్ మనల నుగ్రరణంబున గెల్చె నిన్న నేఁ
డిక్కడఁ బల్కుల గెలిచె దీ వతనిన్ మనరాజుకొల్వునన్. 253

క. నరుఁ [1]డాలవెనుక వచ్చినఁ, గురురా జడుగంగ నీవు గురుఁడును గృపుడున్
గురుసుతుఁడు వినఁగ వారల,చిరసమయము దెగుట యేను జెప్పనె తెలియన్.

తే. అనిన ధృతరాష్ట్రుఁ డాపగా తనయు భక్తి
ననునయించి రాధేయునిఁ గినిసి ప్రియము
దోఁపఁ దా నిట్టు లనియె నా ద్రుపదమనుజ
పతిపురోహితుతోడ సంభ్రమము లేక. 255

ఉ. [2]మంచిగ నేను బంధులును మంత్రిజనంబులుఁ బెద్దలున్ విచా
రించి సమస్తభూప్రజకుఁ బ్రీతిగ బిడ్డలపాలి కిచ్చు పు
త్తెంచెద సౌమ్యు నొక్కరు మదీయమనోగతి వారిఁ గూడి వ
ర్తించు తెఱంగు గైకొనుట దెల్లము కౌరవజాతి కెంతయున్. 256

తే. నీవు మున్నేఁగు మని యతనికి విభూష, ణాంబరమ్ములతోఁ దమ్ములంబుఁ బెట్టి
[3]వీడుకొలిచ్చిపుచ్చిన విప్రవరుఁడు, పాండుజనపాలతనయులపాలి కరిగె. 257

వ. ఇట్లు సని వారలం గని యతండు సముచితసంభాషణంబులఁ దనపోయివచ్చిన
తెఱం గెఱింగించె నిట ధృతరాష్ట్రుండును బుత్త్రమిత్త్రవృద్ధామాత్యసహితం
బుగా నాస్థానాసీనుం డయి యుండి సంజయు రావించి యతని కిట్లనియె. 258

తే. పాండునరపాలసుతు లుపప్లావ్యమునకు
వచ్చి యున్నారు నీ వేగి వాసుదేవ
సహితముగ వారిఁ గని తద్విషాద మేమి
భంగి మాను నమ్మెయిఁ దగఁ బలుకవలయు. 259

— ధృతరాష్ట్రుఁడు సంజయునిఁ బాండవులయొద్దకుఁ బంపుట —

క. మీయయ్య మీరు వనవా,సాయాసము నిస్తరించి యభ్యుదయమునన్

1. క. డాలమున్నను. 2. గ. మంచిద మేము. 3. గ. వీడుకొలుపునఁ బుచ్చిన.

డాయుట విని ముదితాత్ముం, డై యిట పుత్తెంచె నన్ను ననుమిా మొదలన్.

వ. అని చెప్పి చుట్ల నున్నవారలతో ని ట్లనియె. 261

క. దుర్యోధనుండు కార్యా,కార్యజ్ఞుఁడు గామి నిట్టికలక గలిగెఁ గా
కార్యులు దృఢధైర్యులు రణ, ధుర్యులు నగుపాండుసుతులు దోషాన్వితులే.

క. క్షీరోదకవృత్తి మనము, వారలునుం గలసి బ్రతుక వలదే నెమ్మిన్
వా రిడుమలఁ బడఁ దగియెడు,వారే పితృభాగ మేలువారలు గారే. 263

ఆ. మనల నింక నమ్మరన్నృతాత్ము లన్యాయ,పరులు గర్వలనుచుఁ బాండుసుతులు
గూడి మనుట కియ్యకోన నేర రైనను, ధర్మజుండు గలఁడు దగవు నడప. 264

వ. అని పలికి వెండియు. 265

మ. మన కీ కుండఁగ వచ్చునే మనము దుష్కర్మనంబు వాటించి యొ
ప్పనికార్యంబులు వట్టి వారికిఁ దగం బా లీక గర్వంబు లా
డిన నిక్కం బగునల్క నర్జునుఁడు గాండీవంబు మోపెట్టఁ గృ
ష్ణునిసారథ్యము నై జగత్త్రితయసంక్షోభంబు [1]గా కుండునే. 266

తే. అలఘుగదఁ బూంచికొని భీముఁ డతిరయమునఁ
గురుకుమారులపైఁ దీవ్రకోప మెసఁగఁ
గవియు టాత్మ భావించినఁ గంప మడరు
నిక్క మెవ్వరు మార్కొని నిలుచువారు. 267

సీ. కవ లగ్రజన్ములకంటె నేమిటఁ గీడు, ద్రుపదుఁ డల్పుండె తత్సుతులు బాహు
గర్వసమగ్రులు గారె విరాటుండు, నాతనితమ్ములు నాత్మజులును
నసదులే సాత్యకి యలఁతులఁ బోయెడు,వాఁడె వృష్ణికుమారవరు లనేకు
లట్టియోధులు పోర నరవాయి [2]గొందురే, పాండ్యుండుఁ గేకయపతులు నాది

తే. యైనబంధులు మిత్త్రులు నగ్గలికలఁ, గొఱఁతవడియెడువారె యందఱను గెల్వ
నోపినను రుద్రునకు నైన నోర్వరాని, ధర్మపుత్త్రుకోపమునకుఁ దలఁకవలదె.

వ. అని పలికి సంజయుదిక్కు మొగం బై యెల్లవారును విన ని ట్లనియె. 269

తే. నీవు ధర్మజుపాలికి నెమ్మి నరుగు, మతఁడు పేరోలగం బున్నయవసరమునఁ
గాన్పుమతనికి ననుజవర్గంబునకును, బంధులకు నింపు పుట్టంగఁ బలుకుమచట.

క. నెయ్యము వాటించి కడుం, దియ్య మెసఁగ నలుక లెల్లఁ దీఱునటులుగాఁ
గయ్య మనుతలఁపు లోనుగ, నయ్యమనందనుఁడు మాను నట్టి తెఱఁగునన్.

—సంజయుఁ డుపప్లావ్యంబున నున్నపాండవులయొద్దకు వచ్చుట—

వ. [3]శాంతిప్రకారంబునం గార్యంబునడపియొక్కటియై మనుట యొడఁగూర్చిరమ్ము
రథం బెక్కి పొమ్మనితగిన తెఱంగున వీడ్కొలిపిన సంజయుండునుం జనియుపప్లా
వ్యంబు సొచ్చి మాధవుమందిరంబున కరిగి యభ్యంతరవినోదంబుల నరసహితుం

1. క. గ. జ. సంధిల్లదే. 2. ఙ. గొండ్రెడె యాఫాం. 3. ఘ. శాంతిప్రకారంబు నడపి,

డై యున్నయన్నారాయణునకుం దనరాక యెఱింగించి పుచ్చి తగఁ బ్రవేశించి భయభక్తివినయసంభ్రమంబులు మెఱయ వారలం గాంచియమ్మహాత్ములిరువుర సంభావనంబులును సంభాషణంబులునుం బడసి సంప్రీతచేతస్కుండై మఱునాఁడు ధర్మతనయునోలగం బున్నసమయంబు వేచి సముచితంబుగా నతనిం గని సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లిన నతండుం బ్రియపూర్వకంబుగా నాదరించి సమీపంబున నునిచినం గొలిచి యుండి యతని కిట్లనియె.

తే. భాగ్యమున నిన్నుఁ గనుగొనఁ బడసి నాదు
చూడ్కి చరితార్థ మయ్యె నక స్తోకపుణ్య
ధనుఁడు మీతండ్రి ధృతరాష్ట్రధరణినాథుఁ
డిందు మీయున్కి విని ప్రియ మెసఁగ మెసఁగ. 273

క. అనుజులు నీవును ద్రోవది,యును బుత్త్రచయంబు నున్నయోగక్షేమం
బున కెఱఁ గారయఁ బుత్తెం, చె నితాంతస్నేహపూర్ణచేతోవృత్తిన్. 274

వ. అనిన సూతనందనునకు ధర్మనందనుం డిట్లనియె. 275

క. ఆరాజు మా దెసం గల, కారుణ్యముకతమునను సుఖంబున నిట్లు
న్నారము నినుఁ బుత్తెంచిన, గారవమున నాదుమది వికాసముఁ బొందెన్. 276

క. అమ్మనుజేశ్వరునకు సే,మమ్మె పుత్త్రికలు సుఖులె మనుమలు సమ్మో
దమ్మునఁ బెరిఁగెద రే నగ, రమ్ముల భూములను శుభపరంపర గలదే. 277

సీ. ద్రోణుండుఁ గృపుఁడును ద్రోణసుతుండును, సుఖ మున్నవారె సుశ్లోకుఁడైన
భీష్ముండు కుశలియే పెద్దతనంబిచ్చి, యాతనిఁ గారవ మనుసరించి
మెలఁగుదురే బ్రాహ్మణులకు మన్ననఁ గల్గి, యుండునే నేమర్థి నొసఁగినట్టి
వృత్తులు సెల్లునే [1]యొత్తొరు వొందుల, వలనఁ బుట్టదు గదా [2]కలఁకులందుఁ

తే. బుట్టినప్పుడు గాండీవిభుజబలంబు, దలఁతురా భీమసేనుగదావిహార
ముగ్గడింతురె కవలు మహోగ్రరిపుల, భూము లంతంత కొత్తుటఁ బొగడఁబడునె.

మ. ఒకనాఁడా తమముందటం బలుమఱున్ హోరాటమై నేల యొ
త్తికొనంగా బవరంబులన్ గెలువఁగాఁ దెల్లంబుగాఁ జూచి పాం
డుకుమారాళి నుతింప కుండుదురె యుగ్రాటోపంబునన్ ఘోషయా
త్రకు గంధర్వులు వచ్చినప్పటిచరిత్రం బాత్మలం బాయునే. 279

క. వినుము మనము మధ్యస్థుల, మని నర్జును నెదిరి సంజయా యిట మున్నె
వ్వనికిని మానముఁ బ్రాణం,బునుఁ దగఁ దక్కించుకొనఁగఁ బోలెనె చెప్పుమా.

క. దుర్యోధనునింటం దగు,కార్యమునకు ఖడ్గమునకుఁ గలవాఁడై చా
తుర్యంబు మెఱయుకర్ణుని, యార్యత్వము సెల్లు చున్నయదియే నెమ్మిన్. 281

1. క. యొత్తుడు వొరువుల. 2. అ. కలఁకులంధు.

వ. అనిన విని సంజయుండు సవినయంబుగా నిట్లనుఁ గురురాజునొద్ద నవినీతులు నీతి
మంతులు సత్త్వసంపన్నులు దురహంకారులు మఱియు [1]వివిధప్రకారులు నయి
బెరసి యుండుదురు వా రొక ళ్లొకళ్ల మాటలం బోయెడువారు గారు కావున
వారి నంత యనం బనిలేదు నావిన్నపంబు చిత్తగింపుము. 282

క. పాం డొండఁగఁ దలఁచితి నీ, విదుశిశిర మైనవిమల।హృదయంబున వా
రందఱకును సేమం బిట,ముందఱ లేకున్న నేఁడు।మొదలుగఁ గలుగున్. 283

క. ధృతరాష్ట్రభూపతికి వృ,ద్ధతకతమునఁ జిత్త మొకవిధము గామి సుతో
ద్ధతి మాన్పఁడ నాఁడు మనః, క్షతి పిదపం బుట్టి యిపుడు। శాంతుండయ్యెన్.

తే. ఇట్టిచందంబు లెల్లను। నీవు పుణ్య,చిత్తవృత్తి[2]వై సైచినఁ। జెల్లివచ్చె
నీయజాతశత్రుత్వంబు। నిఖిలలోక,విశ్రుతము గాదె ధర్మప్ర।వీణహృదయ.

చ. జగముల నెల్లెడన్ దురిత।సంతమసంబు జయింపఁ గోరి పో
ల్పుగఁ బరమేష్ఠి నిల్పిన వె।లుంగు మహీసురు లట్టివారికిం
దగవు ఘటింప సత్పురుష।దత్తము లై చనుజీవనంబు లెం
తగుమతు లైన మార్తురె ప।దంపడి యాయువు శ్రీయు నొల్లరే. 286

ఉ. ఒక్కొకచోఁ గడంగి ప్రతి।యోధులు మార్కొనునప్డు డాత్మలన్
నెక్కొని మోములం బొడము।నెవ్వగతోడ జనంబు [3]లిట్టియం
దక్కట భీముఁ డైనమన।యర్జునుఁ డైనను మాద్రిపుత్త్రులం
దొక్కరుఁ డైన నీపగఱ। నుక్కడఁగింపరె [4]యొక్కవేల్మిడిన్. 287

క. వారొక యాగ్రహవృత్తిం, గూరియు ధర్మంబు సెడుట।కుం జాలరు దు
ర్వారబలు లయ్యుఁ బాండుకు,మారులు శాంతాత్ము లండ్రు। మనుజాధీశా.

క. నలువురు తమ్ములు భవదా,ప్తులుఁ గృష్ణుఁడు వినుచు నుండ। భూవర నీ కేఁ
గొలువునను విన్నవింపం, బలుకులు గల వవధరింపు। పరిపాటి మెయిన్. 289

చ. అనవుడు వీరె తమ్ములును। నాప్తులుఁ గృష్ణుఁడు [5]వీరె తక్కొ
ల్వునఁ గలయట్టిసర్వజను।లున్ వినుచుండెద రయ్య నిన్ను నే
మను మని పంచెఁ జెప్పు మది। యంతయు నేర్పడ నన్న ధర్మనం
దనుగరువంపుఁబల్కు-లవి।ధంబునకున్ మదిలోన నుల్కుచున్. 290

ఆ. సంజయుండు కృష్ణు। సద్భక్తినీక్షించి, పవనపుత్త్రుఁ బార్థుఁ। గవల ద్రుపద
తనయు సవినయమున।గనుఁగొని ప్రీతిఁ బాం,చాలు మత్స్యధరణి।పాలుఁ జూచి.

వ. సావధానుల రై వినుం డని పలికి యుధిష్ఠిరుదెసకు మోడ్పుఁగేలు నిగిడించి
యిట్లనియె. 292

ఉ. శాంతతఁ బొంది కార్యము దె।సన్ ధృతరాష్ట్రమహీశుఁ డాత్మ న

---

1. గ. వివిధప్రకారంబులు బెరసి. 2. క. సైరించిన. 3. క. గ. లిట్టిచో. 4. గ. చూడవెల్లి
డన్; జ. యందు రెల్లెడన్. 5. క. వీఁడె.

త్యంతముఁ దెఱి నన్నిట ప్రి❦యంబునఁ బంచెదునప్డు నాకుఁ దే
రెంతయు వేఁడ్కఁ దాన వెఱ ❦ వేర్పడఁ జెప్పుచుఁ బన్నఁ బంచె ని
ట్లింత ఘటించెఁ బొందు [1]మన ❦ మీపదనం దెలి వొందఁగాఁ దగున్. 293

క. చులుకని కార్యము సేయం, దలఁచుట మీయట్టి సర్వ❦ధర్మజ్ఞులు శాం
తులు ననఁ బ్రసిద్ధు లగుపెద్దలకుం దగ వగునె యెవ్వి❦ధంబునఁ జూడన్. 294

ఆ. మడుఁగుఁజీరయందు ❦ మసి దాఁకినట్లు మీ, సత్కులమునఁ గల్మ❦షంబు కౌర
వేంద్రుకతనఁ బొందె ❦ నింతయుఁ బాపంగ, నీవ నేర్తు [2]కార్య❦నిపుణహృదయ.

చ. అఖిలజనక్షయం బయి జ❦యాపజయంబులు రెండునుం దుదిన్
సుఖములు గానియీపనికిఁ ❦ జొత్తురె యుత్తము లట్లుఁగాక యా
నిఖిలసుఖంబు లేమిటికి ❦ నీ వని వృద్ధజనంబు బాలురన్
సఖులను బంధులన్ గురులఁ ❦ జంపితయేని దయాపయోనిధీ. 296

ఉ. పెట్టనికోట నీకు హరి ❦ భీముఁడు నర్జునుఁడున్ రణంబునం
దొట్టినమంట లాకొలఁది❦యోధుల సాత్యకియున్ విరాటుఁడుం
జుట్టపుమేరు వుగ్ర[3]రణ❦శోభితుఁ డీద్రుపదుండు నిన్ను ని
ట్టట్టన వచ్చునే సురల ❦ కైనను నొల్లవుగాక చివ్వకున్. 297

వ. మఱియు నక్కడ. 298

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ❦ ద్రోణసుతుండును గర్ణశల్యులుం
బ్రాణము లాసుయోధనుని❦పాలివ యంద్రు నిజానుజన్ముల
క్షీణపరాక్రముల్ సుతు ల❦జేయులు బాహ్లికసోమదత్తు లా
స్థాణున కైన నోడరు వ❦శంబె జయింపఁగ వారి నేరికిన్. 299

ఆ. అధిప యిట్టి మీకు ❦ నన్యోన్యకలహంబు, నాకుఁ జూడ మే ల❦నంగ రాదు
రెండుపక్షములకుఁ ❦ బ్రియము హితంబును, నాత్మఁ గోరువారి ❦ నడిగిచూడు.

వ. అని పలికి సూతనందనుండు గొలువు గలయం గనుంగొని. 301

ఉ. మ్రొక్కెద వాసుదేవునకు ❦ మోడ్చెదఁ జేతులు సవ్యసాచికిం
దక్కటిమిత్త్రబాంధవహి❦తప్రియమంత్రివయస్యకోటికిన్
స్రుక్కుచు విన్నవించెద న❦సూయలు దక్కి యనుజ్ఞ సేయుఁడీ
యుక్కరుణాకరున్ శరణ ❦ మనిదె వేఁడెదఁ గ్రోధశాంతికిన్. 302

వ. అనుచుం బ్రణామపూర్వకంబుగాఁ బాండవాగ్రజువదనంబునం జూడ్కి నిలిపి దేవా యుపశమించుట లెస్స యిమ్మెయికిం గురుపితామహుండును సంతసిల్లు నాతని కనుమతం బయిన తెఱంగు సర్వలోకసమ్మతం బగు నన విని ధర్మనందనుం డిట్లనియె. 303

ఉ. నెయ్యము దప్ప నొం డొకటి ❦ నీచెవి సోఁకెనె నాదుపల్కులం

1. గ. చ. మన మీవలనం; జ. మన కీపదనం. 2. ఘ. ధర్మ. 3. క. సుత.

దియ్యెడ సంజయా యనికి నిమ్మెయి నల్కెడు నీవు మాకుఁ దాఁ
గయ్యము దక్కి మన్కి తగుకార్యము గాదొకొ పోరితంబు లే
కయ్యెడ నర్థసిద్ధి వెడఁగైనను నొల్లక యెంతు సేయునే. 304

క. జనులకు నెల్లను బథ్యము, లనఁగా ధర్మానుగతము లగు ననఁ బొగడం
జనుపనులు సేయుభీమా, ర్జునులే దుష్కర్మమునకు రోయనివారల్. 305

క. మది సుఖము గోరి దుఃఖం, బొదవం గలకార్యములకు నుత్సాహము సే
యుదు రొప్పనితృష్ణం బడి, చదు రేమియు లేనియట్టిజను లాతురులై 306

ఆ. యోగ్యతృష్ణదారు లుచితంపుఁ[1]గొలఁదిమై, వడచినట్టివారు వెడిదములకు
నంత సొత్తు రెట్లు సంతాపకారుల, కాక పెనఁకువలు సుఖంబు లగునె. 307

వ. భోగంబులు వలదా యని తలంతువేని. 308

తే. వస్త్రమాల్యానులేపనావసరములును, జతురతూర్యత్రయంబులసమయములును
నేము వెలిగాఁగ మాతండ్రి కించునెట్లు, పుత్త్రు లన వట్టి మమ్మేల పోవఁద్రోచు.

వ. అయినను నొకమాట సెప్పెద సమచిత్తుఁడ వై విను మని యిట్లనియె. 310

క. తానైన నపుడు వక్రుం, డై నీతిపథంబు విడిచె నక్కట పతి మ
మ్మైనను జక్కని తెరువునఁ, బూని నడపుఁ డనుచు నిపుడు బుద్ధులు సెప్పెన్.

క. ఎదిరిం దమయట్టులకా, మదిఁ దలఁచినఁ బొసఁగుఁగాక మాకుం [2]గుడు మిం
డిదె మీరు వ్రక్కఁ గొనుఁ డని, చదు రడిచిన మనసుపొందు చక్కంబడునే.

వ. అని చూపి చెప్పి వెండియు. 313

ఉ. సంపద దక్కి యుండఁగ నశక్తు లనం జనుమమ్ముఁ బిల్చి పూ
జింపఁగ నంతబేలె పతి సెప్పెడువారలబుద్ధి నాఁడ మ
న్నింపఁడ యింక నేల యగు నీ వడియాసల వచ్చి రిత్తగా
రింపక మాను మాతనిచరిత్రము నీకును మాకు వింతయే. 314

క. తగుమాట లాంబికేయుం, డగు నని కైకొనునె యెన్నఁ డైనను గొడుకుఁ
మగఁటిమి గలఁ డనియెడు[3]నమ్మిగఁ జూచుచునుండు విషము మ్రింగెనయేనిన్.

క. జూదపుసిరి యాసపడం, గా దని విదురుండు సెప్పఁగా నప్పుడు క
ర్ణాదులపలుకులు విని పతి, యాదరణము సేయ కున్న [4]నంతనతీరున్. 316

క. ధృతరాష్ట్రుం డిటమీఁదను, సుతులును శకునియును సూతసుతుఁడును దను నే
గతి నడిపించిరి వారల, మతము యనుష్ఠించుఁగాక మరలంబడునే. 317

క. కార్యము తెఱఁ గిట్టిది నీ, వార్య చరితమునకుఁ జొచ్చి యాడెదు నీ కా
దుర్యోధనునవినయ మని, వార్యం బని యెఱుఁగరామి వలనో వెడఁగో. 318

క. చక్రధరు లెక్కగొనఁడు ప, రాక్రమనిధి యర్జునునకు రాధేయభుజా

1. గ. బోఁడిమై. 2. క. గుడమిం. 3. జ. నెమ్మిగ. 4. ఘ. యంతన తీరెన్.

విక్రమ మెదురుగఁ గొని ని, ర్వక్రముఁ జేసికొను వాఁడు • రాజ్యం బెల్లన్.

వ. అని పలికి వెడవెడ యలుక వొడమిన మఱియు నిట్లనియె.

శా. చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు న•శ్వత్థామయుం గర్ణుఁడున్
భూపశ్రేష్ఠుఁడుఁ [1]దారు మున్నెఱుఁగరే • [2]పో రెట్లుఁ గయ్యంబు లా
శాపాశంబులు చుట్ట లా వెఱఁగియుం • జా వేఁడి మార్కొందు రిం
తే పో తమ్ముఁ గపిధ్వజప్రభల యం•ధీభూతులం జేయవే. 321

క. మును మమ్ముఁ బొగడి పదపడి, యని వారల గెలువ నరిది • యని పొత్తుగఁ జె
ప్పినమాటకు నే నోడఁబడ, విను సంజయ పక్షపాత•వృత్తి విడువుమీ. 322

స్రగ్ధర. గాండీవజ్యారవం బు•త్కట మయి పెలుచం • గ్రమ్మినన్ భీమబాహా
దండం బేపారి శుంభ•ద్గద జడియుచు రౌ•ద్రంబుగాఁ దోఁచినన్ వే
దండద్వంద్వంబుమాడ్కిం • దఱిమి కవలు మా•ద్యద్గతిం దాఁకినం జా
కుండం బోకుండఁ గౌర•వ్యులకు వశమె బి • ట్టుల్కి మూర్ఛిల్ల కుండన్. 323

వ. కావున. 324

చ. రణమున వారలన్ గెలువ • రాదనుపల్కు ల టుండ నిమ్ము స
ద్గుణుఁడవు నీవు వచ్చితి ప్ర•కోపశమంబుగఁ బల్కి తింక సై
రణ దగఁ జేయువారము ప•రాభవ మొందియు మున్ను వారి దు
ర్గుణములు సైచు టీవు నొక•కొంతయెఱుంగుదు వింత యేటికిన్. 325

ఉ. ఇంకను నట్ల కాఁ దలపు • మే మొకకీడునకుం దొడంగ మా
శంకలు దక్కి మయ్యకు వి•చారము గల్గెనయేని బాంధవం
బంకుర మొత్త మావలన • నక్కటికం బొలయంగ మమ్ము నే
వంకకుఁ బోవనీక గరు•వంబు జగంబు ప్రశంస సేయఁగన్. 337

క. రం డని పిలువఁ బనిచి పా, లిండని కొడుకులకుఁ జెప్పి • యింద్రప్రస్థం
బొండెను వే ఱొకపట్టణ, మొండెను మా కిచ్చి యనుచు • టుచితము కాదే.

ఉ. నావిని సంజయుండు నర•నాథున కిట్లను నెట్టితప్పులుం
బోవఁగఁ ద్రోచి తొలిమియ • పూనుదు గావున నన్నిమాట లి
ట్లీవు వినంగ నాడియును • నేఁ దనివోవక విన్నవించెదన్
నీవిభవం బహింసయున•నింద్యరిత్రమ కాక [3]యన్యమే. 328

క. పా లీక కౌరవులు దు,శ్శీలతఁ జెడఁ దలఁచిరేనిఁ • జెప్పెద రుధిరా
భీలాన్నంబునకం టెను, మే లగు భిక్షాన్న మైన • మీనడవడికిన్. 329

వ. అది యెట్లంటేని. 330

సీ. రాజసూయమహాధ్వ•రం బట్లు నడిపి స, ద్విజులకు సురలకు • దృప్తిఁ జేసి
శాంతియు దాంతియు • సకలలోకంబుల, బొగడొంద బ్రదికిన•పుణ్యమూర్తి

1. గ. దాను మున్నెఱుఁగరే. 2. క. పో రెట్లు, గ. పొం టెట్లు 3. ఘ. యల్పమే.

విట్టినీచరితం[1]బు హింసాకళంకిత, మగు చెంత యొప్పదు నదియుఁ గాక
దుర్ణయవృత్తి దుర్ద్యూతంబు పుట్టించి, యంతలు సేసిన యట్టివారి
తే. నేల గర్వంబు సెల్లంగ నిచ్చి జగము, చేతఁ [2]దిట్టులు వడునట్లు సేసి పోయి
తేల యడవుల నిమ్మెయి నిడుమ గుడిచి, క్రేల తాల్మియ ధనముగా నింతవడితి.

క. తుదిఁ బోయి క్రూరకర్మా, స్పద మగు తెఱఁగు[3]న పఁ జొచ్చి బంధుల గురులన్
వెదకి వధియించు సౌఖ్యం, బది యేటికి నార్యనింద్య మస్థిర మరయన్. 332

తే. అల్లులకు మ్రింగఁ జేఁ దైన హాలహలము
భంగిఁ బొంగెడు కోపంబు మ్రింగికొనఁగ
నీలగళు నెన్ని [4]ని న్నెన్నఁ బోలు నట్టి
నీవు సాలినఁ గా కేల నెగడుఁ బేరు. 333

చ. అనవుడుఁ బాండురాజతనయాగ్రణి సంజయుమోముఁ జూచి యి
ట్లను నది యెల్ల నీపలికినట్టిద ధర్మవు లట్ల యుండి బో
ధను లరయంగ వచ్చిన నధర్మము లై చెడుఁ గొన్ని ధర్మవ
ర్తనములు గాక తోఁచి తుది ధర్మము లై చనుఁ గొన్ని [5]కర్మముల్. 334

వ. కావున నన్ను దూఱఁ దలంచి తేని నాచేయునది ధర్మం బధర్మం బని నిరూపించి మఱి దూఱుము కోపంబు నివారింపం దగు నహింసయ యుత్తమధర్మం బగు నట్లయినను వంశదూషకులును లోకకంటకులును నగుపాపాత్ముల నిర్మూలనం బుగాఁ జెఱచుట ధర్మం బని పెద్దలచేత విందు మది య ట్లుండె సంగ్రామంబు రాజులకు ధర్మం బవుంగాదని నీవ చెప్పుమట్లుంగాక [6]యిదికర్తవ్యం బిది యకర్తవ్యం బని మనల శాసింప వాసుదేవుండు గలండు మన కీవితర్కం బేటికి నితండు ధర్మాధర్మవిదులకు గురుండు కార్యాకార్యనిరూపకులకు శిక్షకుండుచితానుచితజ్ఞులకుఁ బ్రదర్శకుం డితనిపంపునం గాదె యదు భోజాంధక వృష్ణిసృంజయ కేకయ ప్రభృతిభూపతిప్రకరంబు ప్రశస్తపథంబునం బ్రవర్తిల్లు చున్నయది విశేషించి మాకు నితనిబుద్ధియ సమస్తపురుషార్థమ్ములకు మూలం బగుట నితనివచనం బవశ్యంబు నలంఘనీయం బనిన విని జనార్దనుండు సంజయున కి ట్లనియె. 335

ఉ. పాండుతనూజకోటికి శుభం బెడఁ గోరుదు నెప్డు నాంబికే
యుండును బుత్త్రపౌత్త్రమహిమోజ్జ్వలుఁ డక్కట చేటు మేలె యం
చుండుదు [7]నట్లు గాన తెలి వొందిద యతం డిట వీరిఁ [8]దేర్పఁగా
నిండుమనంబుతోఁ బనిచె ని న్నని దీనికిఁ బ్రీతిఁ బొందితిన్. 336

ఆ. నీవు నుచితవృత్తి నెయ్యంబు ధర్మంబు, వినయ మొప్పఁ దెలిపి వీరు శాంతిఁ

1. జ. బహింసా...యొప్పెడు. 2. గ. బ్రువ్వంగఁ బడునట్లు. 3. జ. నఁ జరించి. 4. క. గ. యెన్నంగ. 5. గ. కర్మవుల్. 6. జ. కర్తవ్యం బిది యని మనల. 7. చ. గ. జ. నట్లుఁ గాక. 8. జ. దీర్పఁగా.

బొందునట్టిభంగి పొసఁగఁ బల్కుటయును,[1] నాకు సమ్మదం బొనర్చె నిపుడు.

ఆ. అనఘ యిట్టు లంతయును దలఁపం గను, నెనసినట్టు లుండెనేని వింటె
పాండవాగ్రజన్మపలుకులచందంబు, సూడ సంధి లేనిచొప్పు దోఁచె. 338

క. అది యట్టిద సంధానము, దుది నెమ్మెయిఁ [2]గల్గు నెట్లు దుర్యోధనుఁ డు
న్మదుఁడు ధృతరాష్ట్రభూవిభు,హృదయంబు తెఱంగు గొంత యెఱుఁగుదు మొకడా.

క. ఆరాజు సేయునెయ్యము, గారామును జెప్పె దీవు గడుఁదీపులు గా
వీరు దమపాలు వడయక, నేరిమిమాటలన [3]తేఱ నేర్తురె చెపుమా. 340

ఉ. వీరలు పెద్ద ద్రవ్వ కొకవెంట నొడంబడి తేఱి శాంతులై
కౌరవకోటిఁ గూడి మనఁగా మదిఁ గోరుట పెంపుఁ దాల్మియుం
గారుణికత్వముం దగవు గాదె జగంబున[4]పాడిఁ దండ్రిపా
లీ రని తెంపు సేసి పయి నెత్తిన నెత్తిరిగాక ద్రోహమే. 341

క. విను మవమానము బడి యి, ట్లునికిఁ బడయుపొగడుకంటె నుజ్జ్వలులై మా
ర్కొనిన నది లెస్స యెట్లయి,నను వీరికిఁ బోటు మేలు నాకం జూడన్. 342

వ. సంగ్రామంబు రాజులకు ధర్మం బవ్వం గా దని నీవ చెప్పు మని యుధిష్ఠిరుండు ని న్నడిగెఁ గదా ద్విజాతులకు యజనయాజనాదికర్మకరణవిభాగంబు ధర్మశాస్త్రాచార్యులు విధించునప్పుడు రాజు లిచ్చువారు గాని వేఁడుకొనువారు గా రని చెప్పుట సకలలోక ప్రసిద్ధంబు సర్వవర్ణాశ్రమధర్మపరిపాలనంబు సేయునట్టి రాజులు దార నిజధర్మంబు వదలుదురా యదియునుం గాక పాడితోడి యార్జనంబునం దమకుఁ గల కలిమి యనుభవించుచు సత్పథంబున నడచు చుండఁ ద మ్మొరు లన్యాయంబు సేసినయప్పటికిం గదా యీశస్త్ర[5]ధర్మంబు లింద్రాదు లగు పెద్దలు గావించిరి నీ చెప్పెడిధర్మంబులు కౌరవులకుం జెప్ప వలవదా వారలు గదా మీఁ దెఱుంగక కొఱఁతనుఱుకు లై చెడుతెరువునం బోయెడువా రని పలికి మఱియు ని ట్లనియె. 343

క. నెట్టన సభలో[6]నేవుర,కట్టెదుర నరాతితనము గా కెంతయు వా
రెట్టితులువలో ద్రౌపది, నట్టులు పఱిచెడిదె జూద మాడరె యెందున్. 343

వ. అనవుడు సంజయుండు దేవా నీచిత్తంబున నిడి దీని నింత గొనియాడినఁ గర్జం బొడఁగూడునే యనిన వాసుదేవుం డి ట్లనియె. 345

ఉ. అత్తఱి భీష్మముఖ్యు లగునచ్చటివృద్ధజనంబు లెల్ల నో
రెత్తక యూరకుండిరి మహీశ్వరుచిత్త మెఱుంగకున్కిఁ దా
నొత్తి కుమారులం గినియ నోపఁడ యక్కట మాన్పఁ గన్న నా
చిత్తమ కాదు లోకముల చిత్తము లెల్లను సంతసింపవే. 346

---

1. క. చ. దగఁగ నాకు సమ్మదం బొనర్చె. 2. క. గ. గల్గనేర్చు. 3. క. గ. దీర 4. గ. పాటి; చ. యందు. 5. కర్మంబులు. 6. జ. వేవుర.

ఉ. ఇట్టులఁ బోయి యక్కొలువు ♦ తేఁకువనాకలలోని కింతిఁ దా
నట్టుల దుస్ససేనుఁ డదయ♦ప్రకృతి ముంగల వట్టి యీడ్వఁగా
నెట్టు సహించె మామ సతి♦యేడ్పు తెలుఁగున కెట్టు లోర్చె ని
పట్టున సేమ మారయఁగఁ ♦ బంచుట కెట్టులు నేర్చెఁ గ్రమ్మఱన్. 347

చ. ఇది దగ దంచు నడ్డపడ♦నింతకు నేరక సభ్యు లందఱుం
మది మఱఁగొన్నయట్టియెడ ♦ మానినికిం దనుఁ దాన కాచికో
లొాదవిన దానఁజేసి సభ ♦ నొచ్చెము దక్కెనఁ బాండునందనుల్
బ్రదికిరి గాక యయ్యెడను ♦ రాచకొమారుల కోర్చునట్టిదే. 348

వ. సంజయా వినవే యప్పుడు సభాసదులకుఁ గర్ణశూలంబు లగునట్లుగాఁ గర్ణుండు.

క. లేదిచట మగలు నీకును, వీరలు జూదముల నోడి ♦ విడివడి నిన్నున్
వారిజలోచన నీపైఁ, గూరిమి గలమగని వెదకి♦కొను మొరు ననఁడే. 350

క. నరునకు నది వాఙ్మయ మగు,శర మై హృదయంబు నాటి ♦ చలియింపక దు
ర్భరవేదనఁ జేయంగాఁ, జిరకాలము దచ్చికిత్స ♦ చేసెనె చెపుమా. 351

వ. మఱియు దుశ్శాసనుండు వీర లందఱును గొడ్డు వోయినవారలు పౌరుషంబు గల మానిసి యిం దెవ్వం డనియె నతని చెప్పినట్లు పెద్దగాలంబేని వీరల గొడ్డు వోయిరె గాక వీరి దెస వారికి నేమి ఫలించె వెండియుఁ దత్సమయంబునఁ బుట్టిన మాట లుగ్గడించునట్టివి గావి సంధికార్యం బత్యంతదుర్ఘటంబు దీని ఘటియింపం జేయుట యశక్యం బని తలంచెద నయినను. 352

సీ. పాండవేయులఁ దగఁ ♦ బ్రార్థించి యందుల, కక్కట యేనైన ♦ నరుగుదెంచి
కౌరవులకు బుద్ధి♦గాఁ జెప్పి రాజ్యంబు, పాలుసేసిన మృత్యు♦పాశములకుఁ
దప్పరే వారలు ♦ దగవును నేర్పును, నామీఁద నిలుచుట ♦ నాకుఁ గీడె
నన్ను మన్నింతు ర♦న్యాయంబు సొరనినా,మాటకుఁ దా రొడ♦బాటు లేక
తే. యుందురే [1]కేరడము లాడు ♦ చుందు రేని
కవియుపాండవబాణాగ్ని ♦ గాదు సువ్వె
తమ్ముఁ దమలోభ మనుచిచ్చు ♦ దరికొనంగఁ
దెగినవా రయి పోదు రిం♦తియ తలంప. 353

వ. అని పలికి వెండియు ని ట్లనియె. 354

ఆ. రోషమయమహాత♦రువు సుయోధనుఁ డురు, స్కంధ మందులోనఁ♦గర్ణుఁడలరుఁ
గొమ్మ సౌబలుండు ♦ గుసుమఫలంబు దు, శ్శాసనుండు మూల♦శక్తి తండ్రి.

ఆ. ధర్మజుండు ధర్మ♦తరు వర్జునుఁడు ఘన,స్కంధ మనిలసుతుఁడు ♦ శాఖ కవలు
పుష్పఫలము లేను ♦ భూసురులును వేద,ములుఁ దదీయ మైన♦మూలచయము.

క. ఈరెంటియందు నరసి య,సారం బిది గాఢసార♦సహితం బిది నా

1. క. కోరడము; గ. గారడము.

నేర వలయు నదియునుగా, కేరూపం బయ్యె [1]నేని యీ సేమిటికిన్. 357

మ. ధృతరాష్ట్రేంద్రుఁడును బుత్త్రులుఁ వనము కుంతీనందనుల్ సింహముల్
మతి నూహింప నసింహ మైన వనముఁ మర్దింతు రెందున్ వనా
వృతవృత్తంబులు గానిసింహములకుఁ వేగంబ చే టొందుఁ గా
న తగం బొందుట కార్య మీయుభయము న్సంతుష్టిమై నున్కికిన్. 358

క. పరిచారకు లై యుండుదు, రరివర్గవ్యతికరమున కగుదురు వీరిఁ
సరిఁ దనకొడుకులు మెలఁగిన, తెరువున మెలఁగింప వలదె ధృతరాష్ట్రునకున్.

క. ఏ నీపనికై వచ్చెదఁ, దా నొప్పఁ దలంచె నొండెఁ దప్పం దలఁచెఁ
దానన నెగడెద మే మ,మ్మానవనాథునకుఁ జెప్పు మామత మెల్లన్. 370

వ. అనిన విని సంజయుండు ధర్మతనయుం గనుంగొని యట్లయినను గడు లెస్స గదా దేవా నావచ్చినకార్యంబు సఫలం బయ్యెఁ బనివినియెద నని వాసుదేవునకు నట్ల విన్నవించి భీమార్జుననకులసహదేవసాత్యకిద్రుపదవిరాటుల నీక్షించి మీ యందఱచేత ననుజ్ఞాతుండన కదా పోయివచ్చెద నాయాడినమాటలయం దేమి యుం దగనియట్టివి లేవుగదా యనుటయుఁ బాండవాగ్రజుం డతని కి ట్లనియె.

ఆ. పోయివత్తుగాక యీయున్నయందఱు, వినఁగ నాడి తీవు విశదభంగి
నొక్కమాట యైన నుచితంబు గానిది, గలదె యి ట్లనంగ వలయు నెట్లు.

క. ఎదు రున్నరూపు వలుకఁగఁ, దుదిఁ గటకటఁబడవు నీవు దుర్ణయమును బె
ట్టిదమును బొందును నగుపలు, కొదవదు నీనాలుకకు నయోన్నత యెపుడున్.

క. నీ వొండె విదురుఁ డొండెను, గావలయుంగాక యిట్టికార్యంబులకుఁ
రా వేఱ కలరె తగువా, రీవినయమునేర్పు గలదె యితరుల కెందుఁ. 364

చ. అరిగినయప్డు పెద్ద లగునందలివిప్రుల నెల్లఁగాంచి యా
దరమున వారిసేమ ముచితంబుగనారసి వెండి కాన్పుమీ
గురునిఁ బితామహుం గృపునిఁ గూర్తురు వారలు నాకు నానమ
స్కరణము గాఁగ వారి కధిక ప్రియభక్తి నమస్కరింపుమీ. 365

సీ. మాతండ్రిఁ గని యేనుబ్రీతి మ్రొక్కుట గాఁగ, దండప్రణామంబుదగ నొనర్పు
దుర్వృత్తిఁ బొరయునాదుర్యోధనుని సేమ, మడిగితి నని చెప్పు మతనితమ్ముఁ
డగుటకుఁ దగియెడునాదుస్ససేనుని,కుశల మారయుము దక్కనుగుమార
వర్గంబు నెల్లను వనితాజనంబుల, నుచితంపుమై సుఖ మున్కి యడుగు

ఆ. విదురు శల్యుఁ గాంచి వినయంబు, దోఁపంగ, నాడు ద్రోణతనయునక్కఁ జేర్చి
కొంటి ననుము బాహ్లికునిసోమదత్తుభూ,రిశ్రవసునిఁ దలఁచిప్రియము నెఱపు.

వ. మఱియు వంశవంతులు వయోవృద్ధులు నగుభూపతులను గృతవర్మను గర్ణ శకుని సైంధవప్రభృతులను దక్కటిరాజలోకంబును గయ్యంబునకుఁ దోడువచ్చిన

1. క. నేఁడు.

సకలదేశాధీశులనుం గని యెవ్వరితోడ నెవ్విధంబునం బలుకం దగు ప్రణామ
వినయబాంధవమైత్రీవాత్సల్యంబులకు నయ్యైప్రకారంబుల మధ్వచనంబులుగాఁ
బలికి యుచితంబుమెయి నుపచరింపుము. 367

క. దాసీదాసజనములకు, దాసీనము గాక యుండఁ దగదయకయే మి
త్రాసంగ మొందె శత్రుని,రాసం బొనరించి తమ్ము దనరసెద ననుమీ. 368

క. పోయినమొగమున నచ్చటఁ, జేయుతెఱం గెల్ల నీకుఁ జెప్పితిఁ బిదపన్
మాయయ్య పెద్దకొలువున, వా యోడక యిట్టనంగ వలయుం జుమ్మీ. 369

చ. అనఘ భవద్బలంబునన యాపద యించుక లేక పాండునం
దనులు నిజాప్తబంధుసహితంబు సుఖస్థితి నున్నవారు త
జ్జనకుని రాజ్యపీఠమున సమ్మద మొందఁగ నిల్పి సైకసం
బునన ప్రభుత్వ మిచ్చి తగఁ బ్రోచితి వారల విశ్రుతంబుగన్. 370

ఉ. ఇప్పు డుపేక్ష సేసి కృప యేమియు లేక విహీనవృత్తి వా
రొప్పమిఁ బొందఁ జూచు టిది యొప్పునె యింతట సంతసింప రా
దెప్పుడు నంత కంజ నట యెక్కుడు గోరినఁ జాల కుందదే
యొప్పదె కూడి మన్కి మన కొప్పనివారలయుక్కు డక్కఁగన్. 371

వ. అని తదవసరంబునం బితామహుతో ని ట్లనుము. 372

చ. అడఁగఁగ నీక శంతనునియన్వయముం గలిగించి తీవ యి
ప్పుడు దగ నీమతంబునన పాం డొడఁగూడఁగఁ జేర్చి పౌత్రులన్
సడికి నధర్మవృత్తికిని జావునకుం దొలఁగించి మన్చినం
బుడమిజనంబు రాజులును భూసురులున్ నినుఁ బ్రస్తుతింపరే. 373

వ. అని పలికి వెండియు. 374

క. ఇంతలు పుట్టినచోటను, శంతనునందన యహీనశాంతిపరుం డై
కొంతేయాగ్రజుఁ డాలము,పొంతం బో నొల్లఁ డనుము బుధు లియ్యకొనన్.

సీ. ఆసమయంబున నచ్చటివా రెల్ల, వినునట్లుగా సుయోధనునితోడ
బాహుబలాఢ్యుల బలవిహీనులక్రియ, వెడలంగ నడిచినవెఱ్ఱితనము
నత్యంతచిరకాలమడవులఁ గొండల, బాధలఁ బెట్టినపరుసఁదనము
సభలోన నట్లు పాంచాలరాజాత్మజఁ, దల వట్టి యీడ్చినతులువతనము

తే. ధర్మపుత్త్రుండు సైరించెఁదథ్యమీవు,కురుకుమారుల నని మిగిలిగొనకుమొరుల
సొమ్ముకును నాసపడక దగదిమ్ము వారి, పాలు వారలతోఁ గూడి బ్రదుకుమనుము.

వ. ఏము కలహం బొల్లక పొందు గోరుట తనకు మేలు దనమనంబున దరికొను
తృష్ణానలం బార్ప నోరు లడ్డంబు సారమిం జేసి యేన బుద్ధి సెప్ప వలసెఁ దన
యొద్దం గలయోధవీరు లెయ్యెడల లేమి దెల్లం బయినను మాకుఁ జేదోడు
ధర్మంబు గల దదియునుం గాక యఖిలలోకసేవితుం డైనకృష్ణుండు వెనుఁ బాపు

గావునఁ దమకు మమ్ముఁ గెలువం గోలెఁది గా దది యట్లుండె నేను భీమసేనాదులకుం దమకుం బెద్దవాఁడ నగుట పేరును దారును మదీయప్రార్థనాభంగంబు సేయక నా దగుశాంతియు దాంతియుఁ జెల్లించి న న్నలజడిఁ బెట్టక పోరితం బుడిఁగి తమతమధనంబులు గుడిచి సుఖం బుండుట మనపెద్దలకుం దక్కటిబుద్ధిమంతులకును సంతోషం బగుఁ బెద్ద యీ నోపఁ డయ్యెనేనిఁ గుశస్థలంబును వృకస్థలంబును వాసంతియు వారణావతంబును జాలుఁ గా దేని మఱియు నొండె నియు నొక్కటి యగునట్లుగాఁ దనతోడఁబుట్టువు లేవురకు నిలువ తావు లయి దిచ్చిన సర్వశాంతి యగు న ట్లయిన నిందలియందలి బంధుమిత్రసహాయజనంబులు గలసి నవ్వుచుం దెగడుచు నునికి మనమనంబులకుఁ బ్రియంబు సేయుఁ గురుపాంచాలయాదవమాత్స్యులు పరస్పర ప్రీతిసంపాదకత్వసంపన్ను లై బ్రదుకుట నాకుం గోర్కి యింతయు నమ్మహాపురుషునకుం దెలియం జెప్పు మనిన విని దేవా నీయానతిచ్చినమార్గం బంతయు నడపెద మీతండ్రి నీకును దమ్ములకును వాసుదేవునకు నెట్లు ప్రియం బట్లు సేయువాఁడ కాక యనుచుం బ్రణామంబు సేసిన సంజయునకు ధనంజయుం డి ట్లనియె. 377

క. బాలసఖుండవు నాకును, నీలెస్సఁదనంబు నేము నీతి విడిచి దు
శ్శీలుర మగుటయు శైశవలీల మొదలు గాఁగ మును దెలియదే నీకున్. 378

మ. బలమత్తాకృతి యైనభీముఁ డనుశుంభత్కుంభిసంరంభమున్
నిలిపెన్ నాఁడును నంకుశం బయి, తుదిన్ నేఁడుం దదుద్రేకమున్
మలుఁగం జేయ నజాతశత్రునికృపా[1]మార్ధ్యంబ చాలంగ వా
రల కేలా నయవిక్రమోచితవిచారక్లేశముల్ సంజయా. 379

వ. అని పలికి ధర్మతనయానుమతంబున సంజయునకు సపరివారంబుగా సముచితప్రకారంబున మజ్జనభోజనంబు లొనరించి మాల్యానులేపనాద్యుపచారంబులు సేయించి మణిభూషణచిత్రాంబరంబు లొసంగి వీడుకొల్పిన నతండును బాండవులను వాసుదేవుని వీడ్కొని చనియె నని చెప్పిన. 380

క. విని యత్యంతకుతూహలమునఁ బొదలుచు సంజయుండు ము న్నెచ్చటికిం
జనియెను నెవ్వరితో నే, మనియెను విన వలయు మునిజనాధిప చెపుమా. 381

వ. అని యడిగిన. 382

ఉ. భూరికృపానుషంగ మునిపుంగవచిత్తసరోజభృంగ సం
సారదవప్రవర్ష సురసంస్తుతదివ్యగుణప్రకర్ష దో
స్సారనిరస్తదైత్య [2]శమశాలిమనస్స్థితినిత్య లోకని
స్తారకశీల నిర్వృతివిశాల నిరంజన పాపభంజనా. 383

1. క. మాఘ్యంబు. 2. ఘ. దమ.

క. శ్రుతిమౌళిరత్నమూర్తీ, శతధృతిముఖపద్మషండ శారదకీర్తీ
రతిపతిహితాహితాక్షా, సతతసమాచరితభక్తజనసంరక్షా. 384

మాలిని. సదయవిమలదృష్టీ సంశ్రి[1]తాశీఃప్రసృష్టీ
హృదయ[2]కమలవాసా [3]యిద్ధమాయావిలాసా
విదిత[4]నిఖిలభూతీ విశ్వరక్షోత్తహేతీ
సదసదుపచితాత్మా సంభృతానందవర్త్మా.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున యుద్యోగపర్వంబునందుఁ
బ్రథమాశ్వాసము. 386



1. గ. చ. జ. తతిరవృష్టీ. 2. గ. ఘ. విమలభాసా. 3. జ. హేయమాయా. 4. గ. నిఖిలభాతి; చ. ఖలనిభూతీ.



హ రి హ ర నా థా య న మః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఉద్యోగపర్వము, ద్వితీయాశ్వాసము



విస్తారక[1]రణాకరు
ణావేశోదార శశ్వ౯దమలాకారా
భావవికారవిదూర కు
భావహనామప్రకార ౯ హరిహరనాథా. 1

— సంజయుఁడు ధర్మజునిసంధిపల్కులను ధృతరాష్ట్రునకుఁ జెల్పుట —

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నివ్విధంబున వీడ్కొని సూత
నందనుండు పవనజవనంబు లగునరదంబుతురంగంబులం దఱిమి ప్రొద్దు గ్రుంకునం
తకుం గరిపురిసొచ్చి నగరి కరిగి యంతఃపురంబున నున్న ధృతరాష్ట్రునకుం దనరాక
యెఱింగించిపుచ్చి యతనిం గాంచి యడుగుల కెఱఁగిన నమ్మహీవరుండును నత్యాద
రంబున నెత్తిసమీపంబున నునిచినం గొలిచియుండి చేతులుమోడ్చి యిట్లనియె.

ఉ. దేవర పంపఁగాఁ జని యు౯ధిష్ఠిరునిం గని వచ్చినాఁడ నా
భూవిభుఁ డప్రమేయగుణ౯పూజ్యుఁడు మీకు నమస్కరించె సం
భావన చేసె నా కిచట౯బంధుల నెల్ల దలంచె మీసుఖ
శ్రీవిభవంబులున్ సుతుల౯సేమము నన్నడిగెం బ్రసన్నుఁడై. 3

తే. అనుడు ధృతరాష్ట్రుఁ డిట్లను ౯ నయ్యజాత
శత్రునకు సేమమే యను౯జన్ము లెల్ల
సుఖులె బంధులు భృత్యులు ౯ సఖులు మంత్రి
వరులు సంప్రీతి[2]మెయి నున్న ౯ వారె యచట. 4

వ. అనిన సంజయుం డిట్లనియె.

క. వా రెల్లను భవదీయ, స్ఫారబలము గారణముగ ౯ సౌఖ్యంబున ను
న్నార మని పలుకుదురు నిజ, మారయఁ,గా నట్ల కా దె౯యది జననాథా. 6

క. ధర్మజునకు భోగంబులు, ధర్మవు నట్లింపు గావు ౯ ధర్మంబులలో

---

1. క. కరకరు. 2. క. జ. సుఖ మున్న.

నిర్మలబుద్ధి నహింసకుఁ, గూర్మి గడుం గలఁ డతండు కురువంశనిధీ. 7

ఉ. మానుషశక్తి యొల్లఁడు సమంచితదైవము యూఁది యుండు నీ
పైన నతండు పుణ్యమును బాపముఁ బెట్టినవాఁడు నీవు నీ
సూనువశంబ కాని యొకచొప్పుఁ దలంపవు కర్ణసౌబలా
ధీనము గార్యనిశ్చయము దెల్లము నీమత మొప్ప దేమియున్. 8

ఆ. ఆలుబిడ్డ లేనియట్టి త్రిమ్మరి యగు, కొయ్య గాక కుదుటఁ గూడు వెట్టి
కుడుచువాగ లిట్టి క్రొవ్విదంబులు సేయఁ, జొచ్చుటిచ్చగించి చూతురయ్య. 9

చ. కొడుకులఁ గానరే నృపు లకుంఠిత తేజుల నెందు నిమ్మెయిం
జెడు తెరువైనచోఁ దగవు సెప్పక యొప్పరికించి చూతురే
పుడమిజనంబు లెల్లనిను బ్రువ్వఁగఁ దిట్టఁగ వించు నున్కి నొ
చ్చెడు మది యెప్పుడుం జెవులు చీములు గట్టెడుఁ గౌరవేశ్వరా. 10

చ. చలమున దుస్ససేనుఁడును సౌబలుఁడుం గిమిముఁ బట్టి యార్వ బొ
మ్మలక్రియ నాడు చుండుదురు మానక నీవు సుయోధనుండుఁ దా
రలసి యొకప్డు పాండుసుతు లాగ్రహవృత్తికిఁ జొచ్చిరేని నీ
చలము బలంబునుం గులముఁ జక్కఁగఁ జేయరె యొక్క వ్రేల్మిడిన్. 11

క. వినుము యుధిష్ఠిరుసైరణ, మనవారలు వెఱపుగా సమర్థింతురు [1]డీ
కొనఁగాఁ దగ రని వాసినఁ, గని యోటమి వెట్టినట్లు కౌరవనాథా. 12

క. అనుజులకు నడ్డపడి యే, మిని జేయఁగ నీమిఁ జూచి మెచ్చితి గా కీ
వును సాదు రేఁగెనేని, న్వీను తలపాలముసన కాని నిలువదు సుమ్మీ. 13

చ. [2]అనయము పుట్టి జూదమునయప్పుడ యెంతయుఁ జిచ్చు వెట్టి కా
ల్చినయది నీయుపేక్షయ వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మె
త్తనిపులి యెల్లవారలు నధర్మము నీపయిఁ బెట్టునంతకు
న్వీనఁడును గానఁడుం బిదప నీకును నాకు మరల్ప వచ్చునే. 14

చ. అనయము నొచ్చుచున్నయవి యంగము లెల్లను వేగ వచ్చుట
న్మనము వశంబు గాదు జననాయక ప్రొద్దును బోయె నిప్డు డేఁ
బనివిని రేపు పుత్త్రిలును బంధులు నాప్తులు నీవు నేర్పడఁ
విన మనకార్య మంతయు సవిస్తరతం దగ విన్నవించెదన్. 15

ఆ. అనిన నట్ల కాక యని సంజయుని వీడు, కొలిపి కొంతప్రొద్దు కురువిభుండు
కార్యచింత మునిఁగి కంచుకి నొక్కరుఁ, బిలిచి వేగ విదురుఁబిలువు మనియె.

వ. వాఁడును సత్వరంబుగాఁ జని యతనిం దోడ్తెచ్చి కాన్పించిన నమ్మహీవరుం

1. క. డీకొనఁ దలఁచి రాడివాసిన; గ. డీకొనఁ గాదు తగరు వాసిన; చ. డీకొనఁధగరాని బాసిన; జ. డీకొనఁగం ధగరాతివాసిన 2. గ. అనలము.

డత్యాదరంబున విదురుం దనయొద్ద నునిచికొని యతని కి ట్లనియె. 17

ఆ. పాండురాజసుతుల పాలికిఁ జని యిప్డు, సంజయుండు వచ్చి సమ్ముఖమున
నన్నుఁ జాల దూఱి నాకు రేపచ్చటి,పనులు సెప్పువాఁడ ననుచుఁ జనియె. 18

క. అప్పటినుండియు నెవ్వగ, గప్పికొనినఁ జిత్తవృత్తి గలఁగెడు మేనున్
నిప్పులఁ బొరలినయ ట్లయి, చొప్పడ దించుకయు నిద్ర శుద్ధవిచారా. 19

వ. అనిన విదురుం డి ట్లనియె. 20

క. బలవంతుఁడు పై నెత్తిన,బలహీనుఁడు ధనము గోలుపడినయతఁడు [1]ము
చ్చిల వేచువాఁడుఁ గామూ,కులచిత్తుఁడు నిద్ర లేక కుందుదు రధిపా. 21

క. ఇక్కాఱగాములలోపల, నొక్కటి నీచిత్తవృత్తి నొందెనొ యొరుసొ
మ్మొక్కటి గుడువఁ దలంచితొ, నిక్కము గత మేమి సెప్పుమ నిద్ర సెడుటకున్.

తే. అనిన ధృతరాష్ట్రుఁ డి ట్లను నతనితోడ
ధర్మసుతుమాటచొప్పువిధంబొ యెఱుఁగ
కునికిఁ జేసి చింతిల్లితి నోవు దీవు
దెలియఁ జెప్పి నాయలమట [2]మలుఁగఁ జేయ. 23

చ. అనవుడు ని ట్లనున్ విదురుఁ డక్కట ధర్మసుతుండు బాంధవుం
డును జెలికాఁడునుం దగుభటుండును బ్రెగ్గడయున్ గురుండుఁ గాఁ
డె నృపవరేణ్య నీకుఁ బ్రకటీకృత[3]సత్యుఁడు శాంతమూర్తిస
ద్వినయవివేకశీలముల విశ్రుతుఁ డాతఁడు గీడు వల్కునే. 24

ఆ. నీవుఁ గొడుకు వారి నెఱి లేక పఱిచితి, రదియ చాలు నుచిత మైనపాలు
పంచి యిండు పిల్లవట్టిన[4]యీరువు, సేసి యున్న నేల చెల్ల[5]నేర్చు. 25

వ. మీరు శకునికర్ణదుశ్శాసనులమీఁద రాజ్యభారంబు వెట్టికొనియుండుదు రిది
తుది ముట్ట నేర దెట్లుం గేని. 26

క. తముఁదా తెఱుఁగుట వేగప,డమి దాలిమి విడుపు గలుగుటయు లేని ప్రభు
త్వము గలదె వారియం దీ,సుమానుషము లొకఁడుఁ బట్టి చూడం గలఁడే. 27

వ. యుధిష్ఠిరుండు నీవు నిక్కము తండ్రి వని తగవు నమ్మి చాల సైరించి యున్నవాఁ
డది నీవ యెఱుంగు దనిన విని ధృతరాష్ట్రుం డి ట్లనియె. 28

తే. సంజయునిచేతఁ గార్యంబు చంద మెల్ల
యెఱిఁగి మన కెద్ది సేయంగఁ దెఱఁగు దానిఁ
బనిచి చేయింపు మిపుడు నా మనము దల్ల
డిలుట హితభాషణంబుల డిందుపఱుపు. 29

వ. నీవు ధర్మాధర్మవిదుండవు నయానయజ్ఞుండవు నాకుం బ్రజాగరం బొనర్చుచున్న

---

1. క. గ. ముచ్చిలి వేచు; అ. ముచ్చిలి వేఁగునతఁడు. 2. గ. జ. దలఁగఁజేయుము. 3. గ. సత్యుఁడు. 4. క. గ. జ. యీలువు. 5. చెల్లివచ్చు.

సంతాపం బుపశమించునట్లు భవద్వచనామృతంబు నాయుల్లంబున వెల్లిగొల్పు
మనిన విదురుం డి ట్లనియె. 30

క. జనులకు నోడఁ బాటగువిధ,మున నడచుచు లోకనింద్యములు నుడుగుచు మీఁ
దని యొకనికలిమి కులుకక,మనుజులతోఁ బొంది పొసఁగ మనుటొప్పు నృపా.

క. కోపము నుబ్బును గర్వము, నాపోవక యునికియును దురభిమానము ని
ర్వ్యాపారత్వము ననునివి, కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా. 32

క. ఏలినవానిని దైవము, నాలిని బంధులను సముచితారాధనసం
శీలతఁ బ్రీతులఁ జేయని,పాలసుఁడా ఫలము లాసపడు మనుజేంద్రా. 33

క. నెమ్మి గలవారి నొల్లరు, త మ్మొల్లనివారివెనుకఁ దగులుదు రధిక
త్వ మ్మెఱిఁగి యెఱిఁగి తొడరుదు, రిమ్మఱుఁగనియట్టివార లిభపురనాథా.34

క. ధనమును విద్యయు వంశం,బును దుర్మతులకు మదంబుఁ బొనరించును స
జ్జను లైనవారి కడఁకువ,యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా. 35

క. అరిదివిలుకానియుజ్జ్వల,శర మొక్కని నొంచుఁ దప్పి చనినం జను నే
ర్పరి యైనవానినీతి,స్ఫురణము పగరాజు నతనిభూమిం జెఱచున్. 36

తే. ఒకటిఁ గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి,మూఁటినాల్గింటఁ గడువశ్యములుగఁ జేసి
యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు,విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు.

క. విను మధురాహారంబులు, గొనుటయుఁ జెక్కండ్రు నిద్ర గూడినయెడ మే
ల్కనియునికియుఁ గార్యాలో,చనముఁ దెరువునడచుటయును జన దొక్కనికిన్.

క. నడవడి యనుమున్నీటిం, గడవం బెట్టంగ నోడ కరణిం దగి తా
నోడఁగూడు ననిన సత్యము, గడచినగుణ మింక నొండు గలదే యరయన్.39

క. క్షమియించువారిఁ గని చా,లమి వెట్టుదు రైననుం దలంప ననూన
క్షమయ కడు మెఱయుతోడ వు,త్తమరూపము గోరువారు దాల్తురు దానిన్.

క. పురుషుండు రెండు దెఱఁగుల, ధర నుత్తముఁ డనఁగ బరఁగుఁ దా నెయ్యెడలం
బరుసములు వలుక కునికిన్, దురితంబులు వొరయుపనులు దొఱఁగుటకతనన్

తే. చెల్లియుండియు సైరణ సేయునతఁడు బేదవడియును నర్థికిఁ బ్రియముతోడఁ
దనకుఁ గలభంగినిచ్చునతండుఁ బుణ్య,పురుషులని చెప్పి రార్యులు కురువరేణ్య.

ఆ. పాడి దప్పకుండఁ బడయు సొమ్ములకు న,పాత్రములకు నీగి పాత్రములకుఁ
బెట్ట కునికి యనఁగ నెట్టన రెండువి,ధములఁ గీడు దొడరు ధరణినాథ. 43

తే. వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు,ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ము సేఁత,యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల.

తే. తగినవేషంబు దనుఁదాన పొగడుకొనమి,నొచ్చియును గీడువలుకమి యిచ్చి వగవ
కునికి దన కెంత నడవక యున్నఁ బథము, దప్పకుండుట నడవడి కొప్పు సేయు.

క. చెలిమియు సంభాషణమును, బలిమి వివాదంబు ద్రోపుఁ బాడియుఁ దమయం

తలపాటితోన తగు నధి,కులహీనులతోడ నైనఁ | గొఱ గా దధిపా. 46

తే. కొంచెమైనను దగఁ బంచి | కుడుపు మేలు
పనులయెడ దుఃఖ మోర్చి | యల్పంబు సుఖము
ననుభవించుట హితము | శత్రునకు నైన
నిచ్చుటయ లెస్సయడిగిన | యెడ నృపాల. 47

క. తను లోకము గొనియాడఁగ, విని యుబ్బఁడు సజ్జనుండు | వెండియుఁ గడు మే
లొనరించుఁ గీ డొకించుక,యును దన దెసఁ దోఁపనీక | [1]యుడుపుచు వచ్చున్.

వ. ఇట్టిచందంబులు ధర్మనందనునకుం గల వని పలికి విదురుం డది ప్రసంగంబుగాఁ బాండవులఁ బ్రశంసించి నీవు వారలం బెనిచి మానుసులం జేసి రక్షించి యిప్పు డుపేక్షించి వారలు వెలి నుండ నూర కుండం దగునే తగుపా లిచ్చి వారి రావించి నీకొడుకులతోడివారిఁగా నడపుట యుచితంబు మీరును వారును నొక్కటి యై యున్న మీదిక్కు దేవతలకుం దేఱిచూడ రా దనిన నమ్మాటలు వెడవెడ యూఁకొని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె. 49

తే. హితముఁ గర్తవ్యమును నాకు | నెఱుఁగుదీవ,ధర్మసుతుచందమును విది | తంబునీకు
నట్లు గావున నెఱిఁగింపు | మఖిలకార్య,జాతమును జిత్తతాపోప | శమము గాఁగ.

క. అనుడు విదురుఁ డాతని కి, ట్లను నిమ్మెయి నన్ను నొత్తి | యడిగినఁ జెప్పం
జను నున్నరూపు సెప్పెద, విను మవధానంబుతోడ | విమలవిచారా. 51

ఉ. డక్కెను రాజ్య మంచు నకటా యిటు దమ్ముని భాగ మీక నీ
వెక్కటి మ్రింగఁ జూచె దది | యె ట్లఱుగుఁ విను మీను లోలతన్
గ్రక్కున నామిషంబుచవి | గాలము మ్రింగినచాడ్పు సూవె యి
ట్లుక్కువుఁ డైననీకొడుకు | నుల్లము [2]నున్నటు లారఁ గూరునే. 52

క. అన విని నిరుత్తరుం డయి, మనుజేంద్రుఁడు గొంతసేపు | మ్రాన్పడి తలఁపుల్
పెనఁగొన నిద్రాహీనిం, దను వలయఁగ విదురుతోడఁ | దా ని ట్లనియెన్. 53

క. ఇందాఁక నీదుపలుకుల, డెందముతాపంబు గొంత | డిందుపడియె నా
కుం దగ నయానయంబుల,చందంబులు సెప్పుచుండు | సౌజన్యనిధీ. 54

వ. అనిన విని విదురుం డి ట్లనియె. 55

ఆ. [3]తనియఁ బండ కుండ | మును గోసికొనఁ జవి,చేటు కాదు విత్తు | చేటుఁగలుగుఁ
బక్వమైనఁ గొనిన | ఫల మించుఁ జెడదు బీ, జంబుఁ గార్యసిద్ధి | చంద మిట్లు. 56

తే. మాలకరి పుష్పములు గోయు | మాడ్కిఁ దేఁటి
పువ్వుఁ దేనియ గొనియెడు | పోల్కి నెదురు

1. చ. యడుగుచు. 2. క. గ. నన్నిటు లార.గూరునే. ఘ. చ. నన్నిటు లాడఁగూడునే. జ. నం దిటు లారఁ గూరునే. 3. ఙ. కమియఁ బ్రండకుండఁ • గాయఁగోసినఁ జవి...బక్వమైనఁగోయ • ఫల మించుఁ.

గంద కుండఁగఁ గొనునది § కార్యఫలము
బొగ్గులకుఁబోలె మొద లంటఁ § బొడువఁ జనదు. 57

క. పరులధనమునకు విద్యా,పరిణతికిం దేజమునకు § బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడున,న్నరుఁడు దెవులు లేనివేద§నం బడు నధిపా. 58

క. ఎదిరికి హితమును బ్రియమును,మది కింపును గాఁగఁ బలుకు§మాటలు పెక్కై
యొదవినను లెస్స యటుగా, కిది యది యన కూరకునికి § యెంతయు నొప్పున్.

క. చెలిమియుఁ బగయును దెలివియుఁ, గలఁకయు ధర్మంబుఁ బాప§గతియును బెంపుం
దులువతనంబును వచ్చును, బలుకుబడిన కాన పొసఁగఁ § బలుకఁగ వలయున్.

క. బెడిదముగఁ గత్తి గొడ్డటఁ, బొడువఁ దెగినమ్రానఁ జిగురు§వొడముఁ బలుకులం
జెడఁ దునిసినకార్యంబు ని,గుడ నేరదు పిదప నెట్టుఁ § గురువంశనిధీ. 61

క. తనువున విఱిగినయలుఁగుల, ననువునఁ బుచ్చంగ వచ్చు § నతినిష్ఠురతన్
మనమున నాటినమాటలు, విను మెన్నియుపాయములను § వెడలునె యధిపా.

ఉ. అక్కట ధర్మనందనుని§యాస్యమునం దొకనాఁడుఁ గీడుప
ల్కొక్కఁడు లేదు నీకొడుకు§లొండొరు మీఱి నికృష్టవాక్యముల్
పెక్కులు పెక్కుభంగులను § బేలుచు నుండఁగ నీవు దానికిన్
స్రుక్కక వించు నుండె దను§రూపమె నీ కిది కౌరవేశ్వరా. 63

ఆ. చేటుకాల మైనఁ § జెట్టమాటలు నెఱి, గాని తెరువు వట్టు§కర్జములును
[1]దగవు లట్ల తోఁచుఁ§దగియెడునవి యవి,నీతు లని మనంబు § నిశ్చయించు. 64

వ. నీబుద్ధి పాండవులతోడివిరోధంబునెడ మరలంబడమి పాపం బింతియ కాక యేమి సేయుదము మనకులంబునం దేజోధైర్యధార్మికత్వాదిగుణంబుల గరిష్ఠుం డయిన యుధిష్ఠిరుండు నీసిరికి వెలి యై య ట్లుండుట దగ వగునే నీ పెద్దతనంబు సూచి సైరణ వాటించి యున్నవాఁ డనిన విదురుదిక్కు మొగం బై ధృతరాష్ట్రుండు నీ చెప్పిననీతివాక్యంబుల నామనంబు దనివోవ దింకను జెప్పు మన వుడు నతండు వెండియు ని ట్లనియె. 65

ఆ. సకలపుణ్యకర్మ§చయమును నొకదెస, వినుము పాడి దప్ప § కునికి యొక్క
దిక్కు దీని శ్రుతులు § తెలిపెడు నెడఁ బాడి,కలిమి యెందుఁ బెద్ద§[2]గా నుతించె.

తే. పాడిగలిగిన నిహలోక§ఫలము లెల్లఁ, జేరుటయ కాదు కీర్తియుఁ§జెందుఁ బురుషు
ధరణిఁ బొగడిత యెందాఁక§బరఁగునంత, కాలమును బుణ్యలోకంబు§గల్గు నండ్రు.

వ. తొల్లి ప్రహ్లాదుండు దైత్యజాతిసంభవుం డయ్యును దనకొడుకు విరోచనుండును నంగిరసుం డనువిప్రుకొడుకు సుధన్వుండును దమతమప్రాణంబు లొడ్డుగా నొడ్డి యొక్కధర్మసందేహంబునకుఁ బన్నిదంబు సఱచి వచ్చి త న్నడిగిన నితండుగొడుకితండు లాఁతి యని తలంపక మధ్యస్థుం డై సుధన్వు గెలిపించి యతనిచేత నిజ

1. క. దగినయట్లు. 2. అ. కలిమియంత పెద్ద గానిషించె.

తనయునిజీవితంబు దానంబుగాఁ గొని వాని బ్రదికించెం గావున నీవును ధర్మంబు
విడువక యధర్మోపేతులైననీకొడుకులవలనిపక్షపాతంబు విడిచి తెఱంగుసేయుము
వారును వీరును నాపద లేక బ్రదుకుదురు నీవును శోకంబు లేక తక్కుదు వని
చెప్పి మఱియును. 68

క. పాపంబులు కర్జము లని, యేపునఁ జేయంగ నవియు నింపగు ధర్మ
వ్యాపారంబు లకార్యము, లై పరిణతిఁ బొందెనేని యట్టుల చెల్లున్. 69

చ. అదిసభయే ప్రియం బెసఁగ నార్యులు నిల్వరయేని నార్యులే
మదిఁ దలపంగ వారలు సమంచితధర్మము పల్కరేని య
ట్టిదియును ధర్మవే తగ ఘటించిన నిక్కము [1]లేదయేని తాఁ
బదిలఁపునిక్కమే యొకనెపం బిడుచొప్పగునేని భూవరా. 70

ఉ. నీతిపథంబునన్ బ్రదుక నేర్చుట యుత్తమభంగి శౌర్యసం
జాతము లైకరం బలరుసంపద లొందుట మధ్యవృత్తి య
స్ఫీతము లైనభారవహజీవనముల్ దలఁపం గనిష్ఠముల్
నీతికి బాహ్యు లైన ధరణీవర మెత్తురె వారి నుత్తముల్. 71

ఆ. కయ్యమునక యెప్పుడుఁ గాలుద్రవ్వుదురు నీ,పుత్త్రు లెల్ల సూతపుత్త్రుఁ డాది
యగుతదీయమంత్రు లంతకు ముందర, బిరుదు లివు నీతితెరువుసారవు. 72

క. పాండవులు శౌర్య మొల్ల ర,ఖండితనీతిప్రకారకార్యము మెచ్చి
యుండుదు రెదు రేచినఁ దుది, మండుదు రార్పంగ రాదు మఱియెవ్వరికిన్. 73

క. తమతండ్రిభంగి నీకును, సముచిత మగుభక్తి సేసి సజ్జన[2]నుతమా
ర్గమున నడచువారల నీ, వమలమతిం గన్నకొడుకుల ట్లరయఁ దగున్. 74

వ. అని పలికి మఱియు ని ట్లనియె. 75

క. కారణము లేకయును నుప,కారపరత్వమున నొరులకార్యంబులకున్
వారనియలజడిఁ బడియెడు, వారలచూ యేడుగడయు వారికి నధిపా. 76

చ. ఒకరునిచేతిప్రోపును దనదున్నతిప్రాపును గాంచి యెల్లవెం
టకును గొఱంత లేక పొగడందగుసంపద నొంది యట్టిదా
తకుఁ దుదిఁ గీడు సేసినకృతఘ్నునిపీనుఁగు నైన రోఁత వు
ట్టక కబళింపఁ గుక్కలు నొడంబడునే కురువంశవర్ధనా. 77

వ. కావునఁ గృతము దలంపమి గీడు పాండురాజు నీకుం బరమభక్తుండు పాండవు
లునుం దేజోలాభంబులు గాంచినవారలు వారల నాదరింపు మని చెప్పి
వెండియు ని ట్లనియె. 78

ఆ. బ్రదుకు చేటు పొగడుపడుట దూఱొందుట
యాగి వేఁడుకొనుట యిట్లు మఱియుఁ

1. చ. లేనిదేని 2. క. మతమా.

గలుగుసౌఖ్యదుఃఖములు వచ్చు నెడఁబడి
వాని కింత యేల వగవ నధిప. 79

క. వగ బలము దఱుఁగు రూపఱు, వగచిన మతి దప్పుఁ దెవులు వచ్చుఁ [1]దూరన్
వగచి నలంగినఁ బ్రియమగుఁ, బగతురకును వగచు టుడుగు పార్థివముఖ్యా. 80

వ. అనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె. 81

క. రిత్తయుపచారముల నే, నుత్తముఁ డగు ధర్మతనయు నుపేక్షించితి మ
ద్వృత్తులగుమత్సుతులకును, మిత్తి యగుం బోర వగలు మిగులక యున్నే. 82

వ. నెవ్వగలు నివ్వటిల్లనీక నిలుపునట్టి దెయ్యది దాని నెఱింగింపు మనిన విదురుం
డిట్లనియె. 83

తే. నియతతపమును నింద్రియనిగ్రహంబు, భూరివిద్యయు శాంతికిఁ గారణములు
వానియన్నింటికంటె మేలైనశాంతి, కారణము లోభముడుగుట కౌరవేంద్ర.

వ. అని వెండియు. 85

క. జ్ఞాతుల[2]పోరితమును గో, వ్రాతమునాక్రమము విప్రవర్గముచనవున్
నాతులకారించుటయును, బ్రీతిం జన నిచ్చు నతనికిఁ బెం పొప్పు నృపా. 86

క. అలమికొని యొండొరులపొ, త్తులఁ బ్రాపుల నెలమికలిమిఁ బొందిన బహుజ్ఞా
తులు నెమ్మిఁ గూడి తామర, కొలనిక్రియన్ సిరికిఁ బట్టుగుదు రుజ్జ్వలులై. 87

చ. కరితురగాదిఘట్టనయు గాలియు నోంపదె యొంటి యున్నయ
త్తరువు ననేకభూరుహవితానము గుంపయి పేర్చి బాధలం
బొరయునె యన్నదమ్ములును బొందిన నేరి కసాధ్యు లట్లు గా
కెరవయి నిల్చినం [3]గెలని కెల్లిద మై పఱిపోదు రెంతయున్. 88

వ. కావునఁ గౌరవులుం బాండవులు నొండొరులకుఁ బ్రాపై పొదలిన నెదిరికి నజయ్యు లగుదురు పరులయొత్తు లేనిరాజ్యంబు పూజ్యమహిమం బరఁగు వనవాసంబునం గుందిన కౌంతేయులం దడయక తెచ్చి యుచితపదం బిచ్చి నిలుపుట నీకొడుకులకు నిలుపు గావించుట యగు నని చెప్పి మఱియు నిట్లనుఁ బ్రియవాదు లెందును గల రప్రియం బగుంగా కేమియని[4]పథ్యంబు వలుకువారు లేరు జూదంబునప్పుడే నడ్డపడి యప్రియం బగుటకు శంకింపక పథ్యంబు వలికితి నది నీకు రుచియింపక రోగికిఁ బథ్యాహారంబు దల కంటగించున ట్లయ్యె నైన నిప్పుడుం జెప్పెద వినుము కాకంబులం గైకొని మయూరంబులం బరిహరించు విధంబున మార్జాలంబులం బాటించి సింహంబులయెడ ననాదరంబు సేయు చందంబున సుయోధనాదులం బట్టి యుధిష్ఠిరప్రముఖులవిడిచితి నేఁడు కార్యంబు ముట్టవచ్చినం[5]దోఁపక మిడుంగుఱుసోఁకినట్లు దల్లడించెదవు కులంబునకై యొకనిఁ

1. ఇది 'తూరు' ధాతువు. 'చాలు' ధాతువువలె తుమర్థకరూపమున భృశార్థకము. 2. క. గ. పూరితమును, 3. ఘ. ఖరుల. 4. తథ్యంబు. 5. 'దోఁక నీయుముట్టితల్ల...' అనియే యన్ని ప్రతులు.

దొఱంగుటయ నీతి యని పెద్దలు సెప్పుదురు దుర్ణయపరుండై సద్బుద్ధిసెప్ప వినం డేని మనము దుర్యోధనుం దొఱంగిన నేమి యగునది యట్లుండె సంపద సహాయంబు నపేక్షించియుండు సహాయంబు సంపదనుద్దేశించి వర్తిల్లు నిట్లవియొకటొకటిఁబొందునంగాని సిద్ధింపవుగావున నీసంపద పాండవులకును వారిసహాయత్వంబు నీకునుం బ్రియం బొనరింప నొండొరుల కలయుట మేలుగాక మనలావు వెలి సేయుట లెస్స యగునే కురువంశనిస్తారకు లగుభీష్మయుధిష్ఠిరులును నవక్రవిక్రములగు కర్ణార్జునులును బ్రతాపధాము లగుభీమదుర్యోధనులును శస్త్రాస్త్రపారగు లగు నభిమన్యులక్ష్మణ ప్రభృతికుమారులును శాపానుగ్రహసమర్థు లగు ద్రోణద్రుపదాదిపరమాప్తులును వారివారిబంధుమిత్త్రజనంబులును నొక్కమొగంబై నీపనుపు సేయుచు నయవిక్రమంబు లప్రతిహతంబులై నడవం బృథివిశాసింప భవదీయవిభవం బుజ్జ్వలంబై యొరుల కెడ లేక చెల్లుచున్న నెంతయొప్పగునో యటు విచారింపుము పాండవులు ధీరమతులై వైరమెత్తక యూరక తొలంగి యుండిరేనియుఁ గతిపయదినంబులలోఁ జీకాకుపడి చెడుంగాక గాంధారీనందను చేత వసుంధరాపరిపాలన భారంబు నిర్వహింపంబడునే యనిన విని ధృతరాష్ట్రుఁడు విదురున కిట్లనియె. 89

తే. నీవు సెప్పినమాటలు ✽ నిర్మలములు, నిపుణసమ్మతములు రాజ✽నీతిమార్గ
బోధకంబులునై నను✽బుత్త్రి విడువ, నోప ధర్మజయతి యని ✽ యుండువాఁడ.

వ. అనిన విని విదురుం డతని కిట్లనియె దేవా జ్ఞాతులు గుణహీను లైనను విడువం దగ దనిన సకలగుణసంపన్ను లై భవత్ప్రసాదంబుఁ గోరుచున్న కౌంతేయులన్ దిగవిడువం దగునే యేనునీకు హితంబు గోరెడువాఁడ నని నిశ్చయించి నాబుద్ధి వినుము వారలజీవనంబునకుఁ గొన్ని యలంతిపల్లియ లైనను దుర్యోధను నొడంబఱచి యేర్పఱచి తెఱంగుపఱచిన లెస్స యని చూచెద నతని విడువ వలయు నని చెప్పితి నేని[1] వెనఁకువం బశ్చాత్తాపంబు పుట్టుదాని కప్పుడు ప్రతీకారంబు లేదు కావున నెల్లభంగుల నియ్యకొని పాండవులతోడ సంధిసేయవలయు నట్లుం గాక.

క. [2]తమలోనిపాళ్ళకుంగా, సమరము సేసినను గాని ✽ చాఁ జనదె శరీ
రము లాధివ్యాధిజరా,సమన్వితము లగుటఁ జేటు ✽ సహజం బరయన్. 92

చ. గజతురగాదిసంపదలుఁ ✽ గాంతలతోడివిహారలీలలుం
బ్రజ కనురాగ మొందఁ బరిపాలన సేయుక్రమంబుఁ బోరులన్
విజయముఁ బొంది పేర్చుటయు ✽ విస్ఫురితాభరణానులేపవ
స్త్రజనిత వైభవంబుఁ గలరాజులుఁ బోయిర కాక నిల్చిరే. 93

క. కావునఁ జెవికిం జేఁ దగు,నీవాక్యము వినఁగఁ జాల్తేని యిహపర
శ్రీవిభవములకుఁ గీర్తికిఁ, దావల మై వెలయు టింత ✽ తథ్యము సుమ్మీ. 94

1. క. వెనుకం. 2. గ. తమలోనిపాళ్ళకును సమరము సేసినఁగాని చావు ✽ రాఁ జనదె.

క. తగ నీలో నూహింపుము, దగ విడువకు ధర్మరతనయు ధృఢమతి వై పాం
దగుచందము గొడుకులకుం, బెగడలకుం జెప్పి తీర్పు పెం పేర్పడఁగన్.

ఆ. అనిన నాంబికేయుఁ డను నీదుపలుకుల, గలఁక దేఱి బుద్ధి దెలివి నొందె
నిట్లు చేయువాఁడ నిదియ కర్జము ధర్మమును యశంబు లాభమును దలంప.

చ. అనుడు ముదంబు నమ్మమియు నాత్మఁ బెనంగొన నన్నతోడ ని
ట్లను విదురుండు పెద్దవడి కక్కట నీమది కార్యవృత్తి నూ
ల్కొనియె సుయోధనుం గని యకుంఠితనిశ్చయ మై యతండు వ్రా
లినదెస వ్రాల కుండిన బలే మముబోటులకుం బ్రియం బగున్. 97

వ. అని పలికి నిట్టూర్పు నిగిడించి. 98

క. దైవంబ నేర్పుఁ గా కిటు, వోవఁగ నే నేర్తు నేరఁ బొమ్మని పలుకం
గా వశమె నరున కెక్కుడు, దైవము పౌరుషముకంటె ధరణీనాథా. 99

వ. అనిన విదురునకు వైచిత్రవీర్యుం డిట్లనియె. 100

తే. ధర్మపథమును నీతితత్త్వంబు తెరువు, నిర్మలము లగుపలుకుల నీవు నాకు
దెలియఁ జెప్పితి పరమార్థదృష్టిమెట్టి, వాక్యములుఁ గల్గుఁ జెప్పుము వాని ననఘ.

—* సనత్సుజాతుఁడు ధృతరాష్ట్రునకు నధ్యాత్మతత్త్వంబు దెలియఁ జెప్పుట *—

వ. అని యడిగిన విదురుం డతని కిట్లనియె నాకుఁ దోఁచినయన్నియు నా నేర్చినట్లు
నీ కెఱింగించితి నత్యంతగుహ్యంబు లగునర్థంబులు పురాణుం డయ్యునుంగుమా
రుం డగుసనత్సుజాతుండు దెలుప నోపుం గాని యిటమీఁద నాకుం దెలియదనిన
ధృతరాష్ట్రుం డమ్మునీంద్రుండు నా కెంతదవ్వు నీవ యవియునుం జెప్పు మనిన
నేను శూద్రయోనిజాతుండ వేదాంతవేద్యంబు లగునర్థంబులు నా కగోచరంబు
లమ్మహాత్ముబుద్ధి నే నెఱుంగుదు దేవతలకుం దెలియనట్టివి యాతనికిం దెలియు
నతండు దెలుపం జాలు ననిన ధృతరాష్ట్రుం డతికుతూహలుం డై. 102

ఆ. మనకు నిప్పు డతనిఁ గను తెఱం గెయ్యది, యగుటయును నెఱుంగననినవిదురుఁ
డధికభక్తిఁ దలఁచె నాత్మలో నాశ్రిత,వత్సలత్వనిధి సనత్సుజాతు. 103

వ. ఇట్లు దలంచుటయును దివ్యజ్ఞానమాననీయుం డగునమ్మునివరేణ్యుం డాక్షణంబ
పొడసూపిన విదురుం డతనివచ్చుట యుగ్గడించుచు వినయంబున నతనినెదు
రొ్కని దండనమస్కారంబు లాచరించి యున్నతాసనం బిడి యర్ఘ్యపాద్యంబు
లిచ్చి ససంభ్రమంబుగాఁ బ్రత్యుత్థానంబును బ్రణామంబునుం జేసి యున్న
ధృతరాష్ట్రు నతనికిం జూపి విదురుం డిట్లనియె. 104

క. దేవా దేవరకృప నీ, భూవల్లభుఁ డమలతత్త్వబోధక మై సౌ
ఖ్యావహ మగువాక్యచయముఁ, దావినఁ గోరుటయు మిమ్ముఁ దలఁచితి భక్తిన్.

వ. మీరును గారుణ్యాతిశయంబున విజయంచేసితిరిగురుసమాశ్రితులగువార లెద్దాని
వలన సుఖదుఃఖంబులు లాభాలాభంబులుఁ బ్రియద్వేషంబులు నాదిగాఁ గల

ద్వంద్వంబులం బడక బ్రదుకుదు రట్టిపరమార్థోపదేశంబున నితనిం గృతార్థునిం గావించి రక్షింపవలయునని ప్రార్థించినం బార్థివుండునుం దదనురూపంబు లగు నాలాపంబుల నారాధించినం బ్రసన్నుండై సనత్సుజాతుం డధ్యాత్మవిషయంబు లగువివిధవాక్యంబుల సోపానప్రకారంబున నంతకంతకు సూక్ష్మంబు లగునర్థంబులు సమర్థించుచు నందుం బ్రజ్ఞాచక్షుం డెయ్యది యేర్పడ నడిగెనది యెల్ల వివరించుచు హృదయపుష్కరకలితం బగుపరతత్త్వంబు ప్రసాదించునట్టిగూఢోక్తు లనుగ్రహించుచుండ నెట్టకేలకుం బ్రభాతం బగుటయు ధృతరాష్ట్రవిదురుల నామంత్రణంబు సేసి యద్దేవముని యంతర్ధానంబు నొందె నట్టిసమయంబున. 106

—◆ ప్రాతఃకాలవర్ణనము ◆—

తే. తనకులంబునఁ బుట్టినధార్తరాష్ట్రు, లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట
కుమ్మలించి వివర్ణతనొందినట్లు, గంది యెంతయుఁ జెలు వేదెఁ జందురుండు.

క. కుముదములుం దారు నొక్కటఁ, బ్రమదంబున నుండి వానిపదవి దొలఁగినం
దమకున్ నిలువఁగ దగ దను, క్రమమునఁ జనునట్లు తారకంబులు విరిసెన్.

ఉ. ఎత్తినవేడ్కఁ గంధరము లెత్తి మొగంబులు సాఁచి చూడ్కులం
జిత్తములున్ నిగిడ్చి తమచెందెడునిక్కలు రోసి యింపు త
ళ్కొత్తఁగ నొక్కచో నొకటి నొక్కటి గాంచి యెలర్చు [1]కాయ్వులం
జిత్తజుకేళిఁ దేలె విలసిల్లుచు జక్కవదోయి వేకువన్. 109

మ. మును సౌరభ్యము నివ్వటిల్లఁగ మనోమోదంబునం దేఁటు ల
ల్లన యోలిన్ వెడలంగ రేకులు సముల్లాసంబునన్ బింక మె
క్క నయం బెక్కుచు గ్రద్దహం దెడలి పీఁకం గేసరంబుల్ గడ
ల్కొనఁ దోడ్తో మధు [2]వుచ్చి పేరెలమిఁ బొల్పుం జెందె నంభోజముల్. 110

చ. వెడవెడ నిద్రవొంది కను విచ్చినపాంథులమీఁద దాడిపోఁ
దడఁబడ నొండొరుం బిలుచుదర్పకుపంపుబలంబులోనియ
ల్కుడుకరణిం జెలంగు శుకకోకిలభృంగతతుల్ వనంబులం
దెడనెడఁ [3]బల్కఁ గూయసాగి యింపఁగ మ్రోయఁగఁ దద్విరావముల్. 111

సీ. పద్మరాగంబుఁ [4]బరఁగించు నరుణోద,యంబుకాంతికిఁ జెలువంబు మిగులఁ
బరువంబు దప్పినవిరుల రాలుచుఁ దరు, చయము చుక్కలు లేనిచదలఁ జెనయ
వరవిరి నెత్తావి నడరించు నున్నిద్ర,విటపీటిసౌరభవితతి వొదల
నెలఁత చీఁటినయెఱకలనెటిఁ దీర్చు జ,క్కవలు [5]చెందొవల క్కోకట యొనర్ప

ఆ. [6]వెలరు వాఱుదివియల నల్ల నల్లార్చి, పోర్ణగండ్లయందుఁ జొచ్చిసుడిసి

---

1. క. చెయ్వులం. 2. గ. జ. వుచ్చి; గ. వుచ్చ. 3. జ. బల్కఁగూయసాగియింపుగ మ్రోయఁగ 4. గ. చ. బచరించు. 5. గ. జ. చందోయి. 6. ఖ. తెల్లవాఱుచున్నదివియ లల్లార్చుచు.

తిరిగి వేగుఁబోక § తెమ్మెర లెలఁదీగ,కొనలవంక లొత్తు § ననలఁ [1]బ్రోచు.

ఆ. అంత నుదయశైల § మనునశోకద్రుమ,సమితియందుఁ [2]గాంతి § చాయఁ బొసఁగి
నెఱయ విరిసి తొలుత § నెగసినయుజ్జ్వల, స్తబక మనఁగఁ బద్మ § సఖుఁడు వొడిచె.

సీ. ఉర్వీధరంబుల § నొప్పెడు జేవుఱుఁ, జఱులకాంతికి నునుఁ § జెఱుఁగు నెట్టి
ధరణీజగుల్మల § తావితానముపల్ల,[3]వములకు గట్టెఱ్ఱ § వన్నె యొసఁగి
యరుణాంబుజంబుల § యంతర్దళంబుల,తళతళ యనుజిగి § దళముకొల్పి
చక్రవాకద్వయ § సంతతిమెఱకల, కొమరారు కెంజాయఁ § గ్రొత్త సేసి

ఆ. తనదుబాలబింబ § మనుపమేయప్రభా,పటలజటిలగగన § భాగ మగుచు
నుల్లసిల్లి జగము § లెల్లను విలసిల్లఁ, బూర్వశిఖరిమీఁదఁ § బొడిచె నినుఁడు. 114

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు ధృతరాష్ట్రుండు తత్కాలోచితాచారంబులు నిర్వర్తించి తగుతెఱంగున నలంకృతుం డయి యాస్థానమండపంబున కరిగి పేరోలగం బిచ్చినఁ గుంభసంభవ కృప కృతవర్మాశ్వత్థామ కర్ణాదు లగువారలును భీష్మవిదురబాహ్లీకసోమదత్తభూరిశ్రవఃప్రభృతు లగు బంధుజనులును దుర్యోధన దుశ్శాసనప్రముఖులగుకుమారులును లోనుగాఁ గలసమస్తపరిజనంబులును వచ్చి బలసియుండి రయ్యవసరంబున సంజయుండు వచ్చి వాకిటనిలిచిపడిహారులవలనఁ దన్నెఱింగించి పుచ్చి చొచ్చి సముచిత ప్రదేశంబునఁ గూర్చుండి తనమాటలు వినుటకుఁ జిడిముడిపడు చున్నకొలువుఁ గలయం గనుంగొని యిట్లనియె.

—♦ సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ బాండవుల తెఱంగు సెప్పుట. ♦—

తే. పాండురాజతనూజుల § పాలి కర్థి, నిమ్మహారాజు వనుపంగ § నేఁగి ధర్మ
పుత్త్రుఁ గాంచితి నాతండు § మైత్రి మెఱయఁ, గౌరవులసేమ మెల్లఁ బే § ర్కోరనడిగె.

వ. మఱియుం దగువారల నెల్ల నయ్యైయుచితవిధిం బ్రణామంబున వినయంబున బాంధవంబున మిత్త్రభావంబునవాత్సల్యంబునఁ బ్రసాదంబున నాదరించె నేనును భూనాథుండుగఱపిన తెఱంగునఁ గొఱంత లేకుండ బంధుత్వంబునకు వలయుమాట లాడితిఁ బదంపడి కార్యంబు ప్రసంగించి నాయాడినమాటలకు నయ్యుధిష్ఠిరుండు వలికినవచనంబు లింత యొప్పునే యని యగ్గించిన ధృతరాష్ట్రుం డవహితుం డై యడుగఁ దా నయ్యుధిష్ఠిరునకుం జెప్పినభంగులు నతండు వానికి నెల్ల నుత్తరం బిచ్చిన తెఱంగును నెఱింగించి ధృతరాష్ట్రునకుం బితామహునకు దుర్యోధనునకుం గ్రమంబున వారివారితో నాడు మని నియమించినచందంబులు ధర్మనందను పలుకులపరిపాటిం దేటపడం జెప్పి సూతసూనుండు వెండియు నిట్లనియె. 117

తే. ఏనుపప్లావ్యపురమున § కేగి తొలుత, వాసుదేవార్జునులఁ గంటి § వారు నీతి
పథము దప్పనిమాటలు § బలిమిఁ దోఁచు,నట్లుగా నాడి రవి వినుం § డాదరించి.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డవ్వాసుదేవుచిత్తం బెట్లుతం డే మనియె నని యడిగిన

1. క. బ్రోచు. జ. ద్రోచ్చు. 2. ఖ. గాంచి. 3. క. వములకట్టెఱ్ఱయుఁ ♦ బన్ను వొసఁగి.

నతనికి సంజయుం డిట్లనియె. 119

ఉ. తానును సత్యభామయును ♦ ద్రౌపదియున్ నరుఁడున్ రహస్యగో
ష్ఠీనిరతాత్ముఁ డై సుతులుఁ ♦ జేరనిచెందనియట్టిచోటఁ గాం
తానివహంబు గొల్వఁ బ్రమదస్థితి నుండియుఁ బిల్వఁ బంచె న
న్నానలినోదరుండు హృదయంబున నీదెసకూర్మి యెట్టిదో. 120

వ. ఏనును దత్ప్రకారంబు పరిచారులవలన మున్న యెఱింగినవాఁడ నగుటంజేసి కంచుకంబును శిరోవేష్టనంబును ధరియించి వినీతవేషుండ నై పోవునప్పుడు కృష్ణార్జును లనేకమణిమయభూషణప్రభాభాసితులై యొక్కసెజ్జన యున్నవారు కృష్ణుండు పవ్వళించియుండి చాఁచినచరణంబులు దొడలపై నిడికొని యర్జునుండు గూర్చున్నవాఁడు సత్యభామయుం బాంచాలియుం గద్దియలపై నున్నవారు సవినయంబుగా నేనును దండప్రణామంబు సేసిన న న్నాదరించి కృష్ణునిచేసన్న నర్జునుఁడనుపునం గనకరత్నమయం బగునతనిపాదపీఠం బతండు వ్రేల్చినకాళ్లు దిగిచికొన నిద్దఱుముద్దియ లెత్తితెచ్చి నాకుంబెట్టిన నేనును దానిం గరతలంబున నంటుచు ధరణీతలంబునఁ గూర్చుండి కేలు మొగిడ్చి ఫాలతలంబునం గదియించి నీలవర్ణులు బాహుబలమదభరితులును నయి యేనుఁగుదోయియుంబోలె నున్న యమ్మాధవధనంజయులఁ జూచునప్పుడు నాకు హర్షాశ్రుపులకలును దదనంతరంబ భయంబునుం బుట్టె నట్టియెడ. 121

క. ఈయిరువురుఁ బంచినపని, సేయుదురటె ధర్మజునకుఁ ♦ జేకుఱనితలం
పేయది యతనిం దొడరుట, వే యేటికి జమునిశిరము ♦ వ్రేయుటగాదే. 122

వ. అని తలంచుచుండ నమ్మహానుభావులు నన్ను సంభావించి తా రుపయోగించు నట్టియన్నపానంబులను దమకుఁ గట్టఁ దగినట్టివస్త్రంబులను దాము దొడుగు నట్టిభూషణంబులను నాకుఁ బ్రియం బొనర్చి గారవించిన నేనును నాపోయిన కార్యంబు విన్నవించిన విజయుండు బలుమొగంబుతో దానికి నుత్తరంబు పలుకం దొడంగిన వారించి వాఁజోదరుం డిట్లనియె. 123

—♦ సంజయుండు ధృతరాష్ట్రునకుఁ గృష్ణుఁడు సెప్పినమాట లెఱింగించుట ♦—

తే. వినుము సంజయ ధృతరాష్ట్ర ♦ విభుని పెద్ద
కొలువునందుఁ దత్పుత్త్రులు ♦ గురుఁడుఁ గృపుఁడు
నాపగానందనుఁడు మొద ♦ లైనసకల
జనులు వినుచుండఁగా నిట్టు ♦ లనుము నీవు. 124

ఆ. అయ్యజాతశత్రుఁ ♦ డలుగుట నీళ్లుల, నగ్ని పుట్టినట్టి ♦ దయ్యె మీకు
నార్ప వెరవులేదు ♦ నేర్పుమై నింకఁ గా,వింపవలయుపనులు ♦ వినుఁడు మీరు.

వ. అవి యెవ్వి యంటేని. 126

సీ. కలయట్టివివిధార్థములు న శేషంబుగఁ, దగ నొసంగుండు స ♦ త్పాత్రములకు

జెలులఁ జుట్టముల నాశ్రితులను రావించి, సత్కరింపుఁడు సంతసంబు వెలయ
[1]నిచ్చానుగుణముగ నింద్రియసుఖముల, ననుభవింపుఁడు హృదయంబులలర
నాంధ్రను బిడ్డల నయ్యైవిధంబుల, గారవింపుఁడు ప్రియపూరితముగ
తే. మఱియు నెవ్వరిచిత్తమెత్తెఱఁగునందు, వాలమైయుండు నవియెల్లఁ గలుగునట్లు
సేసి విహరింపుఁ డింక నేల సేయ [2]కనికి, నడవుఁ గుఱుచేతఁ బ్రాణంబుఁ గోలుపడక.
వ. అని చెప్పు మింత యేమిటి కంటేని. 128
ఉ. ఎందును నెవ్వరుం బడనియెంతయుఁ గష్టముపాటు వచ్చినం
గొందల మంది పాండువిభుకోడలు పవ్వల నున్ననన్నుఁ గో
విందుఁడ కావు మంచుఁ బలవించుట యాఁగఁగ వానియప్పలుం బో
లెం దలపోయ వ్రేఁ గయి చలింపక యున్నది యెప్పుడున్ మదిన్. 129
తే. ఇట్టియేఁ దేరు గడపంగ నెందు నుతికి, నెక్కు గాండీవ మేత్తెఱ నెక్కువెట్టి
రెండుదొనలను బూని కిరీటియనికి, వచ్చు నేఁ డెల్లియెందుఁ [3]బోవచ్చుమీకు.
వ. అని పలుకునప్పటివారియెత్తికోలును నీకొడుకువిషుపోషమియునుం దలంచిభయం
బందితి నితండు వారల నెఱుంగండు భీష్మద్రోణులప్రాపును గర్ణగర్వంబును
దన్ను గెలిపించు నని నచ్చి తొడరెడు నసిన విని ధృతరాష్ట్రుం డర్జునుం డే
మనియె నని యడిగిన నతనికి సంజయుం డిట్లనియె. 131
క. నరుఁ డలుక వొడమియును సుస్థిరుఁ డై తనయెత్తుసెరలఁ జెలువునఁ గెందా
మరలం దెగడెడుకన్నుల, నరుణచ్ఛవి నెఱయ నిట్టు లనియె నరేంద్రా. 132
ఆ. అసుయోధనుండు నతనికిఁ దోడ్పడ, నరుగు దెంచినట్టి ధరణినాథ
చయము వినుచు నుండ సంజయ నావచనములు గాఁగ ని ట్లనంగవలయు.
ఉ. పాండునియగ్రనందనుఁడు పా లడుగం దగ నీఁడ యేని మా
కొం డన నేల మే లది సుయోధనుఁ డింతకు మున్ను పెక్కులు
ద్దండతఁ దాను జేసినవిధంబుల కెల్ల మెఱుంగు వెట్టిన
ట్లుండెడుఁగాక యేనును వృకోదరుఁడుం బ్రియ మందునట్లుగాన్. 134
క. మాయిరువురతోఁ గయ్యము, సేయ నతం డియ్యకొనిన సిద్ధించెనకా
దే యుచితచరితుఁ డగుకొం, తేయాగ్రజుకార్యమట్టితెఱఁ గొప్పఁ గదా. 135
క. వనవాసంబున భూశ్రయ్యను ధర్మజుఁ డున్నయట్టియాయాసము వో
వునె యంపశయ్య దుర్యోధనుఁడు రణక్షోణిఁ బడక తక్కినయేనిన్. 136
ఉ. సూనృత మూఁది బన్నములు సూడక లోన నడంచినట్టికో
పానల మెండి యున్ననిబిడాటవిపైఁ బచరించుతీవ్రదా
వానలుఁ బోలి శాత్రవచయంబుపయిం గవియించి నిల్చినం
గాని యుధిష్ఠిరుం సరకుగాఁ గొన రాధృతరాష్ట్రనందనుల్. 137

1. క. గ. జ. నిచ్చానుగుణముల 2. గ. కునికి 3. క. గ. జ. వోవచ్చు.

మ. గద సారించుచు నంత్యకాలవిచలత్కాలాకృతిన్ భీముఁ డు
న్మదమాతంగచయంబు నుగ్గుగ లసత్సన్నాహరథవ్రాతముల్
చదియన్ భూరిహయవ్రజంబు పొడిగా § సంరంభతుంగాంగుఁ డై
కదియం జూచి బలే సుయోధనుఁడు భా§గం బిచ్చు రాజ్యంబునన్. 138

సీ. కోల్పులి వీఁకమై § గొదగొని లేళ్ళకు, నుఱుకు తెఱంగునఁ § దఱియఁజొచ్చి
పెనుగాలి జీమూత§బృందంబుపై బెట్టిదంబుగ వీచుచం§దమున నడరి
కసిమసంగినమారి § గడఁగి జీవులమీఁద, నుగ్రతఁ గవియున § ట్లురవడించి
యాఁకొన్నలయరుద్రుఁ§డాగ్రహంబునఁజగ,త్ప్రచయంబుముట్టెడు§భంగిఁ బొదివి
తే. నకులుఁడును దదనుజుఁడుసా§త్యకియు నాసు,భద్రకొడుకునునెదిరిన§బలమునెల్ల
బెదరఁ జెదర బడల్పడఁ § జెల్లుసావఁ, జేయఁ గని కౌరవులు సంధి§సేయువారు.

ఉ. చిత్తము లుల్లసిల్ల నల§సింహకిశోరము లొక్కమైమదో
న్మత్తగజావళిం బొదువు§మాడ్కి నరాతిబలంబు ముట్టి యు
ద్వృత్తిఁ గడంగి యప్రతిమ§వీరులు ద్రౌపదిపుత్త్రులేవురున్
నెత్తురుసీరఁ దేల్చిన న§నిం గని మీనృపుఁ డల్కదీఱెడిన్. 140

మ. చెలులుం జుట్టలు నిష్టభృత్యులు మహో§జం బ్రాణముల్ డాఁప కు
జ్జ్వలు లై తో నడవన్ విరాటుడును బాం§చాలుండు [1]నేపారి సే
నలయుద్రేకము రౌద్రముం బెనుప నా§నాహేతి ఘోరంబుగాఁ
దలపడ్డం గని కాక స్రుక్కుదురె గాం§ధారీసుతుల్ మాటలన్. 141

చ. తఱిమి శిఖండి తన్నొరులు § దాఁకఁగ నెవ్వరిదిక్కుఁ జూడ కే
డ్తెఱఁ [2]దనపూన్కిపై మనము § ధీరత నిల్పి రథంబు బల్విడిం
బఱపి కురుక్షితీశుఁ డను§బ్రహ్మకు వేయును నిండ భీష్మపై
కుఱికినఁ గాక మాకు సగ § మూరక యిత్తురె మీరు మేదినిన్. 142

శా. విద్యుద్దండము నిల్చిపోల్చినగతిన్ § విల్లందమై యుండ న
స్మద్యోధావళిమానసంబున రణో§త్సాహంబు రెట్టింప ధృ
ష్టద్యుమ్నుండు గడంగి ద్రోణుఁ గడిమిన్ § డాయంగ వీక్షించి కా
కుద్యోగించుట [3]యేల తక్కుదురు మీ § రుగ్రాహవక్రీడకున్. 143

సీ. గాండీవగుణరవం § బొండొండ చెలఁగంగ, శరపరంపర లాక§సంబు గప్పఁ
బ్రతివిశిఖములు ఖండితము లై రాలంగ, నెదిరిసైన్యంబుల § మదగజాది
చతురంగములును జ§ర్జరితంబు లై యవ, యవభేద మెఱుఁగని§యట్లు గాఁగఁ
దునిసిన నెత్తురు § నెనడును [4]నెమ్ములు, నెఱచియుఁ గండలు § నెనసి సమర
తే. తలము ఘోరంబుగాఁగపి§ధ్వజము ధవళ
హరులు శోభిల్ల నొగలపై § హరి మెలర్ప

1. చ. జ. నేపారు. 2. క దనపూన్కిమైఁ. 3. జ. కేల. 4. గ. మెదడును, నెమ్ములు నెఱచియు

దేవదత్తంబు మ్రోయఁ దోఁకతెంచునట్టి
రథముఁ గని కాని [1]కానఁడు రాజరాజు. 144

శా. బాల క్రీడ మహాసురప్రకరముల్ భంజింపఁడే మెప్పఁడుం
ద్రైలోక్యంబును భక్తి యుక్తిఁ దగ నారాధింపదే యట్టిశా
ర్యాలంకారు మహాత్ముఁ డా సరకుసేయం డచ్యుతుల్ మమ్ము తం
డేలా కైకొను నాసుయోధనునియం [2]దెగ్గది యూహింపఁగన్. 145

వ. ఏము పితామహగురుకృపాచార్యులకు నమస్కరించి యస్మదీయరాజ్యభాగం బునకై తొడరి కయ్యంబుసేయువారము కౌరవులకుం బూని యెవ్వారే మాతోఁ బెనంగినను వారిశస్త్రాస్త్రంబులు ధర్మప్రతిహతంబు లగు నని తలంచెదము పండ్రెండువత్సరములు వనంబున నమ్మెయి నిడుమలం బడి జనపదంబునం బదుమూఁడగునేఁ డజ్ఞాతవాసాయాసం బట్లనుభవించివచ్చిమాతం డ్రిపాలికిం బెనంగు మమ్మునింద్రాదిసురసహాయులయ్యును ధార్తరాష్ట్రులు గెల్చువారై రేనిధర్మంబు కంటె నధర్మము బలవంతంబైనయది యగు నింతియ కాని మాచేయునట్టిది గీడైనది గాదేము వాసుదేవుని మున్నిడికొని నడతుము గావున నీయుద్ధంబున జయంబు మాకు సిద్ధంబ యెల్లభంగులం గర్ణసహితంబుగా గాంధారీనందనులం దునిమి యేము భూమి గొనుట దప్పదు గాండీవంబు దివియకయును గుడుసువడి యెడు బాణంబులు తమయంతన తూణీరంబుల వెడలెడుఁ దో లూడ్చుమహానాగంబునుంబోలెఁ గరవాలంబు దాన యొఱ[3]వెలికి నిగుడుచున్నయది గావున మా కవశ్యంబును సంగరంబు సంభవించుఁ బాశుపతాదిదివ్యశరంబులం గురుపక్షప్రజాక్షయంబు సేసి శాంతిం బొందెదము సూతనందనా నీవు సుస్థిరుండ వై యింతయుం దెలియం బలుకవలయు నిమ్మాటలు విని కురువృద్ధుం డగుబాహ్లికుండును బితామహుం డగుభీష్ముండును గురుం డగుకుంభసంభవుండును శిక్షకుం డగుకృపాచార్యుండును గురుపుత్త్రుం డగునశ్వత్థామయు సద్బుద్ధి యగువిదురుండును ధర్మాచరణకల్యుం డగుశల్యుండును నెయ్యది నిశ్చయించి పలికి రది యయ్యెడు సుయోధనాదు లాయుష్మంతు లగువార కాక యని పలికె నని చెప్పిన విని మందాకినీనందను డందఱు విన దుర్యోధనున కి ట్లనియె. 146

సీ. నలినగర్భుఁడు పెద్దకొలువున నున్నెడ, సురపతిప్రముఖులమూఁకలెల్ల
మెఱయుతేజంబున మిఱుమిట్లు గొన నిద్దు, అచ్చట నొరసికొం చరుగఁజూచి
వీ రెవ్వరిమ్మెయి మీరుండ సరకు సేయనియట్లు పోయెడునట్టివార
లని బృహస్పతి బ్రహ్మ నడిగిన నతని కి, ట్లనియె నాచతురాస్యుఁ డాదరమునఁ
తే. దపము పెంపును బలశౌర్యదర్పములును, గలిగి లోకహితార్థంబుగాఁ జరింతు

1. క. మానఁడు; జ. పా లీఁడు. 2. గ. దెగ్గెమి; జ. దేనీతి. 3. క. గ. జ. వెఱికి.

[1]రేయుగంబున నరుఁడు నారాయణుండు, నన ప్రసిద్ధికి నెక్కినమునులు సుమ్ము 148

వ. అని పలికి వెండియు.

క. అనిమిష[2]హితను దనుజనా, శనమును జేయుదు రధర్మసంగ్రామము గ
ల్గినచోట ధర్మపరు లగు, జనముల గెలిపింతు రధికసంరంభమునన్. 149

వ. దేవాసురయుద్ధంబునప్పు డింద్రుండు వోయి వీరి నారాధించి తో డడిగినం జను
దెంచి పౌలోమకాలకేయాదు లగు ననేకదైత్యదానవులం జంపి యింద్రునకు
విజయంబు గావించి రది మొదలుగా వీరల నెల్లవారలు నెఱింగి యుండుదు
రిది యొక్క తేజంబ రెండుదెఱంగు లై వెలుంగుచుండు నని చెప్పె వినోదా
ర్థంబు జన్మాంతరంబు నొందినయమ్మహాత్ములు గదా యీయర్జునుండును వాసు
దేవుండును నర్జునుండు సముద్రతీరంబున హిరణ్యపురంబు వోడిచి నివాతకవ
చుల నఱువదివేవుర నిర్జించి పర్జన్యునకుఁ బ్రియంబు సేసె వాసుదేవుపరాక్ర
మంబు కంసనరకాసురప్రముఖనిఖిలదుష్టనిగ్రహంబునం బ్రసిద్ధంబు గాదె
తెలియ విను మున్నరూపు సెప్పెద. 150

క. ఆయిరువురు [3]నొకతల యై, యాయోధనమునకు నడచునట్టిద యేని
వే యేల [4]మనక కాదెదు, రై యే దెఱఁ దాఁక హరున కైనను వశమే. 151

క. సారథియు రథియు నై యొక, తేరం గృష్ణు లతిఘోరతేజస్సార
స్ఫారతఁ దోఁచిన నైనను, ధీరత వాటించి చూచి తెలిసెదవు బలే. 152

వ. అనుచు నాసుయోధను నుపలక్షించి శాంతనవుండు మఱియు ని ట్లనియె. 153

క. మది నామాట కొకింతయు, బెదర వకార్యంబునందుఁ బ్రియము గలిగి యుం
డుదు కౌరవులకుఁ గాలము, తుదియో కా కిట్టిగర్వితుని నే మందున్. 154

తే. హితము లగునాదువచనంబు లిపుడు వినని, వాఁడ వై తేని నప్పుడు వారువడిరి
వీరు వడి రనుపలుకులు విందుగాక, శకునికర్ణదుశ్శాసనుల్ సమ్మతింప. 155

వ. దుష్టకష్టనికృష్టాత్ము లగునిమ్మువ్వురుఁ జెప్పెడుబుద్ధులు గాని యొండు విననొల్ల
వేమి సేయ వచ్చు నని పలికినం గానీనుండు గనలి గాంగేయున కి ట్లనియె. 156

ఆ. ఇట్టు టాడఁ దగునె యే నేమి సేసితిఁ, గొలిచి కుడుచుపాడి నలవుఁ జలము
బలుకు టెందు నెగ్గుపతికిఁ బుత్త్రులకును, మనుమలకు హితంబ యొనర నడతు.

క. కాని తెఱఁ గైన నింతటి, మానిసిఁగా నేల చేయు మనుజేంద్రుఁడు న
న్నీ నెఱి దప్పినమాటలు, నీనోర వెడలఁ దగునె నిండినసభలోన్. 158

వ. అనిన విని భీష్ముఁడు ధృతరాష్ట్రున కి ట్లనియె. 159

---

1. క. గ. జ. రేయుగంబుల. 2. క. జయము. 3. జ. నొకతలఁపున. 4. క. గ. జ. చ. మనమ కా.

—♦ భీష్ముఁడు కర్ణునిదుర్నయంబు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట ♦—

తే. ఒకట నైనను వారియం | దొకరిలోని. [1]చిదురుపాలును బోలండు | సిగ్గు లేక
పాండవుల గెల్తు నే నని | పలుకుచుండు, వీనిరజ్జులు దులుపలు | వింద్రు తగిలి.

క. మగఁటిమి వారికి వీఁ డెదు,రుగ నమ్మి సుయోధనుఁడు వి | రోధము గొనె స
ర్వగుణాఢ్యులు బలవంతులు, నగుపాండునృపాలసుతుల | నవమానించెన్. 161

ఉ. ఒక్కఁడొకండ నేకవిధ | యుద్ధజయంబులు గొన్నవారు వా
రెక్కడ నేమి సేసె నితఁ | డీతనితమ్ముని గూల నేసి యు
క్కెక్కినపార్థుపైఁ గవిసె | నే పసు లాతఁడు గ్రమ్మఱింపఁగా
నక్కడ లేఁడె వీఁడు భవ | దాత్మజుఁ గోల్పడె ఘోషయాత్రలోన్. 162

వ. ఈదుర్జాతుండు కర్ణుం డెఱుంగక నీతిబాహ్యుం డై వలసినట్లు ప్రేలరిమాట లాడు
చుండు నీవునుం గైకొని విను చుండుదువు మేలు కాకయనిన భీష్మపలుకులువిని
ద్రోణుం డమ్మహారాజుతో ని ట్లనియె. 163

ఉ. శాంతనవుండు సర్వకురు | సంతతికిం గలవాఁడు గాన య
త్యంతహితంబు లీపలుకు | లాహవ మొప్పదు ధర్మసూతితోఁ
బొంతువ మేలు దేవపతి | పుత్త్రుఁడు సంజయుతోడ నాడిన
ట్లంతకు నోపు మీకుఁ దెలి | యం దగు ఖాండవదాహ మాదిగాన్. 164

ఆ. శరశరాసనములు | ధరియింప రెట్టు లెవ్వారును మగతనంబు | వలనుఁ గలిగి
కయ్యమున జయంబు | గై కొనరే యొరు, లర్జునుండ విజయుఁ | డనఁగ నెగడె.

క. మనవీటన కా దయ్యర్జునునకు సరివింటివానిఁ | జూడఁగ లోకం
బున నెందు లేమి దెల్లం, బనుమానము లేదు తోడర | నగునే వానిన్. 164

వ. అని చెప్పి యప్పాటం బరమహితోపదేశంబు సేసిన భీష్మద్రోణులపలుకులాదరిం
పక వారికి సదుత్తరంబు లీక వారలతోడం దదనురూపంబుగా సంభాషింపక
ధృతరాష్ట్రుండు వెండియుఁ బాండవులవలనివార్త లడుగుటకు సంజయుదిక్కు
మొగం బై నం జూచి కురుపక్షవీరు లందఱుఁ బ్రాణంబులదెస నిరాశులై యుండి
రమ్మహీపతి సంజయునితో ని ట్లనియె. 167

తే. ధర్మపుత్త్రున కిక్కడి | తలఁపుభంగి, యెట్టు [2]లుండు నీసైన్యంబు | లెల్లఁ గూడి
యునికివినియె నే యెవ్వరిఁ | గొనియతండు, కౌరవులమీఁద నెత్తి రాఁ | గలుగువాఁడు

వ. అనిన విని సంజయుండు వెచ్చ నూర్చి తెచ్చవడి మూర్ఛ వోయినచందంబున
డెందంబు [3]మగుడం జేష్టలు దక్కి యుండి కొండొకసేపునకుఁ జిత్తం బొక్కింత
సేసికొని యక్కటా యీభూపాలుం డింతబేల యగునే యుధిష్ఠిరుం డెవ్వారిఁగొని
యెత్తివచ్చువాఁ డని యడుగుచున్నవాఁ డింత యెఱుంగనివాఁ డెంత సెప్పినను
దెలియ నేర్చునే యితనిభంగి యిట్టి దనినఁ గొడుకుల తెఱంగు వేఱ యెన్న నేల

1. అ. చిఱుతవానిని. 2. క. లిందుల సైన్య. 3. గ. జ. మొగుడం.

యే నింక నే మనువాఁడ నైనను న న్నడిగినమాటకుం దగినమాఱుమాటవలుక
వలయున కాదె యని తలంచి ధృతరాష్ట్రున కి ట్లనియె. 169

చ. వినుము నరేంద్ర పాండుపృథివీపతియగ్రసుతుండు సంధి సే
యన మదిఁ గోరు మీరు దమయయ్యసగంబును భూమి యీక త
క్కిన మఱి కాని ముంద రొకకీడుఁ దలంపఁడు మీబలంబు నె
ల్లను మదిఁ జెఱకిం గొనఁడు లావున నేలఁ గొనం దలంచినన్. 170

వ. అతం డెవ్వారిం గొని యెత్తివచ్చువాఁ డని యడిగితివి నీయెఱుంగనివార లం దెవ్వరు గల రవధరింపుము. 171

మ. బక విధ్వంసి జటాసురాంతకు హిడింబప్రాణహారిఁ గీ
చకనిర్మూలన కేళిలోలు సమరోత్సాహైకశీలప్రవ
ర్తకు నాగాయుతసామ్యకీర్తితబలోదగ్రుం బ్రతివ్యూహదా
హకు భీముం గొని వచ్చు ధర్మజుఁడు బాహాటోపముం జూపఁగన్. 172

వ. మఱియును. 173

మ. అట మి [1]న్నందినయట్టివానిపొడ వెం తన్నట్లు ఫాలాక్షు నె
క్కటికయ్యంబునఁ గన్నఫల్గునుభుజాగర్వంబు [2]లెక్కించు టం
తటివానిం గొని ధర్మసూతి సమరోత్సాహంబుమై నెత్తివ
చ్చుటకుం గొంకునె వీఁపు సక్క నయినల్చుం గాక మీసైన్యముల్ 174

తే. నకులు సహదేవుఁ గొని ధర్మనందనుండు, మొనసి కౌరవబలములముట్టికొనఁగఁ
దలఁచి తఱి వేచి వచ్చుట ధరణినాథ, సింగములఁ బట్టి వేటాడుభంగిగాదె.

తే. ద్రౌపదేయులు నాసుభద్రాసుతుండు
నుక్కుతునియలు గారె మి మ్మక్కుమార
వరులఁ గొని యోర్చువాఁ డయి వచ్చు ధర్మ
పుత్త్రుఁ డిది నీకుఁ జూడంగఁ బోల దెట్లు. 175

వ. అని చెప్పి వెండియు నిట్లనియె. 176

క. వృష్ణికుమారోత్తముఁ డా,కృష్ణునితమ్ముండు సాత్యకియు దవదహనా
త్యుష్ణప్రతాప[3]దీప్తులు, కృష్ణాసోదరులుఁ దలఁపఁ గేవలులె నృపా. 178

సీ. శౌర్యోజ్జ్వలుండు పాంచాలభూనాథుండు మహితవిక్రముఁ డగుమత్స్యవిభుఁడు
నధికధైర్యాన్వితు లతనితమ్ము లుదగ్ర, తేజస్కులైనతదీయసుతులు
నన్నదమ్ములు ప్రతాపోన్నతు లేవురు, కేకయపతులు నక్షీణబాహు
శక్తి[4]యుక్తులు జరాసంధసూనుఁడు సహ,దేవుండు నాజయత్సేనవిభుఁడు

తే. వినుము శిశుపాలతనయులువీరధనులు, ధృష్టకేతుండు వృషభుండుఁదీవ్రరణవి

1. క. న్నందినయంతవాని. 2. క. లెక్కింపు మం; గ. లెట్టించు. నం. 3. జ. మూర్తులు 4. క. యుక్తుఁడు.

నోడి యదుభర్తచేకితానుండు దర్పఘనుఁడు దైన్యపాలుండుఁ గోలయగాదె.

క. వీరెల్లఁ బాండురాజకుమారులపాటునకుఁ గుందక సమరములతోడన్
వారిపగ దీర్పఁ గడఁగెదు వారల కా కింక నుందాక పారుఁ గలరే. 180

వ. భీమసేనుసూనుండు ఘటోత్కచుండు దండ్రికంటెను లావును బీరంబునుం గల వాఁడు మాయాబలంబున మనబలంబు నెల్లం గలంచు మఱియును మాప్పన నుత్తరంబునం గలుగునరనాయకులు నానాసేనాసమన్వితు లయి వచ్చి చిచ్చ యిననుం బిడికిలింత మనుచున్నవా రదియునుం గాక. 181

క. సకలభువనములు నఱచేతికిఁ దేరం జాలునట్టి కృష్ణుఁడు దే
వకికొడుకు గలఁడు ధర్మజునికి నాతం డొత్తి వాక నిలుచునె యక్షిపా. 182

వ. అని చెప్పిన సూతపుత్త్రునకు నంబికాపుత్త్రుం డి ట్లనియె. 183

—ధృతరాష్ట్రుఁడు భీమసేనాదులపరాక్రమంబు దలంచి దుఃఖించుట.—

క. వారిదెస నీవు సెప్పిన యారథికులు ప్రబలు లగుదు రందఱు నైనన్
వా రెల్లను నొకతల యమ్మారుతి యొకతల బలప్రమాణము సూడన్. 184

ఉ. భీముఁ దలంచినన్ మనము భీతిఁ గలంగుచు నుండు నాకు నే
[1]లేమియు నిద్ర రా దతని నేడ్తెఱ మాన్పఁగఁ జాలునట్టివాఁ
డీమొన లేఁ డతం డలుక నెత్తినయాగద కాలదండము
ద్దామవిలాసుఁ డై కురుకదంబములో విహరింప కుండునే. 185

తే. చిఱుతనాఁడును వాఁడు నా కొడుకులఁ బోఁడు, వీరు చివ్వకుఁ జొత్తురు వైర మెత్తి
వానిచేఁ బీడ వడియును మాన రదియ, కాదె యీభేదమున కెల్లఁ గారణంబు.

క. సమరమున దైత్యదానవసమితియు నాతని కెదుర్పఁ జాలదు భుజయు
ద్ధమున జరాసంధుని నొకనిమిషంబునఁ జంపె నొరులు నిలుతురె యెదురన్.

మ. బొమ లల్లార్చ ముడివడ్డ రౌద్రరస ముప్పొంగం దనర్పన్ భుజా
గ్రము లిం దెవ్వఁడు నాకు మా ఱనుచు శౌర్యస్ఫూర్తి శోభిల్ల దు
ర్దమలీలం [2]గవియంగ భీముఁ గని దైర్యం బేది కౌరవ్యసై
న్యము లంతంతఁ గలంగఁ బాఱినటు లై నామోమునన్ వ్రేలెడిన్. 188

క. కరవాలము గద మొద లగు పరికర మేమియును లేక బాహుబలమునం
గరిగతి నడరినను వృకోదరునకు నొకఁ డెదుర నిలిచి తలపడువాఁడే. 189

తే. ప్రళయకాలసముద్రముభంగిఁ బొంగి, కడుభయంకరుఁ డగుభీముఁ గడవ నీఁద
వశమె నాపుత్త్రులకు విధివశము పొంది, యెదిరెఁ దమ్ము నెఱుఁగరు మదముకతన.

క. చిచ్చునకుఁ దోడు కరువలి, వచ్చుగతిన్ భీముదుర్నివారవిహారం
బచ్చుపడఁగఁ బ్రాపై వివ్వచ్చుఁడు వెస వచ్చు గాండీవంబును దానున్. 191

వ. సంజయా వినుము నీ కున్నరూపు సెప్పెద. 192

---

1. క. గ. జ. యేమియు, 2. క. గదియంగ.

క. ఆయర్జునుమగఁటిమి కెన, యేయుగములఁ జూడ వినఁగ నెందును గలఁడే
నీయెదుర నాడినంతయుఁ, జేయుట కతఁ డోపు రిత్త సెప్పెడువాఁడే. 193

ఉ. ఎక్కటిగాండివంబు నతి కెక్కు వెలుంగుట మీఁదఁ గేశవుం
డక్కజ మైన తేజ మది యాసపడంపు దనంత నర్జునుం
డొక్కఁడ వైరిసేనలకు నొట్టినమంట ప్రతాపమూర్తు లి
ట్లొక్కెడఁ గూడె నిన్నిటిమహోగ్రపువేఁడిమి కోర్వ వచ్చునే. 194

క. దివిజదనుజసహితము లగు,భువనము లన్నిట మహేంద్రపుత్త్రుఁడు విజయో
త్సవలీలఁ గ్రీడ సల్పుం, దవులంబడఁ డెందు నత్యుదగ్రబలమునన్. 195

వ. అని పలికి వెండియు. 196

క. కురుసేనఁ గడా గెలుచుట, కరము భరం బర్జునునకు గాండీవమునం
బెరిఁగినయమ్ములమంటల, దరికొని తెగఁ గాల్చునట్టిదయ యగుఁ జుమ్మీ. 197

వ. భీమార్జునులకొలందులు భీష్మద్రోణు లెఱుంగునంతకంటె నెవ్వ రెఱుంగుదు రె
ఱింగియు మానుషంబు వాటించి సేనమొగంబున నిలుతురుకిత్తివట్టిప్రాణంబులు
విడుతు రింతియ కాని చేయునది లే[2]దదియునుం గాక పౌత్త్రులగుటయు శిష్యు
లగుటయు గాంగేయునకు గురునకు సామాన్యం బగుటం జేసి రెండుదెఱంగుల
వారికి వీరొక్కరూప మనకడ నున్న తప్పునకు మనముందట నిలువపలయు నను
నింతమాత్త్రకుం గా వీరల కింత వలసెనేను దైవాధీనతకతంబున బిడ్డల నొత్తి
చెప్పను నియమింపను జాల మొదల విదురుం డేమని చాటి చెప్పె నది
యంతయుం బాటిలె జూదంబునాఁటనుండియుఁ గురుజాతికిం జేటు మూఁడుట
దోఁచు చుండు మందబుద్ధియు లోభోపహతుండును నయి దురభిలాషంబున
దుర్యోధనుఁ డింత సేసెఁ గాల[3]పర్యాయంబునఁ గౌరవులకుఁ గడవరానియవస్థ
వచ్చె సంజయా నే నేమి సేయుదు నెందుఁ జొత్తు నెద్ది దెరు వెవ్వరు శరణంబు
వారిరువురుఁ గలయంతటన పోయెనే విను మని మఱియు నిట్లనియె, 198

చ. అనుజులు నట్టివార ద్రుపదాదిసుహృజ్జను లెల్ల నంతకం
టెను బలవంతు లాహవపటిష్ఠుఁడు రాజు యుధిష్ఠిరుండు స
ద్వినయవివేకశీలముల విశ్రుతుఁ డాతఁడు బంధుభృత్యులం
దనకు వశంబు సేసికొను దానికి నేర్చుఁ బ్రభుత్వసంపదన్. 199

ఆ. సత్యశౌచధర్మశాలి దయాపరుం, డట్టిధర్మపుత్త్రు నాక్రమింప
మనము దలఁచు టెల్ల మంటలో మిడుత లు, దగ్రవృత్తి నుఱుకఁ దలఁచునట్ల.

వ. కావునఁ బాండవులతోడిభండనంబునఁ గులక్షయం బగుట దప్పదు శాంతిఁబొం
దుటయ మేలు మనవారల కది ప్రియం బగునేని దానికిఁ దగినయత్నంబు
సేసెద ననిన విని ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె. 201

1. జ. నొడ్డినమంట. 2. క. గ. దదియును బౌత్త్రుల 3. క. క. విపర్యయంబున.

క. దేవర యానతియిచ్చిన, యీవాక్యము లెస్స నాఁడు ♦ నీవ యుపేక్షం
బో విడిచితి వింకను నీ, చే వత్తురు వారు పేర్చి ♦ యె ట్లొప్పఁదు రే. 202

వ. అది యె ట్లంటేని. 203

క. వారు దేస లొత్తికొనియు ధ, రారాజ్యం బిచ్చి పోయ్యెరా పోరా తా
రారణ్యా పీడఁ బడియును, రారాజుం జెఱుకుఁ బాపరా మన మెఱుఁగన్. 204

వ. అట్టియెడ నైనను. 205

క. రావించి తగవుమై సం, భావింపవ కాక నాఁడ ♦ పాండవు లఱుకం
బో విడువరె మిగులుదురే, నీవచనంబులకుఁ బిలిచి ♦ నిలుపుము వారిన్. 206

— ♦ దుర్యోధనుఁడు తండ్రితో స్వపక్షవీరులసామర్థ్యంబు సెప్పుట. ♦ —

వ. అనిన విని దుర్యోధనుండు దండ్రి కి ట్లనియె. 207

చ. అడవులఁ గొండలం బడి మహాపద రూ పఱి చన్నవారి ని
ప్పుడు గొని వచ్చి కృష్ణుఁ డొకప్రోవుగఁ గూటువమూఁక గూర్చినం
బొడుతురె పాండునందనులు ♦ భూవర యేటికి నింతభీతి మా
కడిమియు లావు నీ వసదుగా గణుతింపకు గెల్తు మెమ్మెయిన్. 208

తే. పరశురాముని గెలిచినబల్లిదుండు, భీష్ముఁ డవనీశ లీతని పేరు వినినఁ
బాఱుచుండుట యెఱుఁగవే ♦ పాండుపుత్త్రు, లనఁగ నెంతటివారితం ♦ డలిగెనేని.

క. కృపుఁడును గురుఁడు నయోనిజు, లపరిమితభుజాబలాఢ్యు ♦ లాహవకేళీ
నిపుణు లజేయులు వీరులు, కుపితాత్మకు లైన మాఱుకొనునే హరుఁడున్. 210

క. ఈశ్వరవరజనితుఁడు హరి, దశ్వప్రతిమానతేజుఁ డస్త్రకళాని
త్యైశ్వర్యధురంధరుఁ డీ, యశ్వత్థామ గలుగ మన ♦ కని వెఱ పేలా. 211

ఆ. సహజకుండలుండు ♦ శౌర్యధుర్యుఁడు సము, దీర్ణబాహుబలుఁడు ♦ కర్ణుఁ డిందుఁ
గలఁడు వీని కెదురు ♦ గలఁ [1]డని యెన్నుమా, ధర్మపుత్త్రపాల ♦ ధరణినాథ.

క. వినుము నరేశ్వర కర్ణుని, పెనుపు మహేంద్రుండువచ్చి ♦ ప్రియమున శచికై
తను నర్థింపఁగ నిచ్చెను, గొను మని లోకంబు లెఱుఁగఁ ♦ గుండలయుగమున్.

వ. వీర లాధర్మపుత్త్రాదులచేతన కా దెవ్వరిచేతనుం జెడమి దెల్లంబు బాహ్లీకసోమదత్తభూరిశ్రవశ్శల్య సింధురాజ గాంధారరాజప్రభృతిమహావీరులు వీరలకం టెను శక్తిసమగ్రులు దక్కటిరాజలోకంబును సహాయు లై వచ్చినవివిధదేశాధీశులును నాతోడిసుఖదుఃఖంబుల కియ్యకొని యగ్గలికమై నగ్గి నైన నుఱుకను సముద్రం బైన నీఁదను దెంపు సేసి పొంపిరి వోవుచున్నవారు గావునఁ బాండవులకు మా దిక్కు దేఱి చూడనుం గొలంది గా దనుమానింపకు మిట్లునుం గాక మాకు నెవ్వరును లేక చుట్టంబులును జెలులును విడిచి తోడువచ్చినవారును విచ్చిపోయి భృత్యులును విరక్తు లై వారిక పోటుమానుసులును బంధుమిత్త్రసహాయులును

1. క. డెవ్వఁ డెన్నుమా.

ప్రజానురాగంబునుం గలిగినట్టి దైన నది ప్రాప్తకాలం బింతియ కాని యే
మింక వారియడుగు లొత్తను బాఱి పోవనుం జాల మెల్లభంగుల సమరంబు
సేయుదుము తలపెట్టిన నా తలంచినట్లాండె వాసుదేవుండు దలంచినట్లాండె
నయ్యెడు నెట్లైన మే లింతవట్టును నిర్ణయం బని పలికి మఱియు ని ట్లనియె.

తే. కులములోఁ దలవం పగు § కూఁడు గుడువఁ, బంపఁ జూచెద వొకళులఁ § బఱతురట్టి
వారపై నెత్తి వచ్చినఁ § బోర్కి కోప,[1]మనిన ధృతిచేటకాక పొం § దగునె చెప్పుమ.

క. నీవు బతిమాలి కొడుకుల, చావునకును జేటునకును § జాలక యిమ్మై
వావిడిచి యఱచినం గడు, నేవపడరె జనులు నిన్ను § నే మన నేర్తున్. 216

తే. భీమసేనుని నీ వింత § పెద్ద చేసి, పెక్కుభంగులఁ జెప్పితి § యుక్కు గలఁడు
గదకు నేర్చునం చెంతయు § బెదరెదతఁడు, నన్నుఁబోలమి యెఱుఁగవే § నరవరేణ్య.

మ. గద నాతో సరి మూఁడులోకముల నేఁ § గానం జలం బెత్తి యు
న్మదుఁ డాభీముఁడు న న్ననిం దొడరిన § న్వజ్రప్రహారంబు బె
ట్టిద మై తాఁకినఁ గూలుపర్వతముమా § డ్కిం గుంభినిం గూల వ్రే
సెద నాకొక్క గదా గదారణము వ § చ్చెం బెద్దకాలంబునన్. 218

ఆ. అతఁడు వడిన వెండి § యాసేనఁ గోల్తల, సేయ నొకఁడు లేమి § సిద్ధ మింత
యెఱిఁగి వెఱచి కాదె § యేనూళ్ళైనను, దమకుఁ జాలు ననియె § ధర్మసుతుఁడు.

వ. అర్జునుండు గలం డని తలంచితివేని. 220

తే. కర్ణువడసినయాశక్తి గలుగఁ బోర, బ్రదుకవచ్చునె నరునకు § నదియుఁ గాక
యతని భీష్మాదిరథికుల § యతులితాప్ర, మేయదివ్యబాణంబులు § మ్రింగికొనవె.

వ. దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ వివింశతి వికర్ణ చిత్రసేనాదు లగునీకొడుకు
లొకం డొకండ జగంబు లెల్ల జయింపఁజాలుదు రందఱు నొక్క మొగం బై
తోఁచినడచిన సవ్యసాచి నొక్కరున కాదు పాండవుల నెల్ల నొక్కెత్తున వైచి
కొన నోపుదు రట్లునుం గాక మాకు నక్షౌహిణులు పదునొకండు వారికి నేడ
క్షౌహిణులు మా సైన్యంబు సారవంతంబు వారిబలంబు నిస్సారంబు వారు మ
మ్మెవ్విధంబున జయింప నోపుదు రీయెక్కువదక్కువలు విచారింపక వలవనివెఱపు
గట్టికొని ముకుఱ్ఱారి వగచు చున్నవాఁడవు నిన్ను వగవ కుండ నుడుపం జాల
మంతియ కాని తక్కెల్లపనులకుం జాలుదు మని పలికి సంజయు దెసఁ గనుం
గొని సుయోధనుం డి ట్లనియె. 222

క. నానాదేశంబులబలు, మానుసులం గూర్చికొని స § మత్సరబుద్ధిం
దా నే మనియెడు నయ్యమ, సూనుం డాతనితెఱంగు § సూతము చెప్పుమా.

వ. అనిన విని సంజయుం డి ట్లనియె. 224

---

1. క. తుంబున.

—♦ సంజయుఁడు దుర్యోధనునకు ధర్మరాజునిశ్చయం బెఱింగించుట ♦—

ఉ. ఆతఁడు భండనం బనిన [1]నార్చిన మూఁడు వేర్పునంతయుం
బ్రీతి వహించి తమ్ములోక పెండ్లికిఁ బోయెడునట్లు యున్నవా
రా తెలి వెందునుం గలదె యండలినాయకు లెప్పుడోక్క మా
చేతులతీఁట పుత్త్ర మనుచిత్తము కాని చలింప రేమియున్. 225

తే. నరునిపాశుపతాదిబాణములపెంపు
భీముగదసొంపు నమ్మి యుద్దామలీలఁ
జెలఁగి వెఱ పేది యక్కడి బలము మునురు
గవిసి [2]యెపుడుఁ గయ్యమునకుఁ గాలు ద్రవ్వ. 226

క. నావుడు నిది యా సంజయ, కై వారము సేసె దీప్ర కౌంతేయుల వా
రేవి రణసాధనములు,గా వెఱవక నడచువారు కౌరవులపయిన్. 227

వ. అనిన సుయోధనునకు సూతనందనుం డర్జునుదివ్యరథ శ్వేతాశ్వ కపిధ్వజ దేవదత్తంబులమహానుభావంబులు వేఱు వేఱ వర్ణించి చెప్పి యుధిష్ఠిర భీమ నకులసహదేవులయరదంబులు తురంగాదిపరికరంబు లిట్టిట్టి వని యేర్పడఁ బలికి విరాటద్రుపదాదులకు వలయునుపకరణంబులు గొఱంత లేమియు నెఱింగించిన ధృతరాష్ట్రుం డిందుఁ గలబలుమానిసు లెవ్వరికి నసాధ్యులు వీరి సాధించుతెఱం గూహించిరే యని యడిగిన నతనికి సంజయుం డి ట్లనియె. 228

సీ. గంగాసుతుండు శిఖండిపా లతనికిఁ, బ్రాపు మత్స్యేశ్వరుబలము కుంభ
భవుఁడు ధృష్టద్యుమ్నుపాలతనికిఁ దోడు, పడుద్రౌపదీపుత్త్రపంచకంబు
రారాజుఁ దమ్ములు మారుతిపాలు కుమారు లందఱు నభిమన్యుపాలు
శకునిసైంధవులు నశ్వత్థామకర్ణులు, దక్కొరుచేఁ బోని దండిమగలు
ఆ. సవ్యసాచిపాలు సాత్యకిపా లకృత,వర్మ చేకితానవసుమతీశు
పాలు సోమదత్తుఁ డాలంబునకు నిట్లు, నిశ్చయించి రచట నృపవరేణ్య. 229

క. నకులుఁడు సహదేవుండును, శకుని నులూకాదిసుతుల సారస్వతులం
బ్రకటబలు లైన కాళిం,గకులను సమయించువారు కౌరవనాథా. 230

క. కేకయులు మనలఁ గలసిన, కేకయుల జయించువారు కృతపుణ్యుఁడు సు
శ్లోకుఁడు ధర్మతనూజుఁడు, లోకోత్తరు శల్యుఁ దా గెలుచువాఁ డధిపా. 231

వ. అట్టిపలుకులసమయంబున నచ్చోటఁ గొందఱుజనంబులు ధర్మనందను నుద్దేశించి.

క. ఇతఁ డెక్కడ మద్రమహీ,పతి యెక్కడ నితని కతఁడు పాటియె యనుడుం
బ్రతివచనంబుల శల్యుని,యతిబలశౌర్యములు వారి కాతఁడు చెప్పెన్. 233

వ. ఇట్లు గాకయు నెవ్వరిమొగంబున నెవ్వరు వడిరె వారికి వార చాలి యుందు

1. గ. జ. నార్చుచు; చ. ఱంతన. 2. క. గ. యిపుడు.

[1]వారని రివ్విధంబునఁ గ్రొవ్వు మిగిలి కొంతంత లేని తెగువం దేజరిల్లుచున్న వారు నీకు నీకొడుకునకు నెయ్యది గర్జం బైతోఁచె నదియ చేయుం డనిన విని విచిత్రవీర్యతనయుం డి ట్లనియె. 234

క. నాకొడుకుల కెక్కుడి బ్రదు, కేకొలఁదిఁ దలంప నిప్పు । డెన్నినవీరా
నీకంబు నోర్వ వచ్చునె, [2]యీకూడినసైనికులకు । నే మనువాఁడన్. 235

క. రాజు యుధిష్ఠిరుఁ డైహరి, దా జయ మొడఁగూర్ప నున్నఁదత్సైన్యము రా
రా జిట్లు సరకుసేయమి, నాజన్మము దుఃఖభాజనం బగుటఁజుమీ. 236

క. నా కుడుప నేల వశ మగు, నీకూడినభూపతులకు । నింతియ కాలం
బై కడచన్నది సంజయ, నీ కీవగ పేల యింక । నిలుపుము పలుకుల్. 237

వ. అనిన విని దుర్యోధనుండు నిజజనకుతో ని ట్లనియె. 238

ఉ. ఏమును బాండునందనులు । నేకకులంబునఁ బుట్టి యొక్కచో
నే మొకఁ డైనఁ జేసి గెడ । నెప్డుఁ జరించినయట్టివారము
ద్దామబలంబు శౌర్యమును । దర్పము వారిక కల్గి వార సం
గ్రామమునన్ జయింతు రనఁగా నొకనిశ్చయ మెట్లు గల్గెడున్. 239

ఉ. వారిని వారివారి నిటు । వర్ణన సేసెదు గాని మమ్ము మా
వారిఁ దలంప విప్పుడమి । వారికిఁ బాయను [3]మాకు నంతయుం
జేరను మున్ సృజించె విధి । సిద్ధము దీని నొకండు మాన్పఁగా
నేరఁ డకారణంబ మది । నెవ్వగ లేటికిఁ బట్టుకొల్పఁగన్. 240

వ. అనిన విని సూతనందనునకు నంబికానందనుం డి ట్లను నా కొడు కున్మత్తప్రలాపంబులు సేయు చున్నవాఁ డింతియ కాని సత్యధర్మనయపరాక్రమసహాయసంపన్నులైనపాండవులఁ దనకు గెలువ వచ్చునే తాను ప్రబలుం డయినను బెనఁకువ గీడ కాక మేలగునే యది యట్లుండె నొక్కటి యడిగెద సంజయా చెప్పుము. 241

క. సమరమునకుఁ బురికొల్పుచు, మము దలఁచిన నుల్లికుట్టు । మాటలఁ దచ్చి
త్తము లుడికించుచుఁ బాండవ,సమితిం గడఁగించువా రెచట నెవ్వారొకో. 242

క. నావుడు సంజయుఁ డి ట్లను, దేవా పాండవులయలుక । ధృష్టద్యుమ్నుం
డేవెరవుమాట నైనను, నే వోసినయగ్నిభంగి । [4]నిగుడం జేయున్. 243

వ. అతండు ధర్మతనయుతో నిట్లను గాంగేయకుంభసంభవాదిమహావీరక్రూరసత్త్వబహుళంబును గరిఘటాగిరికదంబకలితంబును దురంగనికరతరంగపరంపరాఘోరంబు నగుకౌరవసేనాసముద్రంబునకు నే నొక్క చెలియలికట్టనై నిలిచెద నన వుడు నయ్యుధిష్ఠిరుండు నీ వింతకుఁ జాలుట యెవ్వరు నెఱుంగరే యెట్లును సంగ

1. వార. మని. మాని. రివ్వి. గ. వారవిహ్వాని పలికి రివ్వి. 2. క. యాకౌరవసైనికులకు 3. జ. మమ్ము. 4. క. నిగడం.

రంబున మమ్ముద్ధరింపు మనియె నిట్లు గొనియాడిన నాతండు నాదేసం గనుం గొని సంజయా మీవారల కెల్లనుం దెలియం జెప్పు మీశ్వరాదిదేవతలు సమకట్టినసవరణ గలయర్జునిచేత నిర్జింపంబడినయుత్కృష్టజాతు లనేకు లగుట యెఱుంగుదుర కాదె మనుష్యు లతని కెంతపెద్ద యిట్టిజెట్టి నెన్నుదస్న చూడఁ గలవాఁడు గావున మముబోంట్లెల్లఁ బోక పెనంగినం బోరు భరంబైనం బ్రాణంబులపై వచ్చునంతకంటెను బరమదయాపరుండైనపాండవాగ్రజుమఱువు సొచ్చి బ్రదుకుం డను మంతలంతలు దప్పులు సేసితి మని తలంకవలవ దెంతలు సేసినను గౌంతేయపూర్వజుండు శాంతిసుధానిధి యగుటంజేసి శరణు సొచ్చినంగాచు నని పలికె ననిన విని ధృతరాష్ట్రుండు దుర్యోధనున కిట్లనియె. 244

క. పరిజనులకు నీకును ని,ద్ధరలోన సగంబు సాలుఁ ‡ దక్కటిసగముం
గర ముచితంబుగఁ బాండవ, వరుఁ డగుధర్మజున కిచ్చి ‡ బ్రదుకుము నెమ్మిన్.

—♦ ధృతరాష్ట్రుఁడు దుర్యోధనునితో సంధి సేయుమని చెప్పుట. ♦—

చ. పెనఁకువ నాక యేల మన ‡ పెద్దల కెవ్వరి కియ్యకోలు గా
దనుచితవృత్తిగాన గురుఁ ‡ డాదిగ నాప్తులు బంధుమిత్త్రులున్
గొనకొని పోరికిం జొర ర ‡ కుంఠితతేజుఁడు ధర్మపుత్త్రుఁ డా
తనిఁ దగఁ గూడి మన్కి ప్రమ ‡ దం బగుఁ గౌరవజాతి కెంతయున్. 246

వ. అని వెండియు. 247

క. కర్ణుండు రేఁచి పెట్టఁగ, దుర్ణయపరు లైనశకుని ‡ దుశ్శాసను లీ
నిర్ణయమె మే లనఁగ నీ, కర్ణములకు నించు నెట్లు ‡ కార్యవచనముల్. 248

వ. అనినఁ గటకటంబడి సుయోధనుం డి ట్లనియె. 249

క. నీచెప్పెడిపెద్దలు ద్రో,ణాచార్యులు మొదలు గాఁగ ‡ నని కొల్లనివా
రై చేరనివారిం గొని, యే చక్కంబెట్టువాఁడ ‡ నేఁ బాండవులన్. 250

శా. రాధేయుండును దుస్ససేనుఁడును బో ‡ రం బ్రావుగాఁ బాండవ
క్రోధజ్వాలల నార్తు నొండొకఁడు నా ‡ కుం దోడె నీ వింక నన్
బాధం బెట్టకు వాఁడిసూదిమొన మో ‡ వం జాలునం తైననే
నీధాత్రీతల మీను వారలకు నా ‡ కే [1]లింతసేగిం బడన్. 251

వ. అనిన గాంధారీవల్లభుం డతనిం కి ట్లనియె. 252

ఆ. నీకు నంత వగవ ‡ నీపోవుతెరువునఁ, బోవువారు గాఁగఁ ‡ బూని యున్న
వారి కెల్ల నేను ‡ వగచెదఁ గయ్యంబు, వలవ దుడుగుమయ్య ‡ చలముగొనక.

చ. ఉభయబలంబులుం బొగడ ‡ నుగ్రత భీముఁడు విస్ఫురద్గదన్
రభస మెలర్పఁ గుంభములు ‡ వ్రయ్యఁగ వేసిన నెత్తు రొల్కఁగా
నిభములపిండు గావిసెల ‡ యేఱులతోడి నగంబులట్లు సం

1. లంత

క్షుభితము లై పయిం బఱవఁ జూచి తలంచెద నాదువాక్యముల్. 254

చ. ఉఱక ధనంజయుండు వివిధోగ్రశరంబుల నొక్కమాత్ర నే
త్తెఱ నుఱుమాడినం బుడిమిఁ ద్రెళ్ళిన నీవగుసైన్యమంతయుం
నఱికినఁ బద్ధఘోరవిశిఖనంబువిధంబున నున్నఁ జూచి య
త్తఱి నయినం దలంపు ముచితం బగు నావచనంబుఁ బుత్త్రికా. 255

వ. అని పలికి యతనివలనం బిక్కు గానక మనంబు [1]మరలం బెట్టికొని కొడుకులు
జయింప నోపుదురొకో యనునాస సంజయుదిక్కు మొగంబు సేసి పాండవకౌరవ
పక్షంబులం గలవారి నడుగుచుం గొలందులు దలపోయుచు నాతనివచనంబు
లం దనవిచారంబులను బలాబలంబులు నిశ్చయించి పాండవేయు లెక్కుడవుట
యెఱుంగుచుఁ గ్రమ్మఱ నాసూతపుత్త్రితో లెక్కలు వెట్టుచుం బోలించుచుఁ
బెద్దప్రొద్దు వితర్కించి కౌంతేయులశక్తి దేవతలశక్తియు గాంధారేయులశక్తి
మానుషశక్తియుం గాఁ దెలిసినవాఁడై యంబికానందనుండు నిజనందనునితో
ని ట్లనియె. 256

క. నరుఁ డగ్నిదేవుఁ దనకును, వరదునిఁ గాఁ గొలిచినాఁడు వానికిఁ గేతు
స్ఫురణం బాదిగఁ గలసం,గరపరికర మెల్ల నతఁడు గావించె దయన్. 257

వ. అదియునుం గాక ధర్మదేవతయు వాయుదేవుండును వాసవుండును నాశ్వినులును
వారలకుఁ బాండురాజుతోడివారలు వారి నొకకీడునుం బొరయకుండ రక్షింతురు
గావున భీష్మద్రోణప్రముఖులకుఁ బాండవులం బరిభవింప రామి దెల్లంబు. 258

క. దేవత లేటికిఁ బార్థుఁడు, దేవసముఁడు గాఁడె వాఁడు దివిజులచేతం
బోవనిదైత్యులఁ జంపఁడె, యీవును నీవారు నతని నెఱుఁగరె చెపుమా. 259

వ. కౌరవులకు వచ్చినయిమ్మహాభయంబునకుఁ బ్రతీకారంబు శాంతిం గడచినయది లే
దెన్నిభంగులం జూచినఁ గయ్యంబుడుగుటయ మనకుం గర్తవ్యంబై యున్నయది
యుపశమింపవయ్యా దీర్ఘవైరంబు వలవ దనినఁ దండ్రికిం గొడు కి ట్లనియె. 260

క. దేవత లర్జునునకుఁ దో, డై వత్తు రనంగ వలవ దది యె ట్లనినన్
దేవత్వము రాగద్వేషావేశము లేమిఁ గాదె యైనది మొదలన్. 261

వ. కావున వా రొకళ్ళవారుం గా రట్లుం గాక పక్షపాతు లై పూని వత్తురయేని
నది దేవత్వంబుగా దట్టిదేవత్వంబున నర్జునుండును సురక్షితుండు గా నేరఁడు
నీకు నాపనికిఁ జింత వలవ దని పలికి వెండియు ని ట్లనుఁ బెరిఁగి వచ్చుకార్చిచ్చు
నుఱుపను బాషాణవర్షంబు వారింపను మహావాయువు నిలుపను నీళ్లు గట్టిగా
నభిమంత్రించి వానిపైఁ గరితురగాదుల నడపింపను నాసేన నడచునప్పుడు వల
సినచోట జలంబు లుత్పాదింపను జాలుదు సింహశరభశార్దూలభూతబేతాళాది
క్రూరసత్త్వసంరంభ స్తంభనప్రకారం బెఱుంగుదు మిత్త్రశత్త్రువిషయంబులై నను

1. జ. మొగుడ్చం.

భాశుభంబులు వలయుభంగి నావహింపఁ నేర్తు మఱియు నానావిధసిద్ధిప్రదంబు లగుమంత్రధ్యానాద్యనుష్ఠానంబుల నాకుం గొఱంత లేదు నీ చెప్పినయగ్ని ప్రముఖదేవతలం బ్రసన్ను లగునట్లుగా నారాధించినవాఁడ వారికి నాకుంబోలె మహానుభావంబు గలిగినఁ బదుమూఁడువత్సరంబు లబ్బంగి నిడుమలం బడుదురె వినుము చెప్పెద. 262

—♦ దుర్యోధనుఁడు తండ్రితోఁ దనబలపరాక్రమంబులు సెప్పుట. ♦—

క. ఏ నలిగినవారిని సుర, లైనను రక్షింప నోప § రమరు లలిగినం
బూని చెడ కుండఁ గాతును, మానవు లోకసరకె నాకు § మనుజాధీశా. 263

తే. గర్వమున నాడుమాటలు § గాఁ దలంప,వలవ దిది యెల్ల నిక్కంబు § వసుమతీశ
నన్ను నేఁ జెప్పికొందు నే § యెన్నఁ డైన, నాత్మసంస్తుతి పౌరుషం § బగునె చెపుమ.

వ. ధర్మతనయాది పాండవేయులును ద్రుపదాదిపాంచాలురును విరాటాదిమాత్స్యులును వాసుదేవాదియాదవులును మఱియునుం గేకయ పాండ్య మాగధ చైద్య ప్రముఖనిఖిలదండనాయకులును నాబారిం బడి మున్నీరు సొచ్చినవేఁటులచందంబున నడంగిపోవుట యవధరించెదుగాక వా రెల్లఁ దేజోధైర్యపరాక్రమోపాయవిచారవివేకంబుల నాయెత్తువత్తురె పితామహద్రోణకృపాశ్వత్థామలు శస్త్రాస్త్రవిషయంబులుగా నేమేమి యెఱుంగుదు రెంతెంత నేర్తు రది యెల్ల నెఱుంగుదు నంతయు నేర్తు నని పలికి యందఱు వెఱఁగుపడి యుండం దాను సంజయుతో సంగరంబు తెఱంగు నాలోచనంబుగాఁ బాండవులదెస మాట లాడు చుండఁ గర్ణుండు ధృతరాష్ట్రుం గైకొనక ధార్తరాష్ట్రునకుం బ్రియంబుగా నిట్లనియె. 265

క. గురునలుక నాకు నస్త్ర,స్ఫురణ మెడలె నందు జనులు § బొంకది పూజా
పరతమెయి నమ్మనీశ్వరు,కరుణ గొఱలి మగుడఁ బడయఁ § గాంచితిఁ బ్రీతిన్.

ఉ. కావున నస్త్రశస్త్రము ల§ఖండితసంపద నొంది యుండు దే
వావలి కైన నన్నుఁ జెన§యఁగ భర మేఁ గలుగంగ నర్జునుం
జే విడిపించు మేదినిఁ గ§డిందిమ గంటిమి యుల్లసిల్లఁగా
నీవు బలంబు మెచ్చ నని § నిల్చెద గెల్చెదఁ బాండవేయులన్. 267

శా. గాంగేయాదులు నీకడన్ నిలిచి వే§డ్కం జూడఁగా సర్వసే
నాంగాంగంబులమీఁద గాలియును జొట్టాడంగ నీ కేను వీఁ
కం గౌంతేయులఁ దాఁకి తత్తనువు లు§గ్రస్ఫారబాణాలిఁ గూ
లం గోదండవిలాసముల్ మెఱయ లీ§లం బోరఁ గ్రీడించెదన్. 268

వ. అనిన విని యిననందనునకు మందాకినీనందనుం డిట్లనియె. 269

క. కాలుఁడు ప్రేరేపఁగ నిటు, ప్రేలినయంతటన నిన్నుఁ § బెద్దగఁ దలఁపం
బోలునె మాకును నుడుగుము, చాలుదు వీ వెల్లపనులు § సాధింపంగన్. 270

ఉ. కూలెదువారె పాండవులు § ఘోరపుఁబోర నొకండొకండ యీ

చాలెదువార లెల్ల మును । చావఁ గ్రమంబున సేన లన్నియుం
గూలఁగఁ గౌరవుల్ పిదపఁ । గూలుదు రింతియ కాక నోరిచే
ఁలేల వృథాభిమానమున । నిన్నియుఁ బ్రేలెదు సూతనందనా. 271

తే. దివిజపతి నీకు నిచ్చినశక్తి వ్రశక్తి
చేతఁ గవ్వడి వధు నని । చూతువేని
వాసుదేవునిచే నది । వ్రయ్య లయ్యెఁ
దునియ లయ్యును బొడి యయ్యెఁ । దొరఁగు ధరణి. 272

క. సర్పముఖశరము గల దను,దర్పంబునఁ గ్రీడిఁ దొడరఁ । [1]దలఁచెదు వారిపెం
పేర్పడఁగ నదియ కా దట, తీర్పవలయువాని నెల్లఁ । దీర్చునరునకై. 273

వ. అని పలికి ధృతరాష్ట్రునితో ని ట్లనియె. 274

క. జ్ఞాతులు దమలోఁ బొందినఁ, జేతోమోదమున [2]వెలిఁగి । చెలువొందుదు ర
న్నాతిం బాసిన విగతపు, భూతిం గడకొఅవులట్లు । పొగయుదు రధిపా.

వ. కావునఁ దమలో విరోధం బొప్పదు సంభాషణసహభోజనాదిసత్కారంబులను సవినయవర్తనంబులను బ్రీతు లైనజ్ఞాతు లిహపరార్థసాధకు లగుదు రని చెప్పి వెండియు. 276

క. విను మే నొకశైలమునకు, మును భూసురవర్గసహితక్రముగ నొకపనికిం
జనునెడఁ జన రానితటం,బున నొకజు న్నుండె దానిఁ । బొగడిరి తద్జ్ఞుల్. 277

తే. దీని తేనియఁ ద్రావినమానవులకు
జరయు రుజయును దప్పియుఁ । జావుఁ గలుగ
దనఁగఁ గొందఱు బోయలు । విని కడంగి
యుఱక [3]మొఱకు లై చఱిఁ బడ । నుఱికి రపుడు. 278

వ. ఇట్లుఱికి మృతిం బొంది రట్లపోలె నవినీతు లైననీకొడుకులు పుడమి యెల్లను దార యేలుటీపుఁ జూచెదరు గాని తమపాలిసిపోవుటం గానరు వీర లర్జును తోడం బెనంగి మానప్రాణంబులు దక్కించుకొనువారె యట్లుం గాక సమబలు లైననుం గయ్యంబునఁగదా వీ రొదురు వా రొదు రనవచ్చు నది యేలనీలోనికి ధర్మనందనుం దెచ్చికొనుటయ నీకుఁ గర్తవ్యం బనిన బాహ్లికుండుధార్తరాష్ట్రుని కిట్లనియె. 279

క. కను బ్రమసిన తెరువరి తన, కనపాయం బైనమార్గ । మరసి తగ నెఱిం
గినవారు సెప్పఁగాఁ గై,కొనని కరణిఁ దగినవెంటకుం జొర వకటా. 280

వ. అనిన వైచిత్రవీర్యుండు దుర్యోధనున కి ట్లనియె. 281

1. క. దలఁచెదు. 2. క. గ. బెరిఁగి. 3. క. మొఱకులై చఱిలోని కుఱికి; గ. మొఱకులై యూపుచఱి నుఱికి; మొఱకు లై చఱి నుఱికి.

మ. కొడుకా యే నెటు లట్లు బాహ్లికుఁడు నీకుం గూర్చు భీష్ముండు నీ
యెడ సస్నేహుఁడు వీరిమాట విను మే § మీముప్వురున్ మన్ననల్
వడయంగా దగునట్టివారము నినుం § బ్రార్థించెదన్ ధర్మజున్
విడువంగాఁ దగ దిమ్ముల వారలకు నుర్విం బాలు నెమ్మిం దగన్. 282

క. అనినను వెండియు నొడఁబా,టునకుం జొరనిదానికిం గో § పముతోడఁ గడుం
గినిసి ధరణీశ్వరుం డి,ట్లనుఁ గొలువున నున్నవార § లందఱు వినఁగన్. 283

తే. [1]బవరములు గావె వెఱగిన § బార సాఁప, వచ్చునే యొక్కరుండ వి § వ్వచ్చుఁ డడరి
పసులఁ [2]బెట్టించునపుడు నీ § బలము వెఱుగఁ దయ్యెనే నీవుఁ గర్ణుండు § నచట లేరె.

వ. అని రాధేయుదిక్కు మొగం బై మఱియు ని ట్లనియె. 285

ఆ. నాఁటికోలెఁ దిగాదు § నారాయణుఁడు నొగ, లెక్కఁ గెలన భీముఁ § డేచి నడవ
ననుజతనుజసహితుఁ § డై వచ్చువివ్వచ్చు, మార్కొనంగ వశమె § మనకుఁ గర్ణ.

చ. బలమును దర్పముం మెఱయ § బంటుతనంబున నీవు పాండవే
యుల నని మార్కొనం గడఁగు § టొప్పెడు [3]తెం పగుఁ జచ్చి శుద్ధుఁ డై
పలుకులు మాన్పు భృత్యుఁ డను § [4]పాటి దలంచెద విట్లు మేలె య
చ్చలమున నీసుయోధనుని § చావున కోర్చుట గాదె యింతయున్. 287

వ. అనిన విని కానీనుండు సంక్షుభితమానసుం డై యిది యెల్ల ని ట్లయ్యె నిట్లుం
గాక [5]తక్కినయది యట్లుండె నదీసూనుండు నన్ను [6]నిరాకరించి పలికినపలు
కులఫలం బనుభవించుఁగాక యని యతని నుద్దేశించి యిట్లనియె. 288

కర్ణుఁడు భీష్మునిపై రోషముచేత నస్త్రసన్న్యాసంబు చేయుట.

తే. నీకు నాలావుతోడ్పాటు § లేక యుండ, వలయు నీ తెగునంతకుఁ § గలననిలువ
నాయుధంబులు విడిచితి § నంతమీఁద, మెఱసి బలవిక్రమంబులు § నెఱపువాఁడ.

వ. అని శస్త్రసన్న్యాసంబు సేసి కొలువున నిలువ నొల్లక దిగ్గన లేచి పోయెనట్టియెడ
శాంతనవుండు నవ్వుచు దుర్యోధనునితో ని ట్లనియె. 290

క. అంతకుఁ జాలఁడె కర్ణుం, డింతకు మును బాస యిచ్చి § యెన్నఁడు బొంకం
డింతటిమానిసి యలిగినఁ, గౌంతేయుల కెట్లు బ్రదుకఁ § గా వచ్చు ననిన్. 291

క. అని వెండియు నిట్లను నా,తనిమాటల కెట్లుఁ గడఁగి § ధర్మతనయుతో
నని సేయక తక్కవు నీ, వనుమానము వాయఁ జూడు § మతనిని నన్నున్. 292

వ. ఏను బాహ్లికద్రోణ ప్రముఖులు గనుంగొనుచుండఁ బ్రతివీరుల ననేకసహస్రంబుల
సమయించెదఁ బిదప రాధేయురణంబునుం జూచెదవు గాక యనిన విని
దుర్యోధనుండు కర్ణపక్షపాతియు నవినీతుండును నగుటం జేసి సహింపక పితా
మహుతో ని ట్లనియె. 293

---

1. గ. బరవసము గాదె. 2. జ. బట్టించు. 3. ఖ. తెంపున. 4. గ. జ. పాడి. 5. గ. జ. తక్కిన నప్పటికి నది యట్లుండె. 6. గ. ఘ. నిరాకరించినఫలం.

చ. ఎఱిఁగియెఱింగి యొండె మది నేది యెఱుంగక యొండె నెప్డు నం
దఱు వినఁ బాండునందనులు దప్పితు లై యని గెల్తు రండ్రు ముం
దఱ నిను బాహ్లికుణ్ గురునిఁ దక్కటివారిని నమ్మి యేను నే
ర్తెఱ నని సేయఁ బూనితిఁ గర్ణుఁడిందమగంటిమితోడు సాలదే. 294

ఉ. కర్ణుఁడు దుస్ససేనుఁడును గల్గఁగ నా కొరు లేల సద్భటా
కీర్ణవిరోధిసైన్యముల గెల్వఁగఁ జాలుదు మేమ మాకు నీ
యర్ణవవేష్టితక్షితి యనర్గళవిక్రమ మొప్ప దక్కు మా
నిర్ణయ మెల్లఁ నిట్టి [1]దవిశనీతియొ నీతియొ చూడుమీ [2]తుదిన్. 295

క. అనుపలుకులకు విషాదము, దనుకఁగ ధృతరాష్ట్రవిభుఁడు దననందను నే
మనియుం బలుకఁగఁ జాలక, వెనుఁబాటున నిట్టు లనియె విదురునితోడన్.

తే. మృత్యుపాశోపహతుఁ డయ్యె [3]మీఁదు లేక
సూతనందనుతోఁ గూడి నాతనూజుఁ
డకట నాశంబుఁ బొందువాఁ డయ్యె మనకు
నింకఁ జేయంగ నగుపని యెద్ది చెపుమ. 297

వ. అనిన విని విదురుం డతని కిట్లను మనవారలు మున్న దుర్బలులు తమలోనం బెనుంకువ లయి విరసవచనంబు లాడుచు నింతలు పుట్టించుట యది యర్జునకుఁ గార్యం బింతియ కాక యే మనువారము వారలు బంధుమిత్త్రసహాయులుం దారును నొక్కతలంపువార లయి యున్నవారు వలవనియీవెంగలిమాటలు విడిచి పాండవులం బిలువం బనిచి తగవు నడపుట దక్క మనకుఁ జేయందగుపని వేఱొండు గలుగునే యని చెప్పిన ధృతరాష్ట్రుండు సంజయుచెప్పినకార్యవచనం బులకొఱంత వినంగలవాఁడై యతనిదిక్కు మొగంబు సేసి. 298

క. మును వరుసతోడఁ దనతలఁ, చినయన్నియు నీవు వినఁగఁ జెప్పి తగవుమై
నిను వీడుకొల్పునెడ నర్జునుఁడే మని నిశ్చయించెఁ జూతము చెపుమా. 299

క. అని యడిగిన సంజయుఁ డి, ట్లనుఁ దుదిఁ బార్థుండు నిశ్చయము సేసి సుయో
ధనుతో నిందలిపెద్దలు, వినఁగా నను మన్నపలుకు వినుము నరేంద్రా. 300

మ. కురువంశోత్తముఁ డైనధర్మజుఁడు నాకనుం దంష్ట్రిపా లీ దగున్
ధరలో సా మని తాన పల్క వినియుఁ దర్పంబుమై నీక త
క్కిరయేనిం జటులాస్మదీయవిశిఖాగ్నిజ్వాలలం దాహుతుల్
వరుసం బెట్టుదు ధార్తరాష్ట్రతతి నైశ్వర్యం బవార్యంబుగన్. 301

వ. అని పలికి కౌఁగిలించికొని భూషణాంబరాదికమనీయవస్తువు లొసంగిన నేనునుం బాండవులను వాసుదేవుని సవినయంబున వీడ్కొని యింతవట్టును దేవరకు నెఱింగింప వేగంబ వచ్చితి ననిన నమ్మాటలు దుర్యోధనుం డాదరింపక పెడచెవులం బెట్టి

1. ద. యనీతియొ. 2. తఱిన్. 3. 'మీఁ దెఱుఁగక' అని యొకప్రతి.

ధృతరాష్ట్రుండును జెచ్చవడి యూరకుండె నప్పు డయ్యిరువురపాలను సంజయుం
డొక్కరుండు దక్క నయ్యాస్థానంబున నున్నసమస్తజనంబులును దిగ్గన లేచి
తమతమనివాసంబులకుం బోయిరి. తదనంతరంబ. 302

క. తనుజవశవర్తి యగున, మ్మనుజేంద్రుఁడు దనసుతుఁడు మద్రిపుఁడుగ నో
పునొ యని పాండుతనూజుల, ననుమతి సంజయునితోడ నాడె దురాశన్. 303

సీ. ఈరెండు[1]పిళులతారతమ్యంబులు, నెఱుఁగుదు పోసైన నెవ్వరో త్త
రిది నిశ్చయింతమే యెందునుపాయంబుఁ, బౌరుషంబును గలవారు గలరు
నూతము చెప్పుమన్న సూతనందనుఁడు న, న్నడిగెద నేనొంటి యడుగవలదు
మీయయ్య సాత్యవతేయుఁ డీయెడకు వేం, చేయునట్లుగ భక్తిఁ జేసితలఁపు
తే. పిలువఁ బంపు గాంధారి వారలు వినీతి, రతులు నిశ్చయవిదులు ధర్మజ్ఞచిత్తు
లుల్లమున నీకసూయాదు లొదవనేని, [2]వాని మాన్పంగ నేర్తురు మానవేంద్ర.

— ♦ కృష్ణద్వైపాయనుఁడు ధృతరాష్ట్రునియొద్దకు వచ్చుట ♦ —

వ. అనిన విని యంబికానందనుం డట్ల కాక యని యొకకంచుకిం బిలిచి వానిం బుచ్చి గాంధారిం రావించి సద్భక్తితాత్పర్యంబునఁ గృష్ణద్వైపాయనమహామునిం దలంచిన దివ్యబోధమహనీయుం డైనయమ్మహాత్ముండు విజయంచేయుటయు నందఱు దండప్రణామంబులు సేసి సమున్నతాసనంబున నునిచి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యున్నసమయంబున ధృతరాష్ట్రుండు విన్నపంబు సేయక మున్న యమ్మహాపురుషుండు ధృతరాష్ట్రసంజయులచిత్తవృత్తులు దాన యెఱింగినవాఁ డగుటం జేసి సంజయువలనఁ బ్రసన్నదృష్టి నవలోకించి యతని కిట్లనియె. 305

క. నీవు సమస్తము నెఱుఁగుదు, గావున నీ కూర కుండఁగాఁ దగదు ధరి
త్రీవల్లభుఁ డడిగినపని, యీవిధ మని తెలియఁ బలుకు మేను వినంగన్. 306

వ. అనినఁ బ్రసాదం బని సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 307

క. ఆసేనకు నీసేనకు, వాసి యడిగె దీవు నన్ను వసుదేవసుతుం
డాసేనఁ గలఁడు తత్సము, నీసేనం జూపుమా నరేశ్వర నాకున్. 308

వ. వాసుదేవుం డెట్టివాఁడని యడిగెదేనిం జెప్పెద. 309

చ. జగముల నన్నిటిం దనవశంబుగఁ జేసినవీరు భంగమున్
బగయు లలాటలోచనుఁడు [3]వాపఁగఁ [4]బేర్చినయట్టిబాణు నో
క్కగడియలోన గర్వ మడఁగం బరిమార్చె సురేంద్రకల్పకం
బు గరము లీలఁ దెచ్చె హరిభూరిపరాక్రమ మప్రసిద్ధమే. 310

ఆ. అధికదుష్కరంబు లైనకార్యంబులు, క్రీడవోలెఁ జేయుఁ గేశవుండు
విను మతండు పార్థు నెనసి [5]యేకార్థుఁ డై, యుండుఁ బూర్వభవసఖుండుగాన.

వ. అట్టివాసుదేవునిచక్రంబు నిజమాయాబలంబునఁ బాండవుల సర్వసమరసాధనం

1. క. పీళ్లుల. 2. జ. పూని. 3. జ. ప్రాపుగ. 4. క. పేర్చిన. 5. క. గ. జ. యేకాత్ముఁడై.

బులయందును సూక్ష్మరూప[1]వ్యాపి యై నిలిచి వారికి విజయం బొసంగు చుండు
నని చెప్పి మఱియు నిట్లనియె. 312

క. పలుమఱుఁ బాండుతనూజుల, కొలఁది వితర్కించెదవు నిగూఢం బదియుం
దెలియం బలికెద వారికి, బలమును సత్త్వంబు హరియ పార్థివముఖ్యా. 313

వ. హరిమహత్త్వంబు విన్నవించెద నవధరింపుము. 314

క. ఒకతల సమస్తజగములు, నొకఁడ జనార్దనుఁడు నిలిచి యొకతల యైనన్
సకలము నసార మాతం, డొకరునిసారంబ చాల నుత్కృష్ట మగున్. 315

క. తలఁపునన వాసుదేవుఁడు, గలిగింపను నిలుప నడఁపఁగా నోపు జగం
బుల మఱియును గ్రీడార్థము, పలువోకలఁ బుచ్చు చుండుఁ గౌరవనాథా. 316

క. ఎక్కడ నడచును సత్యం, బెక్కడ ధర్మంబు వరఁగు నెక్కడఁ గలుగుం
జక్కటి నిలుచుం గృష్ణుం, డక్కడ నతఁ డున్నకడన యగు జయమధిపా. 317

సీ. పురుషోత్తముం డెల్లభువనంబులును దాన, యఖిలభూతాత్మకుం డై విహార
లీల విచేష్టించు నీలోకముల మాయ, దొట్టి యొక్కొక్కమరి పుట్టి పెరిగి
కర్మానుచరణముల్ గైకొని వర్తించు, శిష్టరక్షణమును దుష్టనిగ్ర
హంబును దనపను లగుటఁ బాండవుల నెపం బిడుకొని ధర్మబాహ్యులైన

తే. నీతనూజుల నిక్కమ నిగ్రహింపఁ, దలఁచినాఁ డమ్మహాత్ముండు తథ్యమతని
నిట్టిచందంబువాఁ డని యెఱిఁగి యెవ్వ, రాశ్రయింతురు బ్రదుకుదు రట్టివారు.

క. అనవుఁడు ధృతరాష్ట్రుఁడు విష్ణుని నే నెఱుఁగనివిధంబునం దెలియఁగ నీ
కని యున్న తెఱఁగుఁ జెప్పుము, యనుటయు సూతసుతుఁ డిట్టులను నాతనితోన్.

వ. విద్యయు నవిద్యయు ననఁగా రెండు గల వవిద్యాదూషితుం డై తమోగ్రస్తుం
డైనవాఁడు విష్ణు నెఱుంగఁడు విద్యాసంపన్నుం డెఱుంగు ననిన విద్య యనునది
యెట్టిది యెద్దాన నీ వాసర్వేశ్వరు నెఱింగితి దాని నవిద్య యెట్టిది దానిని జెప్పు
మనుటయు నాంబికేయునకు సంజయుం డిట్లనియె సాత్త్విక రాజస తామస
వికారంబుల త్రిప్పులం బడక ధర్మం బాచరించుచు భావశుద్ధి గలిగి యుండుదు
దీన నే నచ్యుతు నెఱుంగుదు విద్య యిట్టిది నీకునుం దక్కొవ్వరి కైనను నతని
నెఱుంగుటకు నిదియ తెరు విట్టిది గానివిధం బవిద్య యని చెప్పిన నతండు నిజ
నందనుని కిట్లనియె. 320

క. మన కాప్తుఁడు సంజయుఁ డీ, తనియుపదేశంబు వట్టి ధర్మమున ముకుం
దుని నాశ్రయింపవయ్య యతనిఁ జొచ్చిన బ్రదుకు దీవుఁ దమ్ములు సుతులున్.

చ. అనిన సుయోధనుండు దమ్మయయ్యకు నిట్లను నిజ్జగంబు ల
న్నిని నొకపెట్ట మ్రింగినను నెట్టన సర్వము[2]గాచె నేనియు.
న్వినుము ముకుందుఁ డర్జునుని నెచ్చెలి నాఁ జెవు లార వించు నిం

1. త. వ్యాపిష్టై. 2. క. గ్రాఁగె నేనియుం; గ్రాచె నేనియుం,

కనతని నొక్క[1]బాముసకుం గా కృతిచెందక నాశ్రయింతువే. 322

తే. అనిన గాంధారి కిట్లను నజ్ఞవిభుండు, సతిసుతాజుఁడు దుర్మతి నతిబాహ్యుఁ
డుద్ధతుం డీసు[2]మాని నాబుద్ధి వినఁడు, వీఁడు నెఱుఁగాని బ్రమసెఁ గావేఁడుకొనుమ్మ.

ఉ. నావుడుఁ దల్లి యిట్టు లను నందనుతో నిది యేల యీయుర్వర్
శ్రీవిభవంబులన్ మను నశేషసుహృజ్జనులం దొఱంగఁగా
నీవు గడంగె దిట్టియవినీతులునుం గలరే వృకోదరుం
డైవిధి సంపఁగా నొరులకుం గాఁగఁగ వచ్చునె యింకఁ బుత్రకా. 324

వ. అనియె నట్టియెడం గృష్ణద్వైపాయనుండు ధృతరాష్ట్రున కిట్లనుఁ గృష్ణుండు నీకుం గూర్చు నీవుం బరమాప్తుండ వైనసంజయు నతనిపాలికిం బుచ్చి తది లెస్స కార్యం బయ్యె వీఁడును నమ్మహానుభావుమహనీయప్రభావం బున్నరూపెఱుంగు వీనిబుద్ధి విని యద్దేవు నాశ్రయింపు మతం డేకాగ్రచిత్తులై యారాధించిన వారికిఁ జేరువ యగుఁ గామక్రోధోపహతులై తమతమధనంబులం దృప్తులు గాక యన్యాయంబున వర్తించువారలకు దూరం బై యుండు నెల్లభంగుల నాతనిం జొచ్చి బ్రదుకు మనినం బ్రసాదం బట్ల చేయుమనని విచిత్రవీర్యనందనుండు సూతనందనునితో నవ్వాసుదేవనామనిర్వచనంబు నాకుఁ దేటపడం దెలిపి యతనిం బొందునుపాయం బుపదేశింపవే యని యడిగిన. 325

తే. ఎల్లయందును దా వసియించు నెల్ల
యదియుఁ దనయందు వసియించు నట్టి వాసు
దేవుఁ డనుపేరి కర్థంబు దెల్ల మింత
యెఱుఁగుజనులందుఁ దగ వసియించు శుభము. 325

తే. అతనిఁ బొందునుపాయం బనంతరంగ, నిగ్రహము గాఁగనార్యులనుగ్రహింతు
రోపి చిత్తవికారంబు లుడిపి యేక, బుద్ధిఁ గొలువఁ బ్రసన్నతఁ బొందు నతఁడు.

వ. నీవును బలుబుద్ధు లుడిగి గోవిందు నాశ్రయింపు మనినం బ్రజ్ఞాచక్షుం డిట్లనియె.

క. నాకు నయనేంద్రియముగతి, లే కుండుట కంతవగవు లే దఖిలమనో
జ్ఞాకారుఁ డైనహరి న్నాలోకింపం గానమికిఁ గలుగు వగ పెపుడున్. 329

ఉ. ఆతనిఁ గన్ను లారఁగ నహర్నిశముం గనుఁగొంచు నుండువా
రేతప మాచరించిరో యుపేంద్రుని నాశ్రితవత్సలున్ విని
ర్ధూతకలంకు ధర్మనిరతుం గరుణాకరు సర్వలోకవి
ఖ్యాతుఁ బవిత్రమూర్తి శరణాగతరక్షకు నాశ్రయించెదన్. 330

వ. అని పలికి పరమశాంతుం డై పారాశర్యు నుద్దేశించి దేవా యేను వాసుదేవుని [3]శరణు సొచ్చి బ్రదుకువాఁడ ననుచుఁ గృతాంజలి యగుటయు వ్యాసమహా మునియు నాశీర్వాదంబు సేసి యంతర్హితుం డయ్యెఁ గౌరవేశ్వరుండును దుర్యో

1. క. జ. జాముసకుఁ. 2. క. మానఁడు, 3. క. మఱువు.

ధనసంజయుల నిజనివాసంబులకుం బోవం బనిచి తానును గాంధారియు నభ్యం
తర మందిరంబున కరిగి యుచితవ్యాపారంబులం బ్రవర్తిల్లుచు నుండె నని
చెప్పిన విని పదంపడి పుట్టినవిశేషంబు లెట్టి వని యడిగిన. 331

శా. నిత్యానిత్యవివేకవైభవసముత్పన్నిద్రాంతరంగస్ఫుట
ప్రత్యాఖ్యా పరమేశ విశ్వజగదారాధ్యా మహానంతచి
త్సత్యానందవిభుస్వభావమహితా [1]సంవిత్సమాధానదా
[2]గ్గత్యవ్యాహృతిసంప్రవర్తనవిదగ్ధశ్రీపదాంభోరుహా.

క. వ్యాసాదిమునిప్రోక్తమహాసందర్భాప్రమేయతారూఢగుణో
ల్లాసా నైర్గుణ్యాసముదాభాసి[3]రహస్యానుభావ భక్తాధీనా. 333

మాలిని. నమదనిమిషచూడారత్నవ్యరత్నప్రభాసం
గమరుచిరపదాబ్జా గర్వదుర్వారదైత్యో
ద్యమబహుళతమోమార్తాండదోఃక్రీడనప్ర
క్రమ లలిత[4]వికాసా గాఢభక్తిప్రకాశా. 334

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబునయుద్యోగపర్వంబునందు
ద్వితీయాశ్వాసము. 335



1. గ. సంపత్స 2. గ. చ. జ. గ్గత్యావ్యా. 3. క. గ. తహాస్యా. 4. గ. విలాసా.

శ్రీ

హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగ పర్వము, తృతీయాశ్వాసము



వాగ్విభవారోగ్య
ప్రావీణ్యప్రాభవానుభావ[1]మహితసా
ఖ్యావహపదస్మరణ కరు
ణావాసకటాక్షకిరణ హరిహరనాథా. 1

### —శ్రీకృష్ణుని రాయబారము—

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. సంజయుఁడు దన్ను వీడ్కొని చనిన ధర్మ
సుతుఁడు మఱునాఁడు దమ్ములఁ సుతుల నిష్ట
భృత్యవరులను దొరలను బిలువఁ బనిచి
యెల్లవారును విను చుండ నిట్టు లనియె. 3

క. మనము జనార్దనుపాలికిఁ, జని కౌరవసభకు నతనిఁ జను మని ప్రార్థిం
చిన మేలు బంధుహితగురు,జనములతో రణము గాక సంప్రీతి యగున్. 4

వ. అని పలికి వార లందఱు బలసి చనుదేర మాధవుమందిరంబున కరిగి యతని చేత సత్కృతుం డయి సమస్తపరిజనంబులుం బరివేష్టింప నొక్క పార్శ్వంబునం బాంచాలియు సముచితపరివారపరివృత యై యుండ నతండునుం [2]దానును సుఖాసీనుండై యుండి యతనితో నిట్లనియె. 5

క॰ ఆపదఁ గడవం బెట్టఁగ, నోపి శుభం బైనదాని నొడఁగూర్పను మా
కీపుట్టువునకుఁ బాండు,క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా. 6

తే. సమయ మిది మిత్త్రకార్యంబు చక్కఁ జేయ, నీకతంబున నే మవిశంకితుఁడైన
యాసుయోధనుతోడిపోరాటదక్కి, యనుభవింతుము మాయంశమగుధరిత్రి. 7

వ. నీకు మేము ప్రద్యుమ్నాది కుమారులతోడి వారము మమ్ము దురితంబులు పొరయ కుండ నరసి రక్షింపు మనవుడు వాసుదేవుండు నీపంచినయట్ల చేయంగలవాఁడ

1. గ. మహిమ. 2. గ. జ. దారును సుఖాసీను లై.

నెయ్యది తలంపు సెప్పు మనిన నజాతశత్రుండు నీవు కరినగరంబున కరిగి కౌరవులతోడం దగినమాట లాడి తెఱంగు సేయ వలయు నని ప్రార్థించి యతని నియ్యకొలిపి యి ట్లనియె. 8

సీ. మాతండ్రితలఁపును ♦ నాతనినందను,చందంబు నిన్ను యా♦సంజయుండు
పలికినపలుకులఁ ♦ దెలిసెఁగదా నీకు, వారిచిత్తముభంగి ♦ వారి తెఱంగుఁ
బొలుపం పని యాక ♦ [1]యేలిమాటలన మ,మ్ములుక దీర్చెదరుతా♦రధికదుష్క
రంబైనయాసమ♦యం బేము పదుమూఁడు,వత్సరంబులు సల్పి ♦ వచ్చియుండఁ
ఆ. గులముపాడి నడపఁ ♦ దలఁపఁడ పతి సెడఁ, దలఁచెనేనిఁ గొడుకు ♦ వలచినట్టి
వాఁడు గాన యతని♦వక్రత మాన్ప లేఁ, డింతకంటెఁ గలదె ♦ యెడరు మాకు.
క. జననియు సమస్తబాంధవ,జనములుఁ బ్రియ మంద వారి ♦ శాంతులఁగాఁ జే
యను నెమ్మిగ నొక్కటియై, మననుం దెఱఁ గేది యునికి ♦ మాపౌరుషమే. 10
క. ఇచ్చటిబంధులు నీవును, నచ్చెరువడి వినుచు నుండ ♦ నయిదూళ్లను మా
కిచ్చిననుఁ జాలు నంటిని, బ్రొచ్చెము గా దింతవట్టు ♦ పూర్ణముసుమ్మీ. 11
శా. ఆదుర్యోధనుఁ డంతమాత్రయును జేయం జాలఁడో కాని పెం
పేదం గ్రూరత కోర్వ రాదు సిరి నా ♦ కే లందునే గ్రాసవా
సోదైన్యంబులు వచ్చు నా యరయునీ ♦ చుట్టాలకుం గావునన్
మోదం బందుట గల్గు గౌరవులు నెయ్యముం బొంది శ్రీనొందినన్. 12
ఉ. అక్కట లాఁతు లైనఁ బగ ♦ లైనను జంపన కోర నేల యొం
డొక్క తెఱంగు లేదె యది ♦ యొప్పదె బంధుసుహృజ్జనంబు లా
దిక్కున నున్నవారు గణుతింపక సంపదకై వధించి దూ
టెక్కుట దోష మందు టను♦నీదురవస్థల కోర్వ వచ్చునే. 13
వ. అని పలికి పాండవాగ్రజుండు వెండియు. 14
ఆ. క్షత్త్రధర్మ మింత♦కష్ట మగునె పెఱ,ధర్మమాచరింపఁ ♦ దగద యండ్రు
గాన శస్త్రజీవి♦కయ తగియున్నది, యైన వంశనాశ ♦ మనభిమతము. 15
వ అదియునుం గాక. 16
ఆ. కలహ మగుట లక్ష్మిఁ ♦ [2]గావించుఁ బ్రాణహా,నియును జేయునింత♦నిక్కువంబు
పలువు రొకని గోడి ♦ పాఱుట బల్లిదు, లనదచేతఁ జెడుట♦యును ఘటించు. 17
క. జయమగు నోడుదు మనుని,శ్చయ మొక్కఁడు లేదు వినుము ♦ సమరమునఁ బరా
జయము మరణంబుకంటె హృ,దయపుటభేదనము సేయుఁ ♦ దథ్యం బనఘా. 18
క. కాన యవశ్యముఁ బెనఁకువ, గానియుపాయమునఁ బగఱ♦ గడ తేర్చుధృతిం
బూని నడచు నెవ్వఁడు డెం,దానం జెయి వెట్టికొని య♦తఁడు నిద్రించున్. 19
ఆ. పగయ కలిగెనేనిఁ ♦ బా మున్న యింటిలో, నున్నయట్లు కాక ♦ యూఱడిల్లి

1. గ. వేలిమాటలన. 2. క. గారించు.

యుండు నెట్లు చిత్త ✽ మొకమాటుఁ గావున, వలవ దధికదీర్ఘ✽సైన్యవృత్తి. 20

చ. పగ యడఁగించు టెంతయు శుభ✽ఘం బది లెస్స యడంగునే పగం
బగ వగ గొన్న మాన్కొనక ✽ పల్కక యుండఁగ వచ్చునే కడుం
దెగ మొద లెత్తి పోవఁ బగ ✽ దీర్పఁగ వచ్చునఁ గ్రొవ్వి మొందు నే
మిగతిఁ దలంచినం బగకు ✽ మేలిమి [1]లేమి ధ్రువంబు కేశవా. 21

ఉ. కావున శాంతిఁ బొందుటయ ✽ కర్జము దా నది యట్లు లుండె శ్రీ
గావలె నంచుఁ బోరితము ✽ గామియుఁ గోరెద మెల్ల సొమ్ములుం
బోవుటయుం గులక్షయము ✽ వుట్టుటయుఁ వెలి గాఁగ నొందుమై
నేవిధి నైనఁ జక్కఁబడు ✽ టెంతయు నొప్పఁజుమీ జనార్దనా. 22

చ. మనమునఁ బక్షపాతగతి ✽ మాదెస మానుము ధర్మనీతివ
ర్తనముల రెండుదిక్కుల హిత✽తంబును జెప్పను గల్గునట్టిచొ
ప్పున విదురాదిసజ్జనుల✽బుద్ధికి రా నుచితంబుతోడిమె
ల్పునఁ బరుసందనంబునను ✽ భూపతు లెల్ల నెఱుంగ నాడుమీ. 23

చ. [2]తగవునఁ బోక రాజు జెడి✽దంబులు వల్కనయేని సైఁచి యో
ప్పుగ నిలుమీ గురుత్వముఁ బ్ర✽భుత్వమునుం గలపెద్దవారిమా
ట గొనమి యాసుయోధనుక✽డఁ నిలువఁ మన మెల్ల గారవం
బుగఁ గురువృద్ధుపల్కుఁ దలఁ✽పుం జన నిచ్చిన మెచ్చరే జనుల్. 24

మ. సుతువాఁ డై వినయంబు సేకొనక యే✽చొప్పం దగం [3]జెప్ప కా
ధృతరాష్ట్రుం డవినీతిఁ జేసినను [4]సం✽ధింపంగ రా దంచు వే
గ తెగం బాఱకు తెంపు సేయునెడ లో✽కం బెల్ల మెచ్చుం బ్రకా
శితధర్మస్థితి నొంది మామనము నిశ్చి✽ంతంబుగాఁ జేయుమీ. 25

ఆ. ఇన్నిసంకటముల ✽ నిబ్బంగి నెంతయు, నొగులుచి త్తవృత్తి✽నొప్పు దీర్ప
వెజ్జ నీవ కావె ✽ వేయేల యేగతి, నడపఁ దలఁచి తదియ✽నాకుఁ బ్రియము. 26

వ. అని చెప్పి తలంచుకొని వెండియు ని ట్లనియె. 27

క. నీవు సుయోధనుపాలికిఁ, బోవఁగ వల దనియు నొక్క✽బుద్ధివొడమెడుఁ
గోవింద యతఁడు మంత్రులుఁ, [5]గావరములు చక్క వినరు ✽ కార్యవచనముల్.

తే. కుటిలమతు లవినీతులు ✽ క్రూరకర్ము, లట్టినీచులకడకు ని ✽ న్ననుపఁ జాల
నీవు సంకటపడియెడు✽దేవపదవి, యైన నేనొల్ల నొంటి యం✽దరుగు టుడుగు.

చ. అనవుడుఁ గృష్ణుఁ డి ట్లనియె ✽ నాధృతరాష్ట్రుఁడు నట్టివాఁడ త
త్తనయుఁడ యేల నీపలుకు ✽ తథ్యము నీతలఁపే నెఱింగితి
న్మనమున శంక దక్కుము వి✽శంకఁ వలతె విను మేను నిక్క మ
ల్గిన నచటం గలండె రణ✽కేళికి మార్కొన నొక్కఁడేనియున్. 30

1. గ. లేదు. 2. జ. తగవులఁ, 3. ఖ. జేయ కా. 4. క. సాధింపంగ. 5. క. గావలములు

క. పనుపుము కౌరవసభ కేఁ, జనుఁ డెట్లును మేల యర్థసంసిద్ధి యగున్
మన కొకటం బాపము రా, కునికికిఁ గత మైనపలుకు లాడెను గలుగున్. 31
వ. అని పలికిన యుధిష్ఠిరుం డి ట్లనియె. 32
ఆ. మేలు గాక నీకుఁ బోలిన ట్లయిన నం, దఱిగి యేము వారు నర్థిఁ బొంది
యుండునట్లు గాఁగ నొడఁబాటు గావింపు, మెల్లభంగి మనకు నిదియ లెస్స.
క. మ మ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు, నెమ్మి నెఱుఁగు దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు వా
క్యమ్ములపద్ధతి నెఱుఁగుదు, పొ మ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్. 34

—♦ కృష్ణుఁడు ధర్మరాజుతోఁ గౌరవులదుర్ణయంబు సెప్పుట. ♦—

సీ. అనిన ముకుందుఁ డి ట్లనియె సంజయునిమా,టలును నీ వన్నపల్కులును వింటి
నీమది ధర్మైకనిష్ఠమై నున్నది, వైరంబు విడువరు వారు ద్రోణ
భీష్ములు గల రని బిరుదులై యున్నవా, రగునె రాజన్యుల కడఁగి కుడువ
నక్లేశవృత్తి రాజ్యముచవి గొన్నవా, రేల యిత్తురు నీకుఁ బాలు సెపుమ
తే. ధార్తరాష్ట్రులు సడికి నధర్మమునకు
నలుక రెన్నఁడు విడువు దైన్యంబు పొడవు
కయ్య మరివర్గజయమునఁ గలుగు నిహప
రములుఁ జిరకీర్తియును బాండురాజతనయ. 35
మ. గురుభీష్మాదులు సూచు చుండ సభ మీకుం గీడు నాఁ డట్లు ము
ష్కరులై చేసిరి యంత సేసియును బశ్చాత్తాపముం బొంద రో
పర వా రెన్నఁడు నట్టిచోటఁ గృపయున్ బంధుత్వముం దక్కనె
వ్వరుఁ గోపింపరె యాదురాత్మకులగర్వక్రౌర్యముల్ సూచినన్. 36
వ. కపటపునెత్తంబునెపంబుగా మిమ్ము వెడలనడుచునప్పుడు దుర్యోధనదుశ్శాసనశకుని సూతనందనులు పుయిలోట దక్కి కలకల నవ్వుచుం బలికినపలుకు లుగ్గడింప వచ్చునే వాని విని సమస్తజనంబులు ధృతరాష్ట్రునిందించుచు మీరు బలవంతుల రయి యుండియు సత్యంబు వాటించి యూరక పోక సూచి యచ్చెరువాటుతో నుమ్మలించు చుండిరి తిట్టువాట్లం బోయెడువారు దైవోపహతు లై యున్న చెడి యుండుదురు గావున వారలం జెఱుపనుం జులుకన క్రూరాత్ములగు కౌరవు లెల్ల వారికి వధ్యులుగాఁ దగుదురు నీ కేల యవధ్యులైరి పాపాత్మకు లగుహింసకులం బాముల నెట్లట్ల నిర్విచారంబుగా వధియించుట కర్తవ్యంబు. 37
క. మీతండ్రికి భీష్మునకుం, జేతోముద మొదవ భక్తి సేయన తగు నీ
కాతలకు నేను జని వి,ఖ్యాతంబుగ నీదువినయ మభివర్ణింతున్. 38
క. చెలులుం జుట్టలు దేశం,బులరాజులు వినఁగ నీదుపుణ్యచరిత్రం
బులు నీవు ధర్మమార్గము, దలఁచుటయుం దెలియఁ బలికెదం గురుసభలోన్.
వ. దానికి దుర్యోధనుం డియ్యకొనక తెఱంగు మాలినమాట లాడుటయుఁ దండ్రి

యతని వారింపనేరమికిఁ దోడుకేశకర్షణాదికంబులయుఁ జూచి మీరాతనిఁ బ్రీతిపాత్రునిం
దలంచి యెల్లవారును వారిన గర్వాంతు రింతియ కాక మనకు నొండేమి వలయు
నాయోపినంతయుఁ జెక్కుభంగుల సంధియ కావింపం జూచెద నద్దానంబు
సిద్ధించిన మేలు గాదె యట్లు గాక తక్కిన నవ్వోటియుత్సాహంబునందంబును
నందుఁ జేయం గలవారివర్తనంబులుఁ గొలందులు నెఱింగి నీకు విజయం బగు
విధంబునం జనుదెంచెద. 40

తే. అసురయోధనముక్కునకు § నావి గలుగఁ, బుడమి నీ కేఁడు గావునఁ § బోరు కలుగు
నేను గయ్యపుశకునంబు § లెన్ని యేనిఁ, గంటి నీ వనుత్సాహివి § గాఁగ వలదు.

వ. చతురంగబలంబుల నాయితంబు గావించుచు దొరలం బుచ్చికొల్పికొనుచు నాల
స్యంబు లేక సమరంబునకు సన్నాహంబు సేయు చుండ వలయు నని పలికిన విని
వృకోదరుండు దామోదరున కి ట్లనియె. 42

క. సమరంబు గలుగు ననుచును, మము వెఱపింపంగ వలదు § మాధవ నీ వా
కుమతి యగుధార్తరాష్ట్రుఁడు, శమించుకార్యంబు నడపు § సౌజన్యమునన్. 43

వ. అని వెండియు. 44

శా. పాపాత్ముండు మదాంధుఁ డాతులువ నీకుపం పెట్లునుం జేయఁగా
నోపం డడ్డము సెప్ప రెవ్వరును మాన్యానోద్రేకముఁ గర్వముం
గోపంబుం దనుఁ ద్రిప్ప నాప్తజనులం § గుందించుటం బోయిన
ట్లే పోనిత్తురు గాన ని న్నతఁడు జాలిం బెట్టెడుం జూడుమీ. 45

ఉ. చొచ్చినచోన చొచ్చి తెగఁజూచెద నంచుఁ గడంగు చుండు న
న్మెచ్చఁడు బాహుగర్వమున § నీచు సుయోధనుఁ డట్టివానితోఁ
బొచ్చెము లేక కూడి మనఁ § బోవక పోవఁగ రాదు నాకు వి
వ్వచ్చుఁడు రాచవారుఁ గురువంశముచేటున కోప కుండుటన్. 46

ఉ. పాండవకౌరవుల్ గలసి § పాలును నీరును బోలె నెమ్మిమై
నుండఁగ దుష్టచేష్టల సుయోధనుఁ డింతలు సేసె నాతఁ డొ
క్కండ కులక్షయంబునకుఁ § గారణ మం డ్రది తప్పదైన నీ
వొం డన నేల యాబిరుదు § నోపినయంతయుఁ దీర్పు నేర్పునన్. 47

చ. తన[1]పారిపోవునంతకు సుదగ్రతయుం గపటంబు మాన నే
ర్చునె ధృతరాష్ట్రసూనుఁడు యశశ్శోభరితం బగుభారతాన్వయం
బున కొకనింద వచ్చు ననుబుద్ధి దురాత్మున కేల కల్గు నా
యనమెయిఁ బోయి హీనగతి § నైన ఘటించిన [2]నెంత యొప్పునో. 48

వ. మాకును వారికిఁ బితామహుం డగుభీష్ముండు విను చుండ సుయోధనుతోడం
గురుకులేశ్వరునాస్థానంబున నావచనంబులుగా ని ట్లనుము. 49

1. గ. పారిపోవు. 2. గ. యంత యొప్పునే

తే. అన్నదమ్ములమైయుండి యకటమనల, నొరులుదలయెత్తిచూడ నొండొరులతోడ
బెనఁగ నేటికి నీ నేల పెద్దవారి,బుద్ధి విని పంచి కుడుచుట పోలదొక్కొ. 50

క. అని యెవ్విధమున నైనను, వనజోదర సంధి సేయ వలయుం దగ నే
మును వారును గలయుట భూ,జనులకు నెల్లను హితంబు సౌఖ్యకరంబున్.

చ. అనుటయుఁ బిన్ననవ్వు నగి యంబుజనాభుఁడు వల్కె నెన్నఁడున్
విననివి భీముపాలఁ గడు వింతలు వింటిమి మాట లగ్గిస
ల్లనగుట భూరిభూధరము లాఘవ మొందుట గాదె యివ్విధం
బున నితఁ డిప్డు మార్దవముఁ బొందుట యింకిట సెప్ప నేటికిన్. 52

—♦ శ్రీకృష్ణుఁడు భీమసేనునిఁ గౌరవులతోడియుద్ధమునకుఁ బురికొల్పుట. ♦—

తే. అని సహోదరు లాజి నా యాసపడుట
కోర్వమియుఁ గౌరవులఁ జంప నొల్లమియును
గలుగునెయ్యంబు పెంపునఁ గరుణ నార్ద్రుఁ
డైనపవనజుఁ బురికొల్ప నాత్మఁ దలఁచి. 53

వ. మురమర్దనుం డతనితో ని ట్లనియె. 54

ఉ. యుద్ధమువీఁదివేడ్కయు మహోగ్రవిరోధుల నల్కఁ జేయుద
రోద్ధతియున్ సుయోధనునియున్నతి సైఁపనియేపురాజ్యసం
సిద్ధి నిజాగ్రజన్మునకుఁ జేయుతలంపును గల్గునీ వసం
బద్ధములైనవాక్యములు వల్కుట యొప్పునె కీచకాంతకా. 55

వ. అని యంత నిలువక. 56

క. వెఱ పెట్టిదియో యెన్నఁడు, నెఱుఁగనినీయట్టివాని కెవ్వరొకో యీ
పిఱికితన మింత యలవడఁ, గఱపినవా రనుచు శౌరి కలకల నవ్వెన్. 57

వ. దానికి దరహసితవదనుం డగుచు భీమసేనుండు వసుదేవసూనున కి ట్లనియె. 58

ఉ. బంటుతనంబుమాటలకుఁ బాఱకు పాండునృపాలుపాలుగై
కొంటయ చాలు నన్న నృపకుంజరుపల్కుల కడ్డ మాడ రా
కుంట యెఱుంగవే మును సుయోధనుచందముఁ జూపి యప్పు డే
మంటి యుపేంద్ర న న్నని రణాగ్రమునన్ నిను మూదలించెదన్. 59

క. నాకొలఁది విచారింపక, నీ కిట్లనఁ దగునె మిన్ను నేలయు నిమ్మైఁ
గాక తిరుగంగఁబడినం, బో కే ముంజేతు లొడ్డి పోవఁగ ద్రోతున్. 60

ఉ. నావుడు నవ్వుటాల కనిశం బవనాత్మజ యింత యేటికిం
గేవలయోధవె పరులకిల్బిషముల్ దలపోయ కిమ్మెయిన్
జావడ మైనఁ జూచి యిది చందము గా దని యంటిఁ గాక నీ
చేవయు లావు నీవు మును చేసినభంగులు నే నెఱుంగనే. 61

వ. అని చెప్పి మాధవుండు మఱియును. 62

ఉ. పార్థుఁడు పోరఁ దేవగణపం దనకుం దనుఁ గోరి యొంతయుం
బ్రార్థన సేసె దాని కనుభాగము నొందెడి నేను గాన యు
ద్ధార్థుల మైనమాకు నిను నాసపడం దగదే యశంబు సా
నార్థములుం బిరోధివిపదాయంబునఁ దక్కఁగ[1] నొంటఁ గల్గునే. 63

వ. అనవుడు. 64

శా. ఏమీ పార్థుఁడు నీవు దండిమగలై యీవచ్చు కౌరవ్యసం
గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పం జెద్దమిత్త్రక్కు మి
మ్మేమి మెల్లన్ వెఱఁగంది చూచెదము గా [2]కీనాఁటికిం బోయి వా
భీమునిం డిత్తఱి రిత్తమాటలకుఁ గోపింపంగ నేమి పజన్. 65

వ. అని పలికి యిట్లు తంబున గోపాలదేవు మెలంపుమొయిపడి కార్యవచనంబులకుం దగం దానును దోడ్తో సరసం బాడుటయు నా మఱుమాట లాడి యాతల దని వోవక బకమర్దనుం డతనితో ని ట్లనియె. 66

ఉ. కయ్యము గల్గిన ట్లయిన గంధగజప్రకరంబు లంధముల్
వ్రయ్యఁ దురంగపంక్తులు ధరం బడఁ దేరిగముల్ జకల్పఁగా
డయ్యమి కీవు వెక్కసపుఁ దక్ గదపంపు సేయఁ గోపనా
దయ్యమునెత్తికోలు దుది దాఁకుట గాదె భుజంగభంజనా. 67

చ. అన విని దేవకీతనయుఁ డాతని కి ట్లనుఁ జెప్పినంతకం
టెను మిగులంగఁ జేయుదు గదాఁడిందిమగండవు నిన్నుఁ [3]దెప్పగాఁ
గొని పలుమాఱు నాపదలకుం భయ మొందక దుఃఖవార్థు లీఁ
దినమము నెల్ల నిక్కొఱఁత దీర్చి సుఖాత్ములఁ జేయు పావనీ. 68

క. ఇదె పోయెదఁ గౌరవ్యులఁ, బదనికి రాఁ బలికి సంధి పాటించెద నా
కది యొప్పదె కాని తుదిం, గుదు రింతకు నీవ కావె గుణరత్ననిధీ. 69

—♦ అర్జునుఁడు శ్రీకృష్ణునితోఁ దనయభిప్రాయంబు సెప్పుట. ♦—

వ. అనిన వాసుదేవున కర్జునుం డి ట్లనియె. 70

తే. చెప్పఁ గలయంతవట్టును జెప్పె నీ క, జాతశత్రుండు వింటి పే వాతెఱంగు
మాకు నెల్లను బలుకంగ మాట లొండు, గలవె యైనను జెప్పెదఁ గన్నయంత.

మ. ధృతరాష్ట్రుం డతిలోభదూషితుఁడు ధాత్రీభాగ మీఁ డేర్చునే
సుతుఁడుం గష్టుఁడు సంధి యేల యగు నంకించుం మున్నకై పెక్కన
ట్టితలం బచ్యుత నీకుఁ గల్గినది గాండీవంబు దివ్యాస్త్రసం
తతియుం బెట్టినయట్లు యుండ మముఁ జింతం బాప రాదో కదే. 72

ఉ నీ వొనరింపఁ బూనినపనిం గమలోదర కీడు పుట్టునే
కా వనినట్లు యుండి యవుఁ గార్యము ల ట్లగుటం బ్రయత్నసం

1. క. నొకంటఁ. 2. జ. కీసారికిం. 3. గ. జ. దేపగా

భావన సేఁత పౌరుషము పద్ధతి తత్ఫలసిద్ధి వొందుచో
దైవము దోడ్పడక వలయుఁ దథ్యము రెండును నీవినోదముల్. 73
ఉ. వేఱిమి ధర్మజుం బరిభవించినద్రోహులు వధ్యు లన్న నె
వ్వారికిఁ బోలదే సుజనవత్సల నీ విటు లంట వారు మ
మ్మారస మెత్తి కీడ్పఱిచి యింతలు సేసినదాన నీమదిం
గూరిననొవ్వుసొంపునను గోపముపెంపునఁ గాదె యారయన్. 74
ఉ. ఐనను జిత్తగింపు ద్రుపదాత్మజ నాసభ నట్లు సేసినన్
దానికి సైఁప లెస్సయని దైన్యముఁ బొందుట కోర్చి యమ్మెయిం
గానకభూమికిం జనుట కారుణికోత్తమ నీ వెఱుంగవే
కాన సహించి పాండవులఁ గౌరవులం దగఁ గూర్చ నేర్పనన్. 75
తే. అలవిమెఱుఁగక ధార్తరాష్ట్రులు గడంగి, మమ్ముఁ బఱిచినపాటులు మానసమున
జవుటఁ బెట్టినవిత్తులు చంద మొంది, యంకురింపక చెడిపోయె నంబుజాక్ష. 76
వ. అమ్మెఱకుల నెమ్మెయినయినను.
క. ఒడఁబఱిచి మాకు వారికిఁ, బుడమి సగము గాఁగఁ జేసి పొంది పొసఁగి యుం
డెడునట్టి తెఱఁగు సేయుట, కడు మే లది గౌరవము సుఖంబును జేయున్. 78
క. నీ కిట్టిది చిత్తమునకు, రా[1]కుండిననేని వలదు రం డిమ్మెయిమీ
రీకార్యము సేయుం, డని, మా కానతి యిమ్ము కంసమర్దన తెలియన్. 79
మ. హిత మిబ్భంగిది మాకు ధర్మము తెఱం గి ట్లుండు నం చేను నీ
మతి బోధింప వలంతినే హితము ధర్మంబున్ విచారించి చూ
చి తగుం బొ మ్మని యేది పంచి తది నిశ్చింతంబునం జేసి యు
న్నతిఁ బొందం గలవార మై యునికి కృష్ణా నేఁడుగా వచ్చెనే. 80
వ. అనిన విని కృష్ణుండు విజయున కి ట్లనియె. 81
చ. వెరవున లావునం గృషికి వేయువిధంబుల మే లొనర్చినన్
దొరకొనునే ఫలంబు దఱితోఁ దగువర్షము లేక యున్న నె
ప్పరుసున లెస్స సేసినను బౌరుషముల్ ఫలియించు టెల్లనా
దరణమునం బ్రసన్న మగు దైవముచేతన చూవె ఫల్గునా. 82
ఉ. కావున సంధికిం బురుషకార మొనర్చెద నోపినంతయున్
దైవముచేత నె ట్లగునొ దాని నెఱుంగ సుయోధనుండు సం
భావన సేసి పా లొసఁగు [2]పాడియ కల్గిన బాల్య మాదిగా
నేవిధి నైననుం జెఱుప నింతలు పాపము లాచరించునే. 83
వ. అది యెల్ల న ట్లుండె నిచ్చట విరాటుపసులం బెట్టింప నీవు వోయినయప్పుడు
భీష్ముండు దుర్యోధనుతోఁ జెప్పిన తెఱంగు. 84

1. క. కున్నదియేని, గ. కుండినయేని 2. జ. పాటియ.

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు గా
లిచ్చికి నైన పెనఁగిన బలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగఁ గుంభజుం దొడరు ✽ చిల్లవిభేదంబుల కోర్చునట్లు గా
కిచ్చఁ దలంచి యొక్కఁడయి ✽ నిత్తఱిఁ బాండుసుతుచేతయుం బడున్. ౮౫

వ. అనియె దాని కతం డుత్తరం బిచ్చిన దెఱంగు. ౮౬

ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకు, నెట్లు పొందు గలుగు ✽ నేను రాజ్య
భాగ మీను సమరభంగిఁ గ విక్రమ,[1]నిరతిఁ బూను టిదియ ✽ నిశ్చయంబు. 87

వ. అని పలికె నది యంతయుఁ బుడంబడి మన మెల్ల వింటిమ కాదె యామాటల
ఫలం బప్పుడ కనియు నాకస్వాత్మ్యంబు వెండియుఁ దెలియందు. 88

తే. అతనిగుణదోషములచంద ✽ మట్ల యుండె, నాకుఁ ధర్మజుబుద్ధిన ✽ నడపవలయు
నిత్తెఱం గాచరింపంగ ✽ నేఁగి యచట, నెల్ల తెఱఁగును నేర్పడ ✽ నెఱిఁగివత్తు.

చ. అనిన ముకుందుతో నకులుఁ ✽ డల్లన యిట్లను నీకు ధర్మజుం
డును బవనాత్మజుండు నరుఁడుం దగఁ జెప్పిట చిత్త గాదు మా
మనము లరణ్యవాసముల ✽ మత్స్యమహీపతిపాల నున్నయ
ద్దినములభంగి గాదు కృపఁ ✽ దీవ్రత గుందినచంద మయ్యెడున్. 90

క. కడవఁగ నొకళ్లు పసరము, నడిచిన నొక్కళులుఁ జెయ్యు ✽ నడువ వలయునే
చెడుతెరు వాకౌరవ్యుల,కడ నిలుచుంగాక మనకుఁ ✽ గార్యం బేలా. 91

సీ. గోగ్రహణంబునఁ ✽ గోలె నెంతయు మెత్తఁ,బడ కుండుదురె వారు ✽ పద్మనాభ
నీయనుగ్రహమున ✽ నెమ్మిమైఁ గూడిన,బలము లే డక్షౌహిణులను దొరల
పాంచాలయాదవపాండ్యకైకేయమా,త్స్యుల తెంపు లెఱుఁగక ✽ యున్నవారె
భీమార్జునులలావు పెంపును నీసహా,యంబును గలుగుట ✽ కలుక రెట్లు

ఆ. గురుఁడు కృపుఁడు బాహ్లికుఁడు భీష్ముఁడును బుద్ధి, సెప్పి వారిఁ జక్కఁ ✽ జేయరెట్లు
కార్య మీవు సెప్పఁగా విదురుండు వి,నంగ నెట్లు గా ద ✽ నంగ వచ్చు. 92

వ. అట్లుం గాక నీవు దమపాలికిం బోవుట ధార్తరాష్ట్రు లాదరింప కుండ రెవ్వరే
నీపోయినప్పుడ యీకార్యంబు చక్కనగు ననిన విని సహదేవుండు వాసుదేవున
కి ట్లనియె. 93

ఉ. రక్కసమాట లాడెదరు ✽ రాజును దమ్ములు వానిలోన నీ
వొక్కటి యైనఁ గా దనక ✽ యూఁకొను చుండుట యంతకంటె మే
లక్కట యిట్లు వేఁడికొన ✽ నైనను బోయెదు వో సుయోధనుం
డెక్కడ భూమిలోన సగ ✽ మిచ్చుట యెక్కడ దానవాంతకా. 94

మ. తలపం గూడునె యింతలేసిదొర లీసైన్యంబు చుట్టంబులుం
జెలులుం దిట్టరె లాఁతిరాజులకు మెచ్చే యివ్విధం బిట్టిదిం

---

1. క. నియతి.

